# చతుర

అక్టోబరు 2012
రూ. 10/-



★ శిరంశెట్టి కాంతారావు
ఆకుపచ్చ విధ్వంసం ..6

★ జ్ఞానపీఠాలు
రవీంద్ర కేల్కర్ ..126

## ఈకలు లేని కోళ్లు

చికెన్ ప్రియులకు శుభవార్త! కోళ్లకు ఈకలు పీకడం, ఆనక శుభ్రం చేసుకోవడం వగైరా కష్టాలు తప్పే రోజులు వచ్చేస్తున్నాయ్. ఎందుకంటే ఇజ్రాయిల్‌కు చెందిన అవిగ్డర్ కహనెర్ అనే శాస్త్రవేత్త ఈకలుండని కోళ్లను సృష్టించారు. టెల్ అవీవ్‌లోని రెహొవత్ అగ్రోనమీ ఇన్‌స్టిట్యూట్‌లో బ్రాయిలర్‌తో, మరోరకం కోడిని సంకరం చేసి ఆయన ఈ అద్భుతం సాధించారు. ఈకల పోషణా భారం తప్పడంతో తక్కువ కాలంలోనే ఈ కోళ్లు బలిష్టంగా ఎదుగుతాయని చెబుతున్నారు.



## అభిమాన పాఠకులకు సరికొత్త శీర్షిక

# చతుర ప్ర.జ.

ఆచార వ్యవహారాలు పాటించేప్పుడు ఏవేవో అనుమానాలు..
సంస్కృతీ సంప్రదాయాల పరంగా ఎన్నో సంశయాలు..
పురాణాలు, ఇతిహాసాలు చదువుతున్నప్పుడు ఎన్నెన్నో సందేహాలు..
మాతృభాషా వినియోగంలో మరెన్నో శంకలు..

మీ అనుమానాలు.. సంశయాలు.. సందేహాలు..
శంకలు అన్నీ సంక్షిప్తంగా రాసి మాకు పంపండి.

పంచ సహస్రావధాన సార్వభౌమ **డా. మేడసాని మోహన్**
సమాధానాలు ఇస్తారు. పరిష్కారాలు సూచిస్తారు.

**ప్రతినెలా ఉత్తమ ప్రశ్నకు రూ.116/- పారితోషికం**

## చతుర ప్ర.జ. -1

ప్రశ్న: ..............................................................
..............................................................
..............................................................
..............................................................

పంపినవారి పేరు: ------------------------------------

వయసు (      ) చిరునామా: ------------------------------------

------------------------------------------------------------

--------------------పిన్ : ------------ ఫోన్ : ------------------

**సూచనలు**

• ఉత్తమ ప్రశ్నను అవధాని డా. మేడసాని మోహన్ ఎంపిక చేస్తారు. • మీ ప్రశ్న ద్వారా రాబట్టే సమాధానం పదుగురికీ ఉపయోగపడేలా ఉంటే మేలు. • ప్రశ్న స్పష్టంగా, సంక్షిప్తంగా ఉండాలి • ఒకరు ఎన్ని ప్రశ్నలయినా పంపవచ్చు. ఒక కూపన్‌పై ఒక్క ప్రశ్న మాత్రమే రాయాలి • తుడుపులు, కొట్టివేతలొద్దు • ప్రశ్నల ఎంపికలో సంపాదక వర్గానిదే తుది నిర్ణయం • ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు • ఈ కూపన్లు కూడా తక్కిన వాటితో కలిపి ఒకే కవరులో పంపవచ్చు

చిరునామా : **చతుర ప్ర.జ.**

చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 082

# మనసున ఉన్నదీ...



★ సెప్టెంబరు నవల 'తోకచుక్క' చాలా బాగుంది. ప్రేమ ఎప్పుడు, ఎలా మొదలైనా రెండు మనసులూ దానికి స్పందించాలి. ముఖ్యంగా పరం లాంటివాళ్లు చాలామంది మన చుట్టూరా ఉంటారు. హేలీలాంటి మంచి వారు కూడా ప్రేమ విషయంలో ఇలా మారి పోతారంటే ఆశ్చర్యం వేస్తుంది. ఇందులాంటి సున్నిత హృదయంగలవారు చాలా అరుదు. ఈ నవల మా కుటుంబ సభ్యులందరికీ బాగా నచ్చింది. అలాగే అగాథా క్రిస్టీ కథ 'సాక్ష్యం' చాలా ఆసక్తికరంగా చదివించింది. ఇలాంటి కథలను అందిస్తున్నందుకు ధన్యవాదాలు.

**– కైలా భవ్యరాజు కుమార్,** రేపల్లె

★ నేను, నా కుమారుడు ఇద్దరమూ 'చతుర', 'విపుల' అభిమానులమే. పత్రికలు రాగానే పోటీలు పడి చదువుతాం. అలాగే అన్ని శీర్షికల్లోనూ తల దూరుస్తుంటాం. సరదాగా 'కాప్షన్ మీదే', 'మనసున ఉన్నదీ...', 'చతురంగం' శీర్షికలకు జవాబులు రాస్తుంటాం. అన్ని బహుమతులూ మాకే రావాలని మాత్రం కాదు.

**– వెల్మల రాంరెడ్డి, నిరంజన్‌రెడ్డి,** కరీంనగర్

★ 'తోకచుక్క' నవల చాలా బాగుంది. ఇప్పటికీ మగవారు స్త్రీల బలహీనతలను సొమ్ము చేసుకుంటుంటారు. తాను చేసింది తప్పు అని తెలిసినా ఆ తప్పుకు బలికాకుండా దృఢంగా నిలబడేవారు కొద్దిమందే. ఇక 'సాక్ష్యం' కథ ఆద్యంతం సస్పెన్స్‌తో కొనసాగింది.

**– లహరి,** బెల్సార్

★ సెప్టెంబరు నవల 'తోకచుక్క' ద్వారా రచయిత్రి ఎం. లక్ష్మీ రమణకుమారి ఒక గృహిణిగా, ఉద్యోగినిగా స్త్రీ నిర్వహించే పాత్రను చక్కగా వివరించారు. మహిళలు ఎదుర్కొనే సమస్యలను బాగా చిత్రించారు. ఇక 'చతురంగం' శీర్షిక ద్వారా మాలాంటి విశ్రాంత ఉద్యోగులకు మంచి కాలక్షేపం అవుతోంది.

**– బచ్చు సత్యనారాయణ,** కొత్తగూడెం

★ సెప్టెంబరు సంచిక చతురంగా సాగింది. డా. సంజీవదేవ్ చతురోక్తులు దీపావళి టపాసుల్లా పేలాయి. చతురకత 'తెర వెనుక మనిషి'లో మానసిక చిత్రణ బాగుంది. అనువాద కథ 'సాక్ష్యం' కథనా శిల్పానికి సాక్ష్యంగా నిలిచింది. 'చతురంగం' పజిల్ కూడా మెదడుకు మేత పెట్టింది.

**– డా. శివభూషణం,** కర్నూలు

★ 'తోకచుక్క' నవల ఆద్యంతం ఉత్కంఠగా చదివించింది. ముగింపు చాలా బాగుంది. 'సంజీవ్‌దేవ్' చతురోక్తులు, కాప్షన్ మీదే వ్యాఖ్యలు ఆకట్టుకున్నాయి. 'కొత్తగాలి' కవితలు మధురంగా ఉంటున్నాయి. చివరి కవర్ పేజీలో ప్రకృతి సోయగాల్ని అందించాలని కోరుతున్నాం.

**– భాగ్యశ్రీ రాజేష్,** పాన్కల్

★ చతుర నవల 'తోకచుక్క' ఏకబిగిని చదివించింది. రచయిత్రి ఎంతో అబ్బురపడేలా రాశారు. ఇందులో చర్చించినది సున్నితమైన, క్లిష్టతరమైన అంశం. వివాహేతర ఆకర్షణలన్నీ విషాదానికే దారితీస్తాయని తెలిసీ ఎలా ఆ వలయంలో చిక్కుకుపోతారో ఇందూ పాత్ర ద్వారా తెలిపారు. అగాథా క్రిస్టీ 'సాక్ష్యం' కథ ఆసక్తిగా చదివించింది. సంజీవదేవ్ చతురోక్తులు కూడా ఆకట్టుకున్నాయి.

**– వాలి హిరణ్మయీ దేవి,** హైదరాబాద్

★ చతురకత 'తెరవెనక మనిషి' ద్వారా రచయిత ప్రాపంచిక సత్యాన్ని వివరించారు. అగాథా క్రిస్టీ 'సాక్ష్యం' తెలుగు పాఠకులకు అందించినందుకు ధన్యవాదాలు. 'తోకచుక్క' నవలలో రచయిత్రి మింగలేని, కక్కలేని ఎన్నో నిజ జీవిత సమస్యల్ని ఆవిష్కరించారు.

**– ఎస్. వి. రమణి,**
బంజారా హిల్స్, హైదరాబాద్

---

చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082
ఈ మెయిల్ :
vipula.chatura@eenadu.net

సంపుటి -35 సంచిక - 9
417వ సంచిక, పేజీలు : 132
అక్టోబరు 2012

# చతుర



'ఈ డబ్బాను రహస్యంగా కృష్ణారావు మాష్టారింట్లో పెట్టు' అన్నాడొకడు ఎండమ్మతో. 'ఈ పన్జేస్తే నీకు పది లక్షలిస్తాం. లేకపోతే నీపాట్లు కుక్కపాట్లే' చెప్పాడు మరొకడు. 'ఏంటుంది అందులోన?' అడిగింది ఎండమ్మ ధైర్యంగా. 'అందులో బాంబు ఉంది' చెప్పాడొకడు గుట్కా నములుతూ. 'నేను సచ్చినా ఆ పని సెయ్యలేను' బదులిచ్చింది ఎండమ్మ. అంతలోనే ఒకడు వచ్చి మొరటుగా ఎండమ్మ చీరచెంగు గుంజేశాడు. ఆ తర్వాతేం జరిగింది? వారి నుంచి ఆమె తప్పించుకుందా? లేక మాస్టారింట్లో బాంబు పెట్టిందా? ఇంతకీ మాస్టారుకు, ఎవరితో ఎందుకు వైరం ? ఆద్యంతం ఆసక్తిగా చదివించే

**శిరంశెట్టి కాంతారావు**

విభిన్న నవల

**ఆకుపచ్చ విధ్వంసం**

6వ పేజీలో

బొమ్మలు : పిన్నాడ రవి

# ఆకుపచ్చ విధ్వంసం

## - శిరంశెట్టి కాంతారావు



పచ్చగా కళకళలాడుతున్న వేలాది
ఎకరాల బీల భూములపై ఆధారపడి
బతుకుతున్న గ్రామస్తులు ఆ భూములకు
హఠాత్తుగా ధరలు పెరగడంతో
ఎగబడి అమ్మేసుకున్నారు.
ఆ తర్వాత ఆ పని ఎంత ప్రాణాంతకమైనదో
తెలిసి విలవిల్లాడారు.
ఇంతకీ ఆ భూముల రేట్లు పెరగడానికి కారణాలేంటి?
ఆ బీదాబిక్కీ జనానికి వచ్చిన ముప్పేమిటి?
ఆద్యంతం ఆసక్తిగా చదివించే
విభిన్న నవల
చతుర పాఠకులకు దసరా కానుక!

జీవభద్రలో తాతారావు కాలుపెట్టి ఆ రోజుకి సరిగ్గా సంవత్సరంన్నర అవుతుంది. అతను రావడం రావడమే పూతాకాతా మీదున్న పచ్చటి పెసర చేనుకు గొంగళిపురుగు పట్టినట్టు వచ్చిపడ్డాడు. గొంగళి పురుగు పెసర మొక్కలోని జీవసారమంతా పీల్చి పారేసినట్టు ఈ సంవత్సరంన్నరగా ఊళ్ళో ఒక్కొక్కళ్ళను ఒక్కోరకంగా బుట్టలో వేసుకుని మెల్లమెల్లగా వాళ్ళ 'బీల' భూముల్లో పాగా వేశాడు.

అతను ఊళ్ళోకి రావడమే ఓ పథకం ప్రకారం వచ్చాడు.

అదెలాగంటే...

ఎప్పటిలాగే ఆ ఏడు కూడా చైత్ర మాసంలో జీవభద్ర గ్రామంలో కొలువై ఉన్న కోదండరామస్వామివారికి నవమి రోజున కల్యాణం జరిపించాలన్న ఆలోచనతో ఊరంతా కదిలివచ్చి రచ్చబండ దగ్గర అల్లూరి విగ్రహం పక్క వేపచెట్టు కింద చేరింది.

ఊరివాళ్ళనందరినీ ఓసారి తల ఎత్తి పరికించి చూసిన గ్రామ సర్పంచ్ అలుగురాజు "ఊళ్ళో ఇంటికొకరి వంతున అందరూ వచ్చేసినట్టేనా? " అంటూ జనాంతికంగా ప్రశ్నించాడు.

"ప్రెసిడెంటు బావూ! అందరొచ్చేసినారు కాని నువిక మొదలెట్టుమీ" రచ్చబండ మీద కూర్చున్న గ్రామపెద్దల చుట్టూ వలయంగా కూర్చున్న గ్రామస్తుల్లో అందరి కన్నా పెద్దవాడైన సంకా శంకరయ్య అన్నాడు చనువుగా.

"అలాగే మొదలెడుతున్నా గాని శ్రద్ధగా ఇనుకొండీ! తాతల్నాటి నుంచి మనూర్లోన ప్రతేటా నవమికి రామ కల్యాణం జరిపించే ఆనవాయితీ ఉంది గదా? మరి ఈ ఏడు గూడా అదేమాదిరిగా కల్యాణం జరిపించాలి గదా! ఆ రామయ తండ్రికి మన మీద దయుండబట్టే మనకి కన్నతల్లిలాంటి 'బీల' నిచ్చాడు. దాని మీద మనూరేటి? మనూరు చుట్టూ ఇరవైనాలుగు గ్రామాల జనం కడుపులోన సల్ల కదలకుండా బతికేత్తున్నారు కాదేటి?

మరంచేత గ్రామ పెద్దలమంతా నిరుడు కన్న ఈ ఏడు కల్యాణం ఘనంగా జరిపించుదామనుకుంటున్నం. కాబట్టి ఊళ్లోన గ్రామస్తులంతా ఎవల శక్తిమేరకాళ్ళు సందాలిచ్చి దేవుని పెళ్ళికి సాకరించాలని గ్రామ సర్పంచ్‌గా అందర్నీ కోరుతున్న" అంటూ తను చెప్పదలచుకున్న విషయాన్నంతా పూసగుచ్చినట్టు గ్రామస్తులకు వివరించాడు సర్పంచ్ అలుగురాజు.

ఆ రచ్చబండకు దక్షిణంగా ఉన్న మెరక వీధి దిగువన పశువుల ఆస్పత్రి ఎదురుగా వడ్లమిల్లు పెట్టి, సంవత్సరం పొడవునా ఆ వీధిలో వాళ్ళకు కంటి నిండా నిద్ర లేకుండా మిల్లు నడుపుతూ, ధాన్యం వ్యాపారం చేస్తూ రెండు చేతులా సంపాదిస్తున్న ఉడతా బొర్రయ్యని చూస్తూ "బొర్రయ్య తాతా! ఊళ్ళోన నువ్వే అందరి కన్నా షావుకారివి. అంచేత అందరికన్నా ముందు నీ సందా ఎంతో ప్రకటించుమీ" అంటూ అక్కడ చేరిన ఊరు కుర్రకారంతా గోలగోలగా అరవసాగారు.

"ఇదేట్రా నాయన్లారా! ఊళ్ళోన ప్రద్దానికి ముందు నన్నిరికిస్తారేట్రా బావూ!? ఇది దేవుని కార్యం. దేవుని పెళ్ళికి అందరూ పెద్దలే గదట్రా! ఈడగూడా నన్నే ముందుకు నెట్టకండ్రా బావూ! మీకు దండమెడతాగాని" ఊళ్ళో అందరికన్నా మిన్నగా తనను కుర్రవాళ్ళు గుర్తించినందుకు లోపలోపల సంతోషపడుతూనే పైకి మాత్రం అందుకు విరుద్ధంగా మాట్లాడాడు బొర్రయ్య.

"మేమేటన్నామేటి? ఉన్నమాటే గదా అంతన్నాం!" మరి కొంచెం గాలి కొడుతూ

బొ్రయ్యతో అన్నారు గ్రామ యువకులంతా.

"ఏటా ఉన్నమాటా? ఏటున్నది నా దగ్గిర బూడిది. యాపారాలు లేక ఈగలు తోలుకుంటుంటేనూ.. ఐనా సర్లే కానీండి మీరింత మంది సెప్పింతరాత కూఢా కాదంటే ఏటి బావుంటాది? నా పేరు మీద ఓ వెయ్యిన్నూట పదహార్లు రాస్కోండి!" అంటూ బీద అరుపులు అరిచాడు బొ్రయ్య.

"నువ్వేటి? ఊల్లో నీ పొజీషనేటి? ! ఎందుకలగ మాట్లాడ్తావ్ బొ్రయ్య తాతా! పైన తథాస్తు దేవతలుంటారు జాగ్రత్త! ఎండాకాలంలోన నీ కార్రం మిల్లు తోటి, పండగ పబ్బాలకు నీ పిండిమిల్లు తోటి, మూడొందలరవై రోజులు ఆ వడ్లమిల్లు దుమ్ముతోటి వీది జనమంతా తుమ్మలేక, దగ్గలేక రోగాల్తోటి ఛస్తుల్లే. నడి ఊళ్ళో మిల్లు పెట్టి ఊరివాళ్ళ ఆరోగ్యం చెడగొడుతున్నందుకైనా నువ్వు పదివేలకు తగ్గకుండా రాయాల్సిందే" అంటూ షావుకారు బొ్రయ్యను ఊరి కుర్రాళ్ళంతా వత్తిడి చేస్తూ అతని పీకల మీద కూర్చున్నారు.

"నన్ను చంపీసినా వెయ్యాన్నూట పదహార్ల కంటే ఎక్కువిచ్చుకోలేను గాని నన్నొగ్గేయండ్రా బావూ!" అన్నాడు బొ్రయ్య.

'అసలే మొండిదున్న అందులోను కాలు గర్రు పడింది, బీలలో తూటికాడ తిని పుర్రు పెడుతుంది. పైగా బురదగుంటలో పడుకుంది. ఇంకదాన్ని లేపడం ఎవరి తరం?' అన్నట్టు పూర్తిగా మొండికేస్తూ మాట్లాడాడు బొ్రయ్య.

"నిన్ను సంపితే మాకేటొస్తుంది నాభం? జైల్లోన చిప్పకూడు తింటం తప్పించి" అంటూ కుర్రాళ్ళంతా మరింతగా బొ్రయ్యను ఆట పట్టించసాగారు.

"సరే సరే ఆయన కత అట్లుంచి, మిగతావాళ్ళ సంగతేటో కూడా చెప్పండి" వ్యవహారాన్ని సాధ్యమైనంత సున్నితంగా ముగించాలన్నట్టు లౌక్యంగా మాట్లాడాడు సర్పంచ్ అలుగురాజు.

సర్పంచ్ మాటలు విన్న ఊరి వాళ్ళంతా ఒకరితో ఒకరు గుసగుసలాడుకోసాగారు తప్ప ఎవ్వరూ ముందుకొచ్చి ఇంతా, అంతా అనడంలేదు.

ఇంతలో "నేను ముప్పై వేలిస్తాగాని నా పేరు రాసుకోండి!" సర్పంచ్ చుట్టూ దడి కట్టి నిల్చున్న ఊరి జనం వెనుక నుండి ఎద్దు రంకె వేసినట్టు ఎవరో అరిచారు.

ఆ కేక వినిపించిన దిక్కుకు చప్పున తలలు తిప్పి ఆశ్చర్యంగా చూసిన ఊరి జనం కళ్ళ ముందు ఎవరో కొత్త వ్యక్తి కన్పించడంతో 'ఈనెవరబ్బా!' అన్నట్టు అతని వంక రెప్పలు వేయడం కూడా మరిచిపోయి చూడసాగారు. చూడడమే కాదు, అతను రచ్చబండ మీద ఉన్న సర్పంచ్ దగ్గరికి రావడంకోసం అప్రయత్నంగా పక్కకు జరిగి దారి ఇచ్చారు.

ఆ కొత్తవ్యక్తి ఎవరోగాని దగ్గర దగ్గరగా ఆరడుగుల ఎత్తున్నాడు. ఎత్తుకు సరిపడా లావు లేకపోవడంతో కొంచం సన్నగా అన్పిస్తున్నాడు. తలమీద ఉంగరాల జుట్టుకు నిన్న మొన్ననే రంగు వేసినట్టుగా నల్లగా నిగనిగలాడుతోంది. మీసాలతో సహా ఉదయమే షేవ్ చేసుకున్న గడ్డం నున్నగా మెరుస్తోంది. నల్లటి వంటికి తెల్లటి ఖద్దరులుంగీ చుట్టుకుని, దానిమీద హాఫ్ చేతుల ఓపెన్ షర్టు తొడుకున్నాడు. ఎడమపక్క షర్ట్ జేబులో నుండి వెయ్యి రూపాయల నోట్లకట్ట ఎత్తుగా కనిపిస్తోంది. అతని కుడిచేతి నాలుగు వేళ్ళకు నాలుగు బంగారు ఉంగరాలు, వాటిపైన మణికట్టు మీద జెర్రిపోతులాంటి బ్రాస్లెట్, ఎడమచేతికి గోల్డ్‌చైన్ వాచ్, మెడలో బర్రె పలుపంత బంగారు గొలుసు, కుడిచేతి పిడికిటిలో బ్లాక్‌బెర్రి

మొబైల్ ఫోన్‌తో కుబేరుని బాబులా డాబుసరిగా నడుచుకుంటూ సర్పంచ్ దగ్గ రికొచ్చాడు.

అతను తన దగ్గరికి రాగానే సర్పంచ్ అలుగురాజు కూర్చున్న వాడల్లా అప్రయత్నంగా లేచి నిలబడి తన పక్కన కూర్చో మన్నట్టుగా కుడిచేత్తో సైగ చేశాడు.

అంతలోనే ఎక్కణ్ణుంచి ఊడిపడ్డాడో, ఏమోగాని గబ గబ ఉరికొచ్చి తన భుజం మీద తువ్వాలుతో రచ్చబండ మీద లేని దుమ్మును దులిపి "ఇలాగ్గుచ్చోండి బావూ!" అంటూ చచ్చిన గొడ్డు వాసన బట్టిన దూడ బాతు ఎక్కణ్ణుంచో ఎగిరొచ్చి దండెం మీద వాలినట్టు ఆ కొత్తవ్యక్తి దగ్గర డబ్బుల వాసన పసిగట్టిన కన్నదాసు కళ్ళు ఆర్చుతూ అతనికెదురుగా చేతులు కట్టు కొని నిల్చున్నాడు.

ఎంతో దర్జాగా వచ్చి సర్పంచ్ పక్కన కూర్చున్న ఆ కొత్తవ్యక్తి అక్కడ గుమిగూడి ఉన్న ఊరివాళ్ళందరినీ ఒక్కసారి పరీక్షగా పరికించి చూస్తూ అంతకు ముందే ఎంతో పరిచయం ఉన్నవాడిలా చిరునవ్వులు న వ్వాడు.

"మందేవూరు బావూ!? " ఆ ఆగంతకుని వంక కుతూహలంగా చూస్తూ ఎంతో గౌర వంగానూ, మరింత నెమ్మదిగానూ అడి గాడు బొర్రయ్య.

ఆ! మాట అడిగిన బొర్రయ్య వంక ఆహ్లాదంగా చూస్తూ "నా ఊరేదో చెబితే తప్ప నన్నిక్కడ కూర్చోనివ్వరా ఏంటి? " ఆటపట్టిస్తున్నట్టుగా అడిగాడా కొత్తవ్యక్తి.

"అలగని కాదు బావూ! ఎవలో ముక్కూ మొగమూ తెలీని మనిషి ఒక్కసారిగా చుక్క తెగిపడ్డట్టు ఎక్కణ్ణుంచో ఊడిపడి అడక్కుండానే అన్ని డబ్బులిస్తానంటే అత నెవరైందీ తెలుసుకోవాలనుంటుందిగా!" అక్కడ చేరిన ఊరి వారందరి అభిప్రాయమూ అదేనన్నట్టుగా అడిగాడు రామా లయం పూజారి అయ్యప్ప దీక్షితులు కలు గజేసుకుంటూ.

"మీరన్నదీ నిజమేలే స్వామీ! మాది ఏలూరు" అంటూ తనదేవూరో తెలియజే శాడా కొత్తవ్యక్తి.

"ఇంతకూ తవరి పేరేటి బావూ? " రెండుచేతులూ జోడించి దోయిలి వగ్గుతూ వినయంగా ముందుకు వంగి నిల్చుంటూ ఆరాధనగా కళ్ళు అరమోడ్పులు చేస్తూ విశ్వాసపాత్రంగా ప్రశ్నించాడు కన్నదాసు.

"నాపేరు తాతారావు" మనసులో ఓ వంక అక్కడ గూమిగూడి ఉన్న ఊరి జనం తెలివితేటలను, వాళ్ళు నిల్చున్న తీరులోనే అంచనా వేసుకుంటూ సమా ధానం ఇచ్చాడా కొత్తవ్యక్తి.

"ఈ ఊళ్ళోన పుట్టి, ఈ ఊళ్ళోనే పెరిగి, ఈ ఊరి మీద సంపాదిస్తున్న మా బొర్ర య్యా దేవునికి ఓ ఐదువేలిమ్మంటే ఉత్తిచే తులు చూపిస్తన్నాడు. అటువంటిది యాణ్ణించో వచ్చినవ్. ఎందుకొచ్చివో కూడా తెలియదు. అట్టాంటి నువ్వు ఉత్తి పున్నేనికంత డబ్బెందుకు ఇస్తానంటున్నావు బావూ? " ఊరి ఆడవాళ్ళ మధ్య నిలబడి అప్పటిదాకా జరుగుతున్న తంతునంతా చిత్రంగా చూస్తున్న ఎండమ్మ కొరమీను మొప్పల్లోకి బొరుసుగడ్డి వెన్నును గుచ్చి నట్టు సూటిగా అడిగింది తాతారావును.

ఎండమ్మ మాటతీరుకి విస్తుబోయిన తాతారావు 'ఈమెవర్రా బాబూ? ' అను కుంటూ ఆమె వంక పరిశీలనగా చూశాడు.

ఎండమ్మకు నలభై రెండేండ్లుంటాయి. మనిషి నిండుగా, నిమ్మపండు ఛాయతో నిగారిస్తూ ఐదున్నర అడుగుల ఎత్తుతో, ఆరోగ్యంగా కన్పిస్తోంది. మబ్బురంగు జాకెట్ తొడుక్కొని, కనకాంబరపు రంగు నేతచీర కట్టుకుంది. చెవులకు నెమలి పింఛం, తెల్లరాళ్ళ కొమ్ముజోడు పెట్టుకొని,

## మరుగునపడ్డ చిహ్నం!

లిబర్టీ స్టాచ్యూ అమెరికాకి చిహ్నం. అయితే అంతగా ప్రాచుర్యంలో లేని మరో సింబల్ కూడా ఆ దేశానికి ఉంది. అది లిబర్టీ బెల్. దీనిని లండన్‌కు చెందిన లెస్టర్ అండ్ పేక్ కంపెనీ తయారు చేసింది. ఆగస్ట్ 1752లో ఇది అమెరికా చేరుకుంది. ఆనాటి అమెరికా రాజధాని ఫిలడెల్ఫియాలో అమెరికా స్వాతంత్ర్యానికి చిహ్నంగా దీన్ని ఏర్పాటు చేశారు. మొదటిసారి గంటని మోగించగానే ఆశ్చర్యంగా దానికి పెద్ద బీట ఏర్పడింది! రెండు సార్లు దీన్ని స్థానికంగా జాన్ పాస్, జాన్‌స్టో అనే ఇద్దరు మరమ్మతు చేశారు. వీరి పేర్లు ఈ గంట మీద చూడొచ్చు. అప్పట్లో చట్టసభ మొదలవుతోందని తెలియజేయడానికి, ప్రజలను బహిరంగ సమావేశాలకు ఆహ్వానించేందుకు ఈ గంటను మోగించేవారు. జులై 8, 1776న ఫిలడెల్ఫియాలో డిక్లరేషన్ ఆఫ్ ఇండిపెండెన్స్ డాక్యుమెంట్‌ను ప్రజలకు చదివి వినిపించడానికి ముందు కూడా ఈ గంటను మోగించారు. ఆ తర్వాత దీని ప్రాశస్త్యం క్రమంగా తగ్గింది. తిరిగి 1830లో దీనికి 'లిబర్టీ బెల్' అని నామకరణం చేసి, అమెరికా జాతీయ చిహ్నంగా గుర్తించారు. పన్నెండు అడుగుల చుట్టుకొలత గల ఈ బెల్ 1847లో రాసిన ఓ చిన్నకథ ద్వారా మరింత ప్రాచుర్యాన్ని పొందింది. అందులో దీన్ని మోగించిన వ్యక్తి మరణించడం, దానికి బీట రావడం ఇతివృత్తం. ప్రస్తుతం ఫిలడెల్ఫియాలోని ఇండిపెండెన్స్ హాల్‌లో దీన్ని ఉంచారు.



చేతులకు రంగు వెలసి నల్లబడిపోయిన రోల్డుగోల్డు గాజులు తొడుక్కుంది. కాళ్ళకు వెండి కడియాలు పెట్టుకుంది. ముక్కుకు బేసర్లు లేవుగాని ఇంతకు ముందు పెట్టుకున్నట్టుగా పూడిపోయిన గుర్తులు కన్పిస్తున్నాయి.

ఎండమ్మవాళ్ళు మత్స్యకారులు, కుల వృత్తే జీవనాధారం. ఉంటున్న పెంకుటిల్లు తప్ప వేరే ఆస్తిపాస్తులేవీ లేని నిరుపేద కుటుంబం ఆమెది.

ఎండమ్మ భర్త వీరబాబు మూడేండ్ల కిందట తేళ్లమెట్ట దగ్గర చేపల వేటకు వెళ్ళి నల్లతాచు కరచి అక్కడికక్కడే చచ్చిపోయాడు. అతను చచ్చిపోయేనాటికి వాళ్ళ పెద్దమ్మాయి గంగ పెద్దమనిషయ్యింది. పెండ్లి సంబంధాలు కూడా చూస్తున్నారు. రెండో అమ్మాయి మంగ గవర్నమెంట్ స్కూల్లో ఎనిమిదో తరగతి చదువుతోంది. ఆ ఇద్దరు ఆడపిల్లల తరువాత ఒక మగ పిల్లవాడు గంగాధరం. చిన్నక్కతో పాటు అదే స్కూల్లో వాడు ఐదవ తరగతి చదువుతుండేవాడు.

వీరబాబు ఎండమ్మకు ఏ సంపద ఇవ్వకపోయినా సంతానాన్ని మాత్రం ఇచ్చిపోయాడు. అయినా ఎండమ్మ ఎప్పుడూ కూడా తన పిల్లల భవిష్యత్తు గురించి గాని, వాళ్ళ బతుకుతెరువు గురించి గానీ భయపడలేదు. ఎప్పుడన్నా ఏ సందర్భంలోనన్నా బంధువులో, తెలిసినవాళ్ళో ఎవరన్నా 'ఏటో పాపం! ఆడమనిషివి ఒక్కదానివి, రెక్కల కష్టం మీద ఆధారపడి ముగ్గురు పిలకాయిల్ని ఎలగ పెంచుతావో? ఏటో?' అంటూ సానుభూతిని చూపిస్తే చాలు, అరక్షణం కూడా ఆలోచిం

చకుండా... మాటలకు ఏ మాత్రం తడుముకోకుండా "మా ఖర్మం బాలేక తనెల్లిపోయిండు. మరేటి సేస్తం! తనెల్లిపోయిండని బెంగెట్టుక్కూర్చుని ఏడుస్తే బుగితెట్టా ఎల్లుద్దేటి? ఊరిసెంతన్నే కన్నతల్లి లాంటి బీలుంది, ఒంటిలోన సేవుంది. కష్టపడితే సాలు, కడుపులోన అన్నం మెతుకుల కేటి కరువుంటాది? " అంటూ కూటికి, గుడ్డకు అక్కరకు రాని ఆ సానుభూతిని నిష్కర్షగా తిరస్కరిస్తూ ఎండమ్మ వాళ్ళ నోళ్ళు మూయిస్తుంది.

అన్నట్టుగానే భర్త పోయినప్పటి నుండి వల, ఊత అందుకున్న ఎండమ్మ ఉదయం ఏడుగంటలకల్లా తయారై బీలకు వెళిపోతే మధ్యాహ్నం మూడుగంటలకల్లా తక్కువలో తక్కువ ఐదారు కిలోల చేపలు పడుతుంది. ఆ తరువాత వాటిని స్వామిపేట, శివపురం, పెంచిలి ఒక్కోసారి విలాస దాకా తీసుకెళ్ళి అమ్ముకొని రాత్రి ఆరు, ఏడుగంటల తరువాత ఇల్లు చేరుతుంది.

భర్తపోయిన ఈ మూడేండ్లలో ఏనాడు ఒకరి చేతి కిందికి కూలికి, నాలికి పోకుండా, ఒకరి దగ్గర చేయిచాచి 'దేహీ' అని యాచించకుండా చేపలుపట్టి అమ్ముకుంటూ ఒకరి ముఖం మీద తన్నినట్టు పిల్లలను సాదుకుంటోంది.

భర్త ఉన్నప్పుడు మాట్లాడుకున్న సంబంధాన్నే ఖాయం చేసిన ఎండమ్మ ఈ మధ్యనే పెద్దపిల్ల గంగకు పెళ్ళి చేసింది. రెండోపిల్ల మంగను గవర్నమెంట్ జూనియర్ కాలేజీలో ఫస్ట్ ఇంటర్‌లోనూ, పిల్లవాడు గంగాధరాన్ని టెన్త్‌లోనూ చేర్పించి చదివిస్తోంది.

అందుకే ఎండమ్మ ఎవరితోనైనా మంచీ, చెడూ మాట్లాడే సందర్భంలో ప్రతిసారి 'బీల నా తల్లి కాదేటి? ఆ తల్లి దయ ఉన్నంతకాలం నాను నా పిల్లల్ని సాకలేనన్న భీతి నాకేటి లేదు మరి" అంటూ గుండెలమీద చేతులేసుకుని ధైర్యంగా చెప్పుకొచ్చేది.

ఎండమ్మకు రోజులలా నల్లేరు మీద నడకలా సాగిపోతున్నాయి. అల్లుడు పెద్ద కూతుర్ని చక్కగా చూసుకుంటున్నాడు. చిన్న పిల్లలిద్దరూ జాగ్రత్తగా చదువుకుంటున్నారు.

ఎండమ్మ మాటతీరుకు తాతారావు చేదు మాత్ర మింగిన వాడిలా ముఖం చిట్లించి చూస్తూ "ఏలూర్లో ఉన్న మా పొలాలన్నీ సెజ్‌లో కల్సిపోయాయి. అందుకన్జెప్పి ఇక్కడి పట్టా భూములేమైనా ఉంటే కొని చేపల చెరువులు పెడదామన్జెప్పి ఇటువైపొచ్చాను" అన్నాడు. తన ఉనికేంటో? నిజంగా తను వచ్చిన పనేంటో? తను చెబుతున్నదానిలో నిజమెంతో? అబద్ధమెంతో? అక్కడ ఉన్నవాళ్ళకెవ్వరికీ తెలియకపోయినా పటపటా పదినిమిషాల పాటు తనగురించి వివరించాడు తాతారావు.

తాతారావు మాటలు సరిగా వినిపించుకోని కన్నదాసు "ఏటి బావూ! ఈడ బీల భూవులు గొని యెవసాయం గానీ సెయ్యాలనుకుంతున్నారేటి? " భూముల్లో ఏడాదంతా నీళ్ళే ఉంటాయి గదా! మరక్కడ వ్యవసాయం ఎలా చేస్తాడన్న

**కొత్తగాలి...**

**జన్మదినాలొకటైనా**
**జాతిరత్నాలు రెండు**
**జాతిపిత గాంధి**
**జాతిప్రధాని శాస్త్రి**

– నండూరి నాగేశ్వరరావు,
హైదరాబాద్

ఆశ్చర్యం గొంతుపట్టనంతగా వ్యక్తం చేస్తూ అడిగాడు.

"కాదు కాదు.. చేపల చెరువులు పెడదామని" మరింత నిజాయితీని తన గొంతులో జోడిస్తూ మృదువుగా చెప్పాడు తాతారావు.

"అల్లది అలగా సెప్పు బావూ! మేమూ ఉన్నాం, ఏట్లాబం! ఇంతింత గుంటలప్పట్నుండి ఈడే పుట్టినాం, ఈడే పెరిగినాం గాని, ఈ ఉపాయం మాకు తట్టినాదేటి? ఏవైనా మీ డెల్టా కిందోళ్ళ బుర్రలు మా గెట్టిబుర్రలు బావూ!" అప్పటిదాకా మాట్లాడని సర్పంచ్ అలుగురాజు తనూ కల్పించుకుంటూ అన్నాడు, తాతారావు వంక అభినందిస్తున్నట్టుగా చూస్తూ.

"ఇప్పుడు బీల భూముల్లో ఎకరం ఎంత నడుస్తోంది? " సర్పంచ్ వంక చూస్తూ కిందకు జారిన బ్రాస్‌లెట్‌ను అందరి దృష్టీ పడేలా చెయ్యెత్తి పైకి జరుపుకుంటూ అడిగాడు తాతారావు.

"ఎకరం నలభై నుండి లచ్చదాకా నడుస్తోంది బావూ!" ఎంత చెబితే ఊరి వాళ్ళతో ఏం తంటా వస్తుందోనన్న సంశయం మనసులో ఓ పక్క పీకుతున్నా ఎందుకైనా మంచిదని అసలు ధరకు అదనంగానే చెప్పాడు, బొర్రయ్య మధ్యలో కలుగజేసుకుంటూ.

"నేనింకో పాతిక కలిపి ఎకరాకి లక్షా పాతికవేలిస్తాను గాని మీరు భూములు మాట్లాడి పెట్టండి.. ఎన్నెకరాలైనా తీసుకుంటా. పైగా మీకు ఎకరాకింతని కమీషన్ కూడా ముట్టజెబుతాను" కమీషన్ ఇస్తానంటే కానిపని చెయ్యడానికైనా సిద్ధపడే బొర్రయ్య మనస్తత్వాన్ని ఇట్టే పసిగట్టిన తాతారావు అంతమంది ముందు కావాలనే కనిపించని వల విసిరాడు.

తాతారావు మాటలకు ఉబ్బిపోయిన బొర్రయ్య ఆనందంతో ఏదో మాట్లాడబోతుంటే "అరే! మీరు కుసింత సేపాగండ్రా బావూ! అసలు దేవుని సంగతి పక్కకు బెట్టి ఇంకేదో మాటాడతారేటి? ! కాస్సేపీ తాతారావు బావు ఇషయం .పక్కన బెట్టి దేవుని సంగతి తెల్పండి" అంటూ బొర్రయ్య నోటికి తాళం వేస్తూ మాట్లాడాడు సర్పంచ్ అలుగురాజు, మనసులో అతని మీద ఊహకు అందని అసంతృప్తి ఏదో గూడుకట్టుకుంటుంటే.

"సరె సరె, అలాక్కానియ్యండి ప్రెసిడెంట్ బావూ!" ఇదీ ఒకందుకు మంచిదేలే అని మనసులో అనుకుంటూ చప్పున నోరు మూసుకున్నాడు బొర్రయ్య.

"ఇంకా దేవుని సంగతేంటండీ! ఇందా, ఇందాక నేనిస్తానన్న ముప్ఫైవేలూ ఇస్తాను తీసుకోండీ. చివర్లో ఇంకా ఏమన్నా ఖర్చులకు తగ్గాయనుకుంటే నన్నడగండి!" అంటూ గుండెలమీద ఉన్న చొక్కాజేబులో నుండి కాక, ఆ జేబు వెనుక లోపలి జేబులో మరో వెయ్యిరూపాయల నోట్లకట్ట బయటకు తీసి దానిలో నుండి ఫటా ఫటా ముప్ఫైనోట్లు ఎంచి సర్పంచ్ చేతుల్లో పెట్టి వెంటనే పైకిలేస్తూ "నేను స్వామిపేట శ్రీరామ్ లాడ్జిలో దిగాను మీరు ఎవరైనా నన్ను కలవాలనుకుంటే అక్కడికొచ్చి మాట్లాడొచ్చు లేదూ ఫోన్లో మాట్లాడాలనుకుంటే ఇదిగో నా సెల్ నెంబర్ తీసుకోండి" అంటూ జేబులోంచి విజిటింగ్ కార్డుల కట్ట బయటకు తీసి అక్కడున్న అందరికీ పంచమన్నట్టుగా తన ఎదురుగా ఉన్న కన్నదాసు చేతికి ఇచ్చాడు.

అంతే!

అక్కడున్న వాళ్ళందరికీ దక్కని మహదవకాశమేదో తనకే దక్కినట్టు ఊరివాళ్ళ వంక గర్వంగా చూస్తూ విజిటింగ్ కార్డులు పంచడం మొదలుపెట్టాడు కన్నదాసు.

దాంతో... అప్పటిదాకా స్తబ్ధంగా నిల

బడి చోద్యం చూసినట్టు చూస్తున్న ఊరివా ళ్ళలో ఎవరో ముక్కూమొహం తెలియని వ్యక్తి ముప్ఫైవేలు ఇచ్చిన ఆ సంఘటన తాలూకు విభ్రాంతి నుండి బయటకొచ్చి 'నాకు.. నాకు..' అంటూ పచ్చనోట్లు అందుకుంటున్నంత ఆత్రంగా విజిటింగ్ కార్డుల కోసం కన్నదాసు చుట్టూ ఉసిళ్ళు మూగినట్టు మూగారు.

ఆ జనంలో తనమీద మరింతగా ఆసక్తి పెరగాలంటే వెంటనే అక్కణ్ణుంచి తప్పుకో వాలని బాగా తెలిసిన తాతారావు మెల్లిగా అవతలి బజారులో ఆపి వచ్చిన తనకారు దగ్గరికి బయలుదేరాడు.

తన చేతిలో కొత్త వెయ్యిరూపాయల నోట్లు ఫెళ, ఫెళ లాడుతుంటే 'కొంపదీసి ఇవి కోయంబత్తూర్ నోట్లుకావు కదా!' అన్నట్టు వాటివంక చూస్తూ బుర్ర గోక్కో సాగాడు సర్పంచ్ అలుగురాజు.

వెళుతూ వెళుతూ తన్తోపాటు రమ్మన్న ట్టుగా బొర్రయ్యకి కనుసైగ చేస్తూ ముందుకు కదిలాడు తాతారావు.

'అదే మహాప్రసాదం' అన్నట్టుగా భావిం చిన బొర్రయ్య లేగదూడలా అతని వెంట కదిలాడు.

వాళ్ళను గమనించిన కన్నదాసు కూడా పంచుతున్న కార్డులు వేరేవాళ్ళ చేతుల్లో పెట్టి వాళ్ళ వెనకే వడి వడిగా అడుగులు వేశాడు.




జీవభద్ర గ్రామంలో ఆరోజుల్లో ఎక్కడ చూసినా, ఎవరినోట విన్నా తాతారావు పేరే మారుమోగసాగింది.

ప్రతివాళ్ళూ తాతారావుతో పరిచయం పెంచుకోవాలని తహతహలాడ సాగారు. కానీ అతణ్ణి కలవడమే గగనమవ్వసాగింది.

దాంతో...

ఎవరైనా స్వామిపేట వెళ్ళి లాడ్జీలో ఉన్న తాతారావును కలవాలంటే ముందుగా బొర్రయ్యనో, తాగుబోతు కన్న దాసునో కలుసుకుంటేనేగాని అతన్ని కల వడం సాధ్యం కావడంలేదు. తాతారావు మాత్రం బీలకు సంబంధించిన సమా చారం సేకరించడంలో క్షణం కూడా వృథా చేయకుండా ఎక్కడెక్కడో తిరగసాగాడు.

జీవభద్ర బీల భూమి రెండువేల ఎక రాల్లో దాదాపు తొమ్మిదివందల అరవై ఎక రాలు గవర్నమెంట్ భూమి కాగా మరో తొమ్మిదివందల ఎకరాల చిల్లరభూమి స్వా మిపేట, కంకిలి, విలాసపురం, తిక్కవరం, బురదపాలెం, నల్లగండి, సిరిబుద్ధ, కృష్ణ య్యపాలెం వంటి ఇరువైఎనిమిది గ్రామా ల ఆయకట్టు కింద వస్తుంది.

ఈ రెండువేల ఎకరాల్లో తూర్పు దిశలో నల్లమెట్ట, ఉత్తర దిశలో నెమళ్లమెట్ట, పడ మర దిశలో తేళ్లమెట్ట అనే మూడు చిన్న చిన్న గుట్టలున్నాయి. ఆ గుట్టలు మూడూ చెట్టూచేమలతో ఆకుపచ్చగా మెరిసిపోతూ చూపరులకు కనువిందు చేస్తుంటాయి.

ఎవరైనా నల్లమెట్ట పడమర దిక్కుగా పరికించి చూస్తే కంటికి కనిపించినంత దూరం మోకాటిలోతు నుండి మనిసి మునిగిపోయేంత ఎత్తుతో కరాచిగడ్డి, బొరుసుగడ్డి, తుంగగడ్డి, పొన్నంగి గడ్డితో పాటు ఇంకా అనేకరకాల తుంగజాతి గడ్డితో ఏ చిన్నగాలి తరగకైనా అల్లనల్లన తలలు ఊపుతూ ఆకుపచ్చ తరంగాలతో చూపరులకు స్వాగతం పలుకుతూ అదో ఆకుపచ్చ సంద్రంలా ఏవో అద్భుత లోకా లకు తీసుకుపోతుంది.

ఆ రకరకాల తుంగగడ్డి బీల చుట్టూ ఉన్న ఇరవైఎనిమిది గ్రామాల ప్రజల్లోని చాలామంది పేదవాళ్ళకు జీవనోపాధి. ఇండ్ల పైకప్పుల కోసం గడ్డి కోసుకొచ్చి

## పురుషులకు మాత్రమే!

చైనా రాజధాని బీజింగ్‌లోని 'గువోలి హువాయాంగ్' రెస్టారెంట్ చాలా ప్రసిద్ధి చెందినది. ఏది పడితే అది తినే చైనీస్ అభిరుచిని గమనించి దీన్ని ఏర్పాటు చేశారు. ఇక్కడ లభించే ఆహార పదార్థాలు అత్యంత ఖరీదైనవి, వింతయినవి. 2006లో ఆరంభించిన ఈ రెస్టారెంట్‌కు అధికంగా పురుషులే వస్తుంటారు. ఇక్కడ సర్వ్ చేసే పదార్థాలన్నీ జంతువుల శరీరంలోని ఒకే భాగానికి చెందినవే. అవి కూడా మగ జంతువులవే. 'నాలుగు కాళ్ళుగల దేన్నయినా చైనీస్ తింటారు- టేబుల్స్‌ని తప్ప. ఎగిరేది దేన్నైనా తింటారు- విమానాలను తప్ప' అనే సూక్తిని ఈ హోటల్ గోడమీద చూడొచ్చు. ఇంతకీ ఇక్కడ వండేది, జంతువుల పురుషాంగాలు! దున్న పురుషాంగం అత్యంత రుచికరమైందట! దాని ధర వందల డాలర్లలో ఉంటుంది. గొర్రెల పురుషాంగాలు అన్నిటికన్నా చవక. వీటి పేర్లు కూడా చిత్రంగా ఉంటాయి. ఎసెన్స్ ఆఫ్ ది గోల్డెన్ బుద్ధా, ఫీనిక్స్ రైజింగ్, జాస్మిన్ ఫ్లవర్స్ విత్ ఒన్ థౌజండ్ లేయర్స్... ఇలాంటివే పేర్లు. జంతువుల పురుషాంగాలు తింటే పుంసత్వం వృద్ధి చెందుతుందనేది చైనీయుల నమ్మకం. దాని ఆధారంగానే ఈ రెస్టారెంట్‌ను గువో అనే వ్యక్తి ప్రారంభించాడు. ఇతను కొంతకాలం తైవాన్‌లో, అమెరికాలోని అట్లాంటాలో నివసించాడు. పదిహేనేళ్ళలోపు పిల్లలకు ఇక్కడ ప్రవేశం నిషిద్ధం. ఎందుకంటే ఈ ఆహార పదార్థాల్లోని హార్మోన్స్ వారి సహజ ఎదుగుదలను అడ్డుకుంటాయట. అలాగే వీటివల్ల స్త్రీలకు గడ్డం రావడం, గొంతు బొంగురుపోవడం తదితర సమస్యలు తలెత్తవచ్చు. ఇక్కడ అత్యంత ఖరీదైన పదార్థం పులి పురుషాంగం. దీనిధర 1500 అమెరికన్ డాలర్లు. ఐతే దీన్ని నెలల ముందే ఆర్డర్ చేయాల్సి ఉంటుంది. ఈ రెస్టారెంట్ బ్రాంచ్ అమెరికాలోని అట్లాంటాలో ఉంది.






## లండన్ ఒలంపిక్స్ తర్వాత...

ఇటీవల జరిగిన 'లండన్ ఒలంపిక్స్-2012' గురించిన కొన్ని విశేషాలివీ..

★ ఒలంపిక్స్ స్టేడియంలో సీటింగ్ కెపాసిటీ ఎనభై వేలు. ఇంతదాకా నిర్మించిన అన్ని స్టేడియాల కన్నా దీన్ని తక్కువ బరువుగల మెటీరియల్‌తో కట్టారు. దీని కోసం ఇరవై బిలియన్ పౌండ్లు ఖర్చయ్యాయి. అందులో లండన్ ప్రజలు అరవైరెండున్నర కోట్ల పౌన్లను ఇచ్చారు.




★ ఒలంపిక్ గేమ్స్ వల్ల పన్నెండు వేల ఉద్యోగాలు సృష్టి అయ్యాయి. ఈ క్రీడలు ముగిసాక ఒలంపిక్ పార్కులోని నాలుగు ఎరీనాలను విప్పదీసి, ఇంగ్లండ్‌లోని ఇతర ప్రాంతాల్లో 4 పార్కులుగా నిర్మించారు.

★ ఒలంపిక్స్‌లో వాడిన బ్యాటులు, బంతులలాంటి క్రీడాసామగ్రిని వేలంవేసి, వచ్చిన మొత్తాన్ని స్వచ్ఛంద సంస్థలకు ఇచ్చారు.

★ మూడు వందల దేశాల నుంచి క్రీడాకారులు పాల్గొన్నారు. దీనికి అనుబంధంగా నిర్వహించిన వికలాంగుల క్రీడలలో 147 దేశాల నుంచి ప్రతినిధులు పాల్గొన్నారు.

★ స్టేడియం, ఇతర వసతుల నిర్మాణం మే 2008లోనే మొదలైంది. అప్పటి నుంచి 5,250 మంది 2012 దాకా అవిరామంగా పని చేశారు.

★ ఒలంపిక్స్ పూర్తయ్యాక ఇప్పుడు క్రీడలు జరిగిన ఆ ప్రాంతం, యూరప్‌లోని అత్యంత పెద్ద అర్బన్‌పార్క్‌గా మారింది.

★ ఈ క్రీడల వల్ల ఆ దేశ ఆర్థిక వ్యవస్థ ఎనభై బిలియన్ అమెరికన్ డాలర్ల మేరకు పెరిగింది. దీనికి ముందు 1908లో, 1948లో లండన్‌లో ఒలంపిక్స్ నిర్వహించారు. ఈ ఏడాది అక్కడ ఇవి నిర్వహించడం ఇప్పటికి మూడోసారి.

అమ్ముకుంటూనో, తుంగచాపలు, చిరుచాపలు, గూడచాపలు, చిన్నచిన్న బుట్టలు, తాళ్ళు, అలంకార వస్తువులు తయారుచేసి అమ్ముకుంటూనో జీవిస్తుంటారు.

ఆ బీలలో పెరిగే తుంగగడ్డి, దుంపలు, తామర కాయలు, చిన్న చిన్న పురుగులు, రకరకాల నత్తలు, వందల రకాల చేపలు, ఆ చేపల్ని తినడానికి స్థానిక పక్షులతో పాటు, సైబీరియా వంటి సుదూర దేశాల నుండి కూడా వేలాది పక్షులు వలస వస్తుంటాయి. మొత్తం మీద చూస్తే బీలలో స్వదేశీ, విదేశీ పక్షులు కలిపి దాదాపు నూట ఇరవై, నూటముప్పై రకాలు నెమ్మళ్లమెట్ట మీద గూళ్ళు కట్టుకుని నివాసముంటూ బీలనీళ్ళల్లో ఆహారం సంపాదించి తింటూ, గుడ్లు పెట్టి, పొదిగి పిల్లల్ని చేస్తుంటాయి.

ఆ విధంగా కొన్నివేల పక్షులు ఒక్కసారిగా నల్లటి మేఘాల్లా బీలనీటి ఆకుపచ్చ సంద్రం పైన గుంపులు గుంపులుగా ఎగురుతూ రకరకాల కూతలతో ఎంతో సందడిగా కదలాడుతూ ఉంటే చూసేవారి కంటికి అదో అంతర్జాతీయ పక్షి సంరక్షణా కేంద్రంలాగా అనిపిస్తుంది.

ఇక బీలకు దక్షిణ దిశగా చూస్తే ఎక్కడో దూరంగా భూమాత స్తనద్వయంలా అన్పించే రెండుకొండలు కన్పిస్తుంటాయి. ఆ కొండల మధ్య ఖాళీ ఆ స్తన ద్వయం మధ్యనున్న లోయలా అన్పిస్తుంటుంది.

అక్కణ్ణుంచి ఇంకొంచం ముందుకు చూపు సారించి పడమర దిశగా చూస్తే హోరుమని ధ్వనిస్తున్న సముద్రం లీలగా కనిపిస్తుంది. ఆ నీలి సముద్రాన్ని, ఆకాశాన్ని కలిపి ఉంచే ఆకుపచ్చ క్షితిజరేఖ మీద ఉదయం, సాయం సంధ్యవేళల్లో అరుణారుణ మేఘ మాలికల మధ్య పసిడి వెలుగులు చిమ్ముతూ సముద్రపు నీటిలో తేలియాడే చల్లటి సూర్యుణ్ణి చూడటమే తప్ప ఎంతటి కవి పండితులకైనా వర్ణించడానికి మాటలు దొరకవు.

ఇక నెమళ్లమెట్టకు కుడివైపుగా చూస్తే కొంచెం దూరంలో కన్పించేది తేళ్లమెట్ట. ఆ తేళ్లమెట్ట మీద ఎన్నెన్నో రకాల తేళ్ళు, పాములుంటాయి. పాములు బీలలో దొరికే చిన్నచిన్న నీటి ప్రాణులను, కప్పలను, పక్షుల గుడ్లను, వాటి పిల్లలను పట్టి మింగేస్తుంటాయి. సాధారణంగా తేళ్లమెట్టకు ఎవరూ ధైర్యంచేసి వెళ్ళరు. వెళ్ళినవాళ్ళు పాముకాటు బారిన పడకుండా తిరిగి రావడం అరుదు.

ఇక బీలకు తూర్పుదిశలో ఉండే నల్లమెట్ట విషయానికొస్తే ఒకరకంగా అటు బీలకు ఇటు జీవభద్ర గ్రామానికి మధ్య ప్రకృతి నిర్మించిన ఆకుపచ్చ కోట బురుజులా ఉంటుంది. మరోరకంగా చూస్తే సముద్రానికి పోటువచ్చి ఇసుక పర్ర మీదుగా బీలను దాటుకు వచ్చి జీవభద్ర, సిరిబుద్ధ తదితర గ్రామాలను ముంచెత్తకుండా సహజంగా ఏర్పడిన కరకట్టలా అడ్డుకుంటుంది.

బీల నీటిలో తిరుగాడే చేపలు తుంగ దుబ్బుల్లో గుడ్లు పెట్టడంతో కొన్నిరోజులకు ఆ గుడ్లలో నుండి లక్షలాది చేప పిల్లలు బయటకు వచ్చి గుంపులు గుంప

## కొత్తగాలి...

**పాలిచ్చేది**
**అమ్మ!**
**పాలించేది**
**ఆలి!!**

– యు. చిట్టిబాబు,
న్యూ పాల్వంచ, ఖమ్మం జిల్లా

లుగా తిరుగాడుతుంటాయి. అవి తుంగలో పెరిగే చిన్న చిన్న పురుగులను తింటూ అక్కడే పెరిగి పెద్దవవుతుంటాయి తప్ప సముద్రజలాల్లోకి వెళ్ళలేవు. ఎందుకంటే బీలకు, సముద్రానికీ మధ్య ఇసుక పర్ర అడ్డుంటుంది. సముద్రానికి, బీలకూ మధ్య సహజంగా ఏర్పడిన ఇసుకమేటను పర్ర అంటారు.

ఈ పర్రే బీలకు ప్రాణం. ఎందుకంటే బీలలో నీరు ఎక్కువైతే అటు సముద్రం లోకి పంపుతూ, బీలలో నీరు తక్కువైతే సముద్రపు నీటిని మంచినీటిగా మార్చి ఇటు బీలలోకి వదులుతూ మూడువందల అరవైరోజులు, మూడుకాలాల్లో, ఆరు రుతువుల్లో బీలలో నీటిమట్టం తగ్గకుండా సహజ నియంత్రణ చక్రంలా పనిచేస్తుంది.

నల్లమెట్టకు, బీలకు మధ్యలో ఉన్న పంట భూముల్లో కొబ్బరి, జీడిమామిడి, సరివి తోటలు ఏపుగా పెరిగి, మెట్టమీద నుండి చూసేవారికి బీలతల్లి పురిటి స్నానానికి వేసిన ఆకుపచ్చ పీటలా అసమానమైన అందంతో అద్భుతంగా కనిపిస్తుంటాయి.

నల్లమెట్టకు తూర్పువైపుగా చూస్తే కొబ్బరి, పనసచెట్ల గుబుర్ల మధ్య రకరకాల ఇండ్లు, భవనాలు, విద్యుత్ స్తంభాలు, సెల్ టవర్లు కలగలిసిపోయి ఆకుపచ్చ వనగిరి కన్నెపిల్ల అందాలు ఇనుమడించేందుకు ప్రకృతిమాత అలంకరించిన సొమ్ముల్లాగానో, దిష్టిచుక్కల్లాగానో భాసిస్తుంటాయి. ఆధునిక మానవుడు సాధించిన సాంకేతిక పరిజ్ఞానం కూడా ప్రకృతిలో అంతర్భాగంగా కలసిపోయి చూసేవాళ్ళ కళ్ళకు బీల ఈ నేలమీద వెలసిన ఆకుపచ్చ స్వర్గం అనిపించక తప్పదు. బీలకు నాలుగు దిక్కులా ఉన్న ఆయకట్టు భూముల్లో సేద్యానికి పనికొచ్చే విధంగా జీవభద్ర, సిరిబుద్ధ గ్రామాల్లో ఎత్తిపోతల పథకాల ఏర్పాటు జరిగింది. ఆ ఎత్తిపోతల పథకాల క్రింద దాదాపుగా ఐదువేల పైచిలుకు ఎకరాల్లో సాగుబడి కొనసాగుతోంది. రైతులు వరి, అపరాలు, ఆకుకూరలు, కూరగాయలు, పనస, జీడిమామిడి తోటలు సాగు చేస్తున్నారు. ఎంత భూమి సాగుచేసినా, ఎన్నిరకాల పంటలు పండించినా వాళ్లంతా నాలుగైదు ఎకరాల లోపు భూములున్న చిన్న, సన్నకారు రైతులే. బీల గ్రామాలన్నింటిలోనూ పది, పదిహేను ఎకరాల భూవసతి ఉన్నవారు ఊరికి ఒక్కరిద్దరి కంటే ఎక్కువ కన్పించనే కన్పించరు.

ఒక్కమాటలో చెప్పాలంటే ఆ ఇరవై ఎనిమిది బీల గ్రామాల ప్రజలకు సొంత భూమికన్నా, బీలే కన్నతల్లి, కల్పవల్లి. కన్న తల్లైనా అడగందే అన్నం పెట్టదు. పెట్టినా కొంత వయసు వరకే! బాల్యంలో పెట్టినా, దానికి ప్రతిఫలంగా తల్లి తన ముసలితనం సంతానం చేతిలో భద్రంగా గడిపి గతించిపోవాలని ఆశిస్తుంది.

కానీ బీల తల్లి అట్లాంటి తల్లి కాదు. తన మీద ఆధారపడి బతికే బడుగు, బలహీనులను తర తమ భేదాలు, వయసు అంతరాలు చూడకుండా, తరతరాలుగా తిన తిండినిచ్చి, కట్ట బట్టనిచ్చి, ఉండ నీడనిచ్చి ఏమాత్రం ప్రతిఫలం ఆశించకుండానే జీవితకాలం బతికిస్తుంది, పోషిస్తుంది, లాలిస్తుంది. అంతేకాకుండా సముద్రం అటుపోట్లనుండి, ఉప్పెన, ఉత్పాతాల నుండి పెట్టని కోటలా, దేశ సరిహద్దులను కాపాడే వీర జవానుల్లా బీల గ్రామాలను నిరంతరం కాపాడుతుంది.

ఆ విధంగా వాళ్ళ జీవితాల్లో, చావు పుట్టుకల్లో, సంస్కృతిలో బతుకు వృక్షాలకు లతలా పెనవేసుకుపోయిన బీలతల్లిని కొల్లగొట్టాలని, తమ ఆర్థిక సామ్రాజ్యాన్ని నిర్మించాలని తలపెట్టిన కొందరి స్వార్థప

రుల గూఢచారిలా వచ్చినవాడు తాతా రావు. అందుకే ఎన్నివందల ఎకరాలైనా బీలలో కొంటానంటాడు. ఎంత రేటైనా పెడతానంటాడు. అతను చెబుతున్నట్టు అన్నివందల ఎకరాల భూమి నిజంగా చేపల చెరువుల కోసమేనా? ఒక వ్యక్తి దగ్గర అంత డబ్బు ఉండడం సాధ్యమేనా? దీనివెనుక ఇంకెవరన్నా ఉన్నారా? జనం దృష్టికి రాని, జనానికి అర్థంకాని కుట్ర ఏదైనా బీల చుట్టూ ఉరి తాడులా బిగుసుకుంటోందా?

ఏమో?

కాలమే దానికి సమాధానం చెప్పాలి.

చెప్పి తీరాలి.

జీవభద్ర రచ్చబండ దగ్గర...

"ముప్పైవేలు దేవుని పెల్లికోసమని సర్పంచ్‌కిచ్చి ఎలిపోతున్న తాతారావు బావెంట గుంటనక్కల్లా బొర్రయ్య, కన్నదాసులిద్దరూ వెంటబడి పోతున్నారేటి? "

"ఆ తాగుబోతు కన్నదాసు ఏదో పోతున్నాడులే అనుకుంటే ఈ బొర్రయ్య కేమొచ్చింది! ఈడూ తాతారావు బావెనకే పోతున్నాడేటి? "

"ఇంకేటుంది మరి? డబ్బుకోసరమే"

"బొర్రయ్య దగ్గరే బొచ్చిడు డబ్బులు మురిగి పోతున్నాయి కదేటి? ఇంకా సంపాయించి ఏటి సేసుకుంటాడు? నెత్తి నేసుకొని పోతాడా? "

"వాడెంత సంపాయించినా ఏటి లాభం? ఇంటికి పోతే పెల్లాం ముందు పిల్లికూనే కదా? " అంటూ మిగిలిపోయిన జనాలంతా రకరకాలుగా అతణ్ణి గురించి వ్యాఖ్యానించుకోసాగారు.

'చెరువులోన నీల్లు వాలుగమ్మినపాయె, మాటలు గాలికిపాయె' అన్నట్టు ఊళ్ళో వాళ్ళ మాటలు చెవిన పడుతున్నా మమ్ముల్ని కాదన్నట్టుగా దులపరించుకొని ముందుకు వెళ్ళిపోయారు బొర్రయ్య, కన్నదాసులిద్దరూ.

వాళ్ళిద్దరూ వచ్చేదాకా అవతలి వీధిలో ఆగి, రాగానే కార్లో ఎక్కించుకున్న తాతారావు నేరుగా స్వామిపేట లాడ్జికి తీసుకుపోయాడు.

అంతకుముందే కప్‌బోర్డులో రెడీగా ఉన్న రాయల్‌స్టాగ్ ఫుల్‌బాటిల్ బయటకు తీసి లాడ్జి కుర్రాళ్ళతో మూడు ప్లేట్ల నిండా మసాలా జీడిపప్పు తెప్పించి, కోమటి బొర్రయ్య, కన్నదాసుల ముందు పెట్టాడు తాతారావు.

మందుబాటిల్, జీడిపప్పు ప్లేట్లూ ఖాళీ అయ్యేసరికి కన్నదాసు, బొర్రయ్యల బుర్రల్లో ఉన్న మెదళ్ళు ఖాళీ అయిపోయి, ఆ ఖాళీలు కాస్తా తాతారావు చెప్పిన మాటలతో నిండిపోయాయి.

"బీల గ్రామాల్లో బీలకింద పట్టా భూములున్న రైతులెవ్వరు? ఒక్కొక్కళ్ళకు ఎన్నెన్ని ఎకరాల భూమి ఉంది? వాళ్ళ స్థితి గతులేంటి? వాళ్ళల్లో ఎవరైనా ఏమైనా ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నారా? ఇప్పుడున్న మార్కెట్ రేటుకంటే ఎక్కువ రేటు ఆశపెడితే వాళ్ళు తమ భూములు అమ్ముతారా? ఈ మొత్తం సమాచారం మీరు ఎన్నిరోజుల్లో సేకరించి ఇవ్వగలరు? కావాలంటే మీ వెంట నేనూ వస్తాను. కారులో తిరుగుదాం" అంటూ తనకేం కావాలో, బొర్రయ్య, కన్నదాసులు ఏం చెయ్యాలో, చేస్తే వాళ్ళకు చేకూరే లాభం ఏమిటో.. సావకాశంగా వివరించాడు తాతారావు.

"సరే బావూ! ఈ రోజునుండి ఆ పని మీదే ఉంతాం" అంటూ తాతారావు చెప్పిన వాటన్నింటికీ తల ఊపారు బొర్రయ్య, కన్నదాసులిద్దరూ.

అన్నట్టుగానే ఆ మరునాడు కార్లో బొర్రయ్య, కన్నదాసులను ఎక్కించుకున్న తాతారావు నేరుగా తహశీల్దారు ఆఫీసుకు

వెళ్ళి, అతణ్ణి కలిసి తనకేం కావాలో చెప్పి ఆయనకెంత కావాలో అంతా ఇచ్చేశాడు.

"ఒక్క రెండు గంటలు కూర్చోండి" అంటూ అటెండర్ని పిలిచి ఏదో చెప్పాడు తహశీల్దార్. అటెండర్ వాళ్ళను తీసుకు పోయి విజిటర్స్ హాల్లో కూర్చోబెట్టి తను వెళ్ళి హెడ్‌క్లర్క్‌తో ఏదో చెప్పాడు. అతను అర్ధగంట సేపు కంప్యూటర్‌లో వెతుకులాడి కొన్ని పేపర్లు ప్రింటౌట్ తీసి అటెండర్ చేతికిచ్చాడు. అటెండర్ ఆ పేపర్లను తీసు కుని బయటకెళ్ళి ముప్పావు గంటలో జిరాక్స్ కాపీలతో తిరిగి వచ్చాడు.

పహణీ జిరాక్స్‌లను తీసుకున్న తాతా రావు వెంటనే జేబులోనుండి రెండొందలు తీసి అటెండర్‌కివ్వగానే అతను సెల్యూట్ చేస్తూ తాతారావును తిరిగి తహశీల్దార్ రూములోకి తీసుకెళ్ళాడు.

తహశీల్దార్‌కు నమస్కారం చేసిన తాతా రావు "అవసరమైతే మళ్ళీ మిమ్మల్ని కలు స్తాన్ సార్" అంటూ బయటికి బయలుదే రాడు.

"అలాగే! మీకే అవసరమున్నా నేరుగా నా ఆఫీస్ కొచ్చేయ్యండి!" అంటూ అభయ మిచ్చాడు తహశీల్దార్ ఆప్యాయంగా.

"అలాగే సార్!" అంటూ బయటకొచ్చి కారెక్కిన తాతారావు, బొర్రయ్య వాళ్ళు నేరుగా బురదపాలెం మాజీ కరణం భగ వంతరావు ఇంటికి చేరుకున్నారు.

వాళ్ళకోసమే ఎదురు చూస్తున్నట్టుగా ఇంటిముందే కూర్చుని ఉన్న ఆ మాజీ కరణం, కారుదిగిన తాతారావుకు ఎదు రొస్తూ "రాండి, రాండి!" అంటూ ఆహ్వా నించి కుర్చీలు చూపించాడు.

వాళ్ళు కూర్చోగానే వెంటనే ఎవరికో ఫోన్ చేశాడు మాజీ కరణం. ఓ పది నిముషాలు పిచ్చాపాటీ మాట్లాడుతూ గడి పేసరికి ఓ ఇద్దరు యువకులు మరో ముసలయ్యను బహుశా వాళ్ళ తండ్రే అయ్యుంటాడు.. వెంటబెట్టుకుని వచ్చారు.

"రామయ్యా! మొన్నామధ్య తాతా రావుగారని నీకు చెప్పాను చూడూ! వారే వీరు. మరి మీ అమ్మాయి పెండ్లికోసం ఆ బీలలో ఉన్న మూడెకరాలూ అమ్ముతాన న్నారని నేనే పిలిపించాను" అంటూ వచ్చిన ముసలాయనకు విషయం బోధప రిచాడు మాజీ కరణం.

తాతారావు తమకు తెలియకుండానే ఆ మాజీ కరణంతో ఎప్పుడు పరిచయం పెట్టుకున్నాడో.. కరణం ద్వారా రామయ్య పొలం విషయం ఎప్పుడు తెలుసుకు న్నాడో? అర్థంకాక బొర్రయ్య కన్నదాసులి ద్దరూ ఆశ్చర్యపోతూ 'అమ్మో! వీడు గుండెలు దీసిన బంటురా బావో!' అనుకు

## కొత్తగాలి...



**తెల్లోడి పాలనని**
**తరిమిన మనమే**
**తెల్లోడి భాషకు**
**గులామ్!**

– వి. సూర్యారావు,
అనకాపల్లి

న్నారు.

"అమ్మదామనే అనుకుంటున్నాం" రామయ్య కొడుకులిద్దరూ ఒకేసారి అన్నారు.

"సరే ఎకరమెంతో చెప్పండి?" నేరుగా అడిగేశాడు తాతారావు.

"లక్షన్నర" వెనుకా ముందూ ఆలోచిస్తూ అన్నాడు రామయ్య.

"అంత రేటెక్కడుంది సామీ? ఎకరం యాభై అరవై వేలకంటే ఎక్కువ లేదు. ఐనా సరే ఆడపిల్ల పెళ్ళికంటున్నారు గదా! ఎకరానికి ఎనభైవేలిస్తా. మీకిష్టమైతే

ఇప్పుడే యాభైవేలు అడ్వాన్సు ఇస్తాను. మీ కరణంగారితోనే అగ్రిమెంట్ రాయించు కుందాం. వచ్చేవారం మొత్తం డబ్బులు గట్టి, రిజిస్టర్ చేయించుకుంటాను" మొత్తం విషయాన్ని మూడు ముక్కల్లో తేల్చి చెప్పాడు తాతారావు.

'తాత ముత్తాతల కాలంనుండి ఆ బీల భూమి మూడెకరాలు మూడొందలరవై రోజులు నీళ్ళతోనూ, మోకాటి ఎత్తున పెరిగే తుంగ గడ్డితోనూ పిట్టలు తిరగడా నికి తప్ప దేనికి పనికిరావటం లేదు. కొత్త బిచ్చగాడు పొద్దు ఎరగడన్నట్టు మాటైం బాగుంది కాబట్టి వీడెవడో ఎనభైవేలు పెడ తానంటున్నాడు. ఇహ ఇంతకంటే కావా

కొత్తగాలి...

**నీ ఆరాటం**
**కనిపించని దేవుడి కోసం**
**మా ఆరాటం**
**కనిపెంచిన కొడుకు కోసం**
**వాడు వెళ్లి'పోయాడు'-**
**మేం ఉండి 'పోయాం'**

– రాజ్‌శ్రీ ఎడ్వర్డ్, హైదరాబాద్

ల్సిందేముంది? అమ్మిపడేస్తే అయిపోలే. ఉన్నది ఒక్కగానొక్క ఆడపిల్ల. ముందు ముందు మేం ముసలోళ్లం అయిపోయిన తరువాత ఈ అన్నదమ్ములిద్దరు దాన్ని చూస్తారో లేదో ఎందుకొచ్చిన గొడవ. ఈ మూడెకరాలు అమ్మి వచ్చిన డబ్బుల్తో ఆ విజెనగరం ఇస్కూల్లోన జాబ్ చేసే కుర్రా డికే ముడెట్టామంటే ఎవ్వరికీ ఎదురుచూడ కుండా బతుకుతుంది' అనుకుంటూ చాలా దూరం ఆలోచించిన రామయ్య, కొడుకు లతో సంప్రదించి ఆఖరున తాతారావు చెప్పిన రేటుకు అమ్మడానికి ఒప్పుకొని బయానాగా యాభైవేలు తీసుకున్నాడు.

ఆ విధంగా ఓ ఆడపిల్ల పెళ్ళి కారణంగా బీల గ్రామాల్లో మొట్టమొదటిసారిగా మూడెకరాల పట్టాభూమి కొని బీలలో పాగా వేశాడు తాతారావు. ఆ వార్త ఒక్క సారిగా బీల గ్రామాల్లో పెద్దఎత్తున చర్చకు దారితీసింది.

'వీడెవడో పిచ్చి ముండాకొడుకు రూపాయి దానికి రెండు రూపాయలిస్తా నంటూన్నాడు. హాయిగా ఆ బీలను వీడికి అంటగట్టి ఆ డబ్బుల్తో ఎత్తిపోతల కింద ఒక్క ఎకరం పొలం కొనుకున్నా చాలు'

'ఆ బీల భూమి అమ్ముకొని వచ్చిన డబ్బులు బ్యాంక్‌లో ఫిక్సుడ్ చేసుకుంటే నెల నెలా వడ్డీ వస్తుంది. దాన్ని పొదు పుగా వాడుకుంటే జీవితాంతం హాయిగా బతకొచ్చు' ఆ విధంగా బీల గ్రామాల ప్రజ లంతా ఏదోవిధంగా బీల భూమిని తాతా రావుకి అమ్మేసి డబ్బులు చేతిలో వేసు కుందాం అనుకొని ఒకరిని చూసి ఒకరు గొర్రెదాటుగా భూమి అమ్ముకోసాగారు.

అయితే అప్పటిదాకా ఆ రైతులకు అర్థం కాని విషయం ఒకటుంది.

అది.. రిజిస్ట్రేషన్ సమయంలో బయట పడింది. తాతారావు ఆ కొన్న భూమిని 'కు చేలా రియల్ ఎస్టేట్ కంపెనీ' పేరుమీద రిజిస్ట్రేషన్ చేయించుకోసాగాడు.

రిజిస్ట్రేషన్ చేయడానికి వచ్చిన రైతుల్లో అంతో ఇంతో వ్యవహార దక్షత తెలిసిన వాళ్ళు కొందరు "ఇదేటి బావూ! ఇలగ కంపెనీ పేరు మీదన రిజిస్ట్రేషన్ చేయిస్తు న్నావేటి? " అని అడిగితే, "అదంతా మీ కనవసరం. మనం రాసుకున్న అగ్రిమెంట్ ప్రకారం మీ డబ్బులు మొత్తం మీకు ఇస్తు న్నానా? లేదా? అది చూసుకోండి చాలు. నేను ఏ పేరుమీద రిజిస్ట్రేషన్ చేయించు కుంటే మీకేంటి బాధ? అవతల నాకు వంద లావాదేవీలుంటాయి. అవ్వన్నీ మీకు చెప్పాల్సిన అవసరం లేదు కదా? ఐనా

చెపుతున్నా వినండి. ఏదన్నా ఒకే ఫరం పేరుమీద రిజిస్ట్రేషన్ చేయిస్తే, ముందు పెద్దఎత్తున ఫ్యాక్టరీ లాంటిదేదైనా కట్టాలంటే లోన్లూ అవీ సులభంగానూ, ఎక్కువ మొత్తంలోను దొరకుతాయి. అందుకే నా ఏర్పాటు నేను చేసుకుంటు న్నాను" అంటూ అడిగిన వాళ్ళ నోరు అడిగినట్టే మూయించసాగాడు తాతారావు.

దాంతో ఇంకేం మాట్లాడలేక భూముల మ్మిన రైతులంతా అతను పెట్టమన్న చోట సంతకాలు పెట్టి కంపెనీ పేరనే రిజిస్ట్రేషన్ చేసి డబ్బులు తీసుకుపోసాగారు. 'ఇదేటిది? అప్పుడు చేపల చెరువుల కోసమన్జెప్పి ఇప్పుడు ఫ్యాక్ట్రీ అంటాడేటి? !' వాళ్ల బుర్రల్ని తొలుస్తున్న సందేహాన్ని మాత్రం బయట పెట్టలేకపోయారు.

తాతారావు ఏజెంట్లు బొర్రయ్య, కన్నదాసులను చూసిన కొంతమంది 'వాళ్లు సెయ్యగాలేంది మనమెందుకు సెయ్యలేమేటి?' అనుకుంటూ సొంతంగా బీల భూములు కొని కొంత లాభం చూసుకొని మళ్ళీ తాతారావుకే అమ్మటం మొదలుపెట్టారు.

దాంతో 'ఇదీ ఒకందుకు మనకు మంచిదేలే. ముందు ముందు ఏవన్నా అవాంతరాలు వస్తే రైతులెవ్వరూ నేరుగా నా దగ్గరకు రాలేరు. పైగా మనకు తిరుగుడు శ్రమ తగ్గుతుంది' అనుకున్న తాతారావు బీల గ్రామల్లో అలాంటి వాళ్లను మరింత మందిని ప్రోత్సహించాడు.

అట్లా గ్రామాల్లోని బీల భూమికి కృత్రిమ 'బూమ్' తీసుకు రావడంలో తాతారావు సఫలమయ్యాడు.

పొలాలు అమ్మిన రైతులు, మధ్యలో పుట్టుకొచ్చిన దళారీలు కూడా ముందు చూపులేకుండా జల్సాలకు అలవాటుపడి, ఇంట్లో ఆడవాళ్లు మొత్తుకుంటున్నా విన్పించుకోకుండా వచ్చిన డబ్బులు విచ్చలవిడిగా ఖర్చు పెట్టసాగారు.

అయితే వాళ్ళెవరికీ తాతారావు అసలు స్వరూపమేంటో, అతని వెనుక ఉండి కథను నడిపిస్తున్న వాళ్ళెవరో తెలియదు. ఆ బీల భూమి కొనుగోలు వెనుక ఎంతెంత పెద్ద పెద్ద ప్రణాళికలు రచించబడ్డాయో? పాపం వాళ్ళకు తెలియనే తెలియదు. తెలియడానికి అవకాశం కూడా లేదు.




ఏడాదిన్నర కిందట ఓ రోజు తాతారావు హఠాత్తుగా జీవభద్ర గ్రామంలో దిగినట్టుగానే ఆ రోజు హైదరాబాద్ నుండి ప్రముఖ సామాజిక, పర్యావరణ వేత్త అయిన ప్రొఫెసర్ నందగోపాల్ ఊళ్ళో దిగి "మీతో మాట్లాడేదుంది రండీ!" అంటూ గ్రామస్తులందరినీ రచ్చబండ దగ్గరికి పిలిపించాడు.

ప్రొ. నందగోపాల్ జీవభద్ర వచ్చాడని తెలిసిన చుట్టుపక్కల గ్రామాల్లో చదువుకున్న వాళ్ళూ, ఉపాధ్యాయులు మరికొంత మంది ప్రముఖులూ వెంటనే బయలుదేరి జీవభద్ర కొచ్చారు. ప్రొ. నందగోపాల్ అనుకున్న దానికంటే ఎక్కువమందే ఆ సమావేశానికి రావడంతో ఆయన కూడా సంతోషపడిపోతూ "నేనిక్కడికి రావడానికి ఒక ప్రత్యేకమైన కారణముంది" అంటూ అక్కడ చేరిన వాళ్ళందరినీ నిశ్శబ్దంగా

గమనించి చూడసాగాడు.

ఆ కారణమేంటోనన్న ఆసక్తితో "ఏంటో చెప్పండి సార్?" అన్నారు కొందరు యువకులు.

"మీ ప్రాంతానికో పెద్దముప్పు రాబోతోంది" రాళ్ళవానకు ముందు పిడుగులా ఓ మాట వదిలాడు నందగోపాల్.

"అదేంటి సార్?" ఆయనకు ఎదురుగానే నిల్చుని ఉన్న మల్లీశ్వర్ ఆశ్చర్యపడిపోతూ అడిగాడు వెంటనే.

మల్లీశ్వర్ అధికార పార్టీకి జీవభద్ర గ్రామంలో చురుకైన కార్యకర్త, అతనికి నలభైనాలుగేండ్లు. ఇంటర్‌దాకా చదువుకున్నాడు. ఊళ్ళో చౌకదుకాణం కూడా నడుపుతుంటాడు. మనిషి కొంచం పొట్టిగా, మందంగా ఉండి ఎప్పుడూ తెల్లటి లాల్చీ పైజామాలతో హుషారుగా కనిపిస్తుంటాడు. ఊళ్ళో ఏ కార్యక్రమమైనా మీదవేసుకుని చేస్తుంటాడు. సూటిగా, వినడానికి కొంచెం కటువుగా మాట్లాడినా ఎదుటివాళ్ళకు చేతనైనంత సాయం చేయాలనే తపన ఉన్నవాడు. అవతలి వ్యక్తి తప్పు చేశాడనుకుంటే ఎంతటి వాణ్ణయినా, ఆఖరికి సొంత తమ్ముడ్నయినా సహించలేని తత్వం కలవాడు. ఊళ్ళో కుర్రకారుకు ఇష్టమైన నాయకుడు, పెద్దవాళ్ళకు పద్ధతి గల మనిషి. సహజంగానే ప్రొ. నందోగోపాల్ మొదటి చూపులోనే ఎదుటివ్యక్తి గుణగణాలను అంచనా వేయగల దిట్ట. అలాంటి ఆయన తనను ప్రశ్నించిన మల్లీశ్వర్‌ని చూడగానే 'ఈ స్వామిపేట బీల గ్రామాల్లో ఇలాంటివాడు ఊరుకొక్కడున్నాచాలు. ఈ ప్రభుత్వాల, ఈ పెట్టుబడిదారుల, ఆ బహుళజాతి కంపెనీల నడ్డి విరగ్గొట్టే ఉద్యమాలు ఎన్నైనా చెయ్యవచ్చు, అనుకున్న ఫలితాలు కొంతమేరకైనా సాధించవచ్చు' అనుకున్నాడు మనసులో.

ప్రొ. నందగోపాల్ అరవైమూడేండ్లవాడు. ఆజానుబాహువు, విశాలమైన నుదురు, తెల్లటి విశాలమైన అతని కళ్ళు అతనిలోని జ్ఞానాన్ని, పట్టుదలను సూచిస్తుంటాయి. తెల్లగా పండిపోయిన నిండైన అతని జుట్టు అతనికో ప్రత్యేకమైన ఆకర్షణను, ఎదుటివారిలో ఓ గురుభావాన్ని తెచ్చిపెడుతుంది. తెల్లటి వంటి మీద నీలం రంగు జీన్స్‌ప్యాంట్ వేసుకుని దాని మీద హాఫ్ హాండ్స్ చెక్స్ బుష్‌షర్ట్ టక్ చేసుకున్నాడు. కాళ్ళకు తెల్లటి కేన్వాస్ షూస్ వేసుకున్నాడు. అతని ఎడమ భుజానికి ఓ నల్లటి లెదర్‌బ్యాగ్ వేళ్ళాడుతోంది. దాంన్లో ఓ డైరీ, మరికొన్ని ఇంగ్లీష్ పుస్తకాలూ ఉంటాయి.

"మీరంతా అనుకుంటున్నట్టు తాతారావు నిజంగా రైతుకాదు. అతనో కంపెనీ తరపున పనిచేస్తున్న సీక్రెట్ ఏజెంట్. కంపెనీ తరపున అతను కొంటున్న బీల భూముల్లో మీరనుకుంటున్నట్టు నిజంగా వాళ్ళు చేపల చెరువులు పెట్టబోవడంలేదు" చిరుచిరు జల్లులే కదా అనుకున్న వాన కాస్తా చూస్తుండగానే మాడుపెంకులు పగిలిపోయే వడగళ్లవానగా మారినట్టు ప్రొ. నందగోపాల్ మాటలు కూడా మామూలుగా మొదలై ఆ రచ్చబండ దగ్గర గుమిగూడిన జనాలను ఊపిరి కూడా తీసుకోనీయనంత విస్మయానికి, ఆందోళనకు గురి చేశాయి.

"చేపల చెరువులు కాకుండా ఇంకేం చేస్తారు?" అడిగారెవరో జనంలో నుంచి ఆతృతగా.

"థర్మల్ పవర్‌ప్లాంట్ కట్టబోతున్నారు" మెల్లగా అసలు విషయాన్ని బయటపెట్టాడు ప్రొ. నందగోపాల్.

"ఈ విషయాలన్నీ మీకెలాగ తెల్సినాయేటి?" వెంటనే సూటిగా ప్రొఫెసర్‌ని ప్రశ్నించాడు మల్లీశ్వర్.

చిరునవ్వుతో మల్లీశ్వర్ వంక వాత్స

ల్యంగా చూసిన ప్రొ. నందగోపాల్ "నేనీ మధ్య ఓ పనిమీద ఢిల్లీ వెళ్లినపుడు, ఏ.పి. భవన్‌లో దిగాను. అక్కడే నాకీ విషయం మొదటిసారిగా తెల్సింది" అంటూ బదులిచ్చాడు మల్లీశ్వర్‌కి.

"అయినా మా భూములు కొన్న కంపెనీ సివిల్ వర్క్స్ చేసే కంపెనీ కదా? ! పవర్‌ప్లాంట్‌లో వేలకోట్లు ఎట్లా పెడుతుంది?" విశాఖపట్నం స్టీల్‌ప్లాంట్‌లో ఇంజనీర్ ఉద్యోగం కోసం వేట మొదలు పెట్టిన ఆ గ్రామ యువకుడొకడు తనకు తెలిసిన మేరకు ప్రశ్నించాడు.

"ఈ దేశంలో ఓ గుమాస్తా ఉద్యోగం చేయాలన్నా దానికో విద్యార్హత కావాలి. కానీ ఓ కాంట్రాక్ట్ చెయ్యడానికో లేదా ఒక కర్మాగారాన్ని కట్టుకోవడానికో ఎలాంటి అర్హతలూ అవసరంలేదు. వాటికి కావాల్సిన అర్హతల్లో మొదటిది డబ్బు, రెండోది రాజకీయ పలుకుబడి, మూడోది కులం. అంతేతప్ప కాంట్రాక్టులు చేయడానికి, కర్మాగారాలు కట్టుకోవడానికి కాంట్రాక్టర్లకూ, పెట్టుబడిదారులకు కనీస విద్యార్హతలు, అనుభవాలు ప్రధానం కానేకాదు.

అట్లాగే మీరంటున్నట్టు కంపెనీవాళ్ళు ప్రధానంగా సివిల్ కాంట్రాక్టర్లు అయినంత మాత్రాన థర్మల్ స్టేషన్లు కట్టుకోకూడదని రూలేం లేదు కదా? పైగా లోక్‌సభలో ప్రతిపక్ష పార్టీకి చెందిన మీ ఎంపీ గంగాజగ్రావు, రాష్ట్ర ప్రభుత్వంలో మంత్రిగా పని చేస్తున్న నిశ్చింతరావులకు కట్టబోయే ఆ పవర్‌ప్లాంట్‌లో వాటాలున్నాయన్న విషయం నిజంగా మీకు తెలియకపోవచ్చు"

పురుగులు పట్టి కుళ్ళిపోయిన వంటి మీద వేసుకున్న విలువైన ఒక్కో వలువనూ విప్పి నగ్నదేహాన్ని చూపిస్తున్నట్టుగా ఒక్కో సత్యాన్ని బయట పెట్టసాగాడు ప్రొ. నందగోపాల్. ఓ పక్క తన మాటలు గ్రామస్తుల ఆలోచనల్లో ఎలాంటి భావాలను రేకెత్తిస్తున్నాయో నిశితంగా పరిశీలిస్తూనే ఉన్నాడు.

"అదేటి బావూ! మీరిలాగా సెబుతున్నారేటి? ఆళ్ళిద్దరి మధ్యా పచ్చగడ్డేస్తే భగ్గుమంటాది కదా!" ఎంపీ వర్గానికి చెందిన కార్యకర్త ఒకడు నమ్మలేని నిజాన్ని తొలిసారి వింటునట్టుగా విచిత్రంగా అడిగాడు.

గత ఎన్నికల్లో ఆ నాయకుల గెలుపు కోసం రెండు శిబిరాలుగా విడిపోయి పని చేసిన ఆ ఊరి యువకులు తమ మిత్రత్వాలను మరిచిపోయి స్పర్ధలు పెంచుకొని కొట్లాడుకొని, కేసులు పెట్టుకొని కోర్టుల చుట్టూ ఇంకా తిరుగుతున్నారు మరి!

"చూడు బాబూ! రాజకీయ నాయకులనే వాళ్ళు రెండు తలకాయల శిఖండుల వంటివాళ్ళు. ఒకేసారి రెండు రకాలుగా మాట్లాడగలరు. బయట మనలాంటి వాళ్ళం చూడడానికి ఒక ముఖంతో ఎదుటిపక్షాల నాయకులతో గొడవలు పెట్టుకుంటూ, తిట్టుకుంటూనే, మరో ముఖంతో ప్రపంచానికి కనపడకుండా వాళ్లల్లో వాళ్లు ఎంతో అన్యోన్యంగా మాట్లాడుకుంటూ వ్యాపారాలు, కాంట్రాక్టులు చేసుకుంటూ కోట్లు సంపాదించుకుంటారు.

వాళ్ళను అర్థం చేసుకోలేని మనం వాళ్ల కోసం తలలు పగులగొట్టుకుంటాం.

## కొత్తగాలి...

**కలిమి లేములు**
**మంచి చెడులు**
**జీవితంలో కలిసి**
**చరించే సహజీవులు!**

– సువారపు రామచంద్రరావు,
తిరువూరు, కృష్ణా జిల్లా

ఆస్తులు ధ్వంసం చేసుకుంటాం. లాఠీ దెబ్బలు తింటాం. తూటా దెబ్బలకు నేలకొరుగుతాం. పొరపాటున ఏ పత్రికో, ఏ టి.వి. ఛానలో వాళ్ల అవినీతి కుంభకోణాలు బయటపెట్టి, వాళ్ళను జైలుకి పంపితే తట్టుకోలేని మనం వాళ్ళకోసం మనంతటమనమే గొంతుకలకు ఉరితాళ్ళు తగిలించుకొనో, వంటిమీద పెట్రోల్ గుమ్మరించుకొనో, వాళ్ళ పట్ల మన అభిమానాన్ని ప్రాణత్యాగంతో రుజువు చేసుకుంటాం. ఇవన్నీ మీకందరికీ తెలియవని కాదు, నేను చెబుతున్నది. అన్నీ తెలిసి తెలిసీ మిడతల దండులా వెళ్ళి రాజకీయ నాయకుల స్వార్థపు ఘుంటల్లో పడి మసై పోతుంటాం" అంటూ ఒకింత ఉద్వేగానికి గురయిన ప్రొ. నందగోపాల్ తనను తాను అదుపులో పెట్టుకోవడానికా అన్నట్టు కళ్ళజోడు తీసి తెల్లటి జేబురుమాలుతో అద్దాలు తుడ్చుకోసాగాడు.

"అంత పెద్ద డీల్ వాళ్ళిద్దరి మధ్యా ఎట్లాకుదిరిందట సార్?" గంగా ప్రవాహంలా సాగిన ప్రొఫెసర్ ఉపన్యాసాన్ని విన్న మల్లీశ్వర్ ఆశ్చర్యం నుండి తేరుకుంటూ అడిగాడు.

'మంచి ప్రశ్న' అన్నట్టు మల్లీశ్వర్ వంక ప్రశంసాపూర్వకంగా చూస్తూ "వాళ్ల సయోధ్య మూలాల కోసం తవ్వుకుంటూ పోతే ఉదంకుడు పుట్టను తవ్వుకుంటూ పాతాళానికి చేరుకున్నట్టు, ఆ విషయం మీ జిల్లా స్థాయి నుండి అంతర్జాతీయ స్థాయిదాకా పోతుంది" నవ్వుతూ చెప్పాడు ప్రొ. నందగోపాల్, తిరిగి కళ్ళజోడు పెట్టుకుంటూ.

ఇన్ని రోజులుగా తమ కళ్ళముందు కన్పిస్తున్న తాతారావులాంటి ఓ చిన్ని నలుసు దగ్గర మొదలైన ఈ అంశం మూలాలు అంతర్జాతీయ స్థాయిదాకా ఉన్నాయనే వాస్తవం వినేసరికి అక్కడున్న గ్రామస్తులంతా ఇంకేం మాట్లాడలేక నిలువు గుడ్లేసుకుని నిల్చుండిపోయారు.

వాళ్ళ మానసిక పరిస్థితిని అర్థం చేసుకున్న ప్రొ. నందగోపాల్ "మన కేంద్ర ప్రభుత్వం ఇటీవల అమెరికాతో కుదుర్చుకున్న అణు ఒప్పందం విషయం మీకందరికీ తెల్సిందే కదా! వాళ్ళ ఉద్దేశం ఏదైనప్పటికీ కొన్ని రాజకీయ పార్టీలు ముఖ్యంగా వామపక్ష పార్టీలు పార్లమెంట్‌లో 'ఆ అణు ఒప్పందం మన దేశ సార్వభౌమత్వానికి, మన పర్యావరణానికి పెనుముప్పును తెచ్చిపెడుతుంది' అంటూ గట్టిగా వ్యతిరేకించాయి. పార్లమెంట్‌ను స్తంభింపజేశాయి.

దాంతో విషయం పార్లమెంట్‌లో బలపరీక్ష దాకా వెళ్ళింది. ఆ బలపరీక్ష మనం అనుకుంటున్నట్టు మన కేంద్ర ప్రభుత్వానికే కాదు. అంతర్జాతీయ ఆర్థిక సంస్థలకు, బహుళజాతి కంపెనీలకు, ముఖ్యంగా సంపన్న దేశాలకు అది పరువుప్రతిష్ఠల సమస్యగానూ అంతర్జాతీయ విధానాల పరంగా ఓ జీవన్మరణ సమస్యగానూ ముందుకొచ్చింది. వాళ్ళందరినీ జాగృతం చేసింది.

అధికారాన్ని నిలువుకోవడానికి పార్లమెంట్‌లో బొటాబొటి సంఖ్యా బలమున్న అధికార పార్టీకి ఇతర పార్టీలకు చెందిన ఎంపీల మద్దతు అవసరం ఏర్పడింది. ఫలితంగా ఒక్కో ఎంపీని కొనడానికి ఒక్కో కేంద్ర నాయకుడితోపాటు, సమన్వయ కర్తగా ఒక స్థానిక నాయకుణ్ణి నియమించింది అధికార పార్టీ. అందులో భాగంగానే మీ మంత్రిగారికీ, మీ ప్రతిపక్ష ఎంపీగారికీ మధ్య చాలా రహస్యంగా ఓ డీల్ కుదిరింది. ఆ సందర్భంలోనే ఢిల్లీ పెద్దలు మీ ఇద్దరికీ భవిష్యత్తులో ఓ పెద్ద పవర్‌ప్రాజెక్ట్ కట్టుకోడానికి అనుమతిస్తాం, స్థలం చూసుకోండి అంటూ ఓ బంపర్ ఆఫర్ ఇచ్చారు" అంటూ వివరిస్తున్న

ఆయనకు ఎవరో అడ్డం వచ్చారు.

"ఏం చేస్తాం సార్! దేశమంతా రాజకీయ నాయకుల చేతుల్లోకి వెళ్ళిపోయింది. మాలాంటి సామాన్యులమే కాదు, మీలాంటి మేధావులు కూడా వాళ్ళను ఏమీ చేయలేకపోతున్నారు" అంటూ పూర్తి నిరాశా నిస్పృహలతో మాట్లాడాడో మధ్య వయసు పెద్దమనిషి.

"మేధావులంటూ మమ్మల్ని మీ నుండి దూరం చేయకండి. ఎవరి రంగంలో వాళ్ళు మేధావులే. అయినా ఒక్కటి గుర్తు పెట్టుకోండి. ఏదేశ చరిత్ర అయినా, ఎంత పెద్ద మహోద్యమమైనా సామాన్యుల చేతనే నిర్మించబడింది" భుజానికున్న సంచిని తీసి పక్కన పెడుతూ అన్నాడు ప్రొ. నందగోపాల్ ఇంతకు ముందు మాట్లాడిన వ్యక్తిని ఉద్దేశిస్తూ.

"అసలు విషయం చెప్పండి సార్!" ఇందాకటి యువ ఇంజనీర్ కుతూహలంగా చూస్తూ అన్నాడు ప్రొ. నందగోపాల్‌తో.

"వస్తున్నా, వస్తున్నా.. ఆ విషయానికే వస్తున్నా. ప్రతిపక్ష పార్టీల ఎంపీలను ప్రలోభానికి గురిచేసి పార్లమెంట్ వేదికగా, నూటా ఇరవై కోట్లమంది భారతీయులే కాదు ప్రపంచవ్యాప్తంగా సకల దేశాల ప్రజలూ టీవీల ద్వారా నోట్లకట్టల భాగోతాన్ని చూసి నివ్వెరపోతుంటే సాగిన నెంబర్ల ఆటలో అధికారపక్షం విజయం సాధించింది. అణు ఒప్పందానికి ప్రభుత్వ ఆమోదముద్ర పడింది. ఆ విధంగా దేశ చరిత్రలో ఓ చీకటి అధ్యాయానికి మనం మౌన సాక్షులుగా మిగిలిపోయాం.

ఆనాటి ఒప్పందం ప్రకారం మీ ఎంపీ గంగాజల్రావుకి, మీ మంత్రి నిశ్చింతరావుకు కేంద్ర ప్రభుత్వ సూచనల మేరకు మన రాష్ట్ర ప్రభుత్వం ఈ బీల భూమిని చూపించి థర్మల్ స్టేషన్ కట్టుకోడానికి కావల్సిన చర్యలు చేపట్టింది.

ఢిల్లీ స్థాయిలో తనకున్న లాబీయింగ్ ద్వారా ఈ విషయం తెలుసుకున్న కుచేలా రియల్ పవర్ ప్రాజెక్టు యాజమాన్యం చకచకా పావులు కదిపి మీ ఎంపీని, మంత్రిని స్లీపింగ్ పార్టనర్లుగా పెట్టి థర్మల్ ప్లాంట్‌ను తమకు ఇవ్వాల్సిందిగా కేంద్ర ప్రభుత్వం మీద ఒత్తిడి తెచ్చింది.

పన్లోపనిగా కేంద్ర ప్రభుత్వం అంతర్జాతీయ ద్రవ్య సహాయ సంస్థలను సంతోషపెట్టి మరిన్ని అప్పులు పుట్టించుకోడానికి వాళ్ళు సూచించిన ఓ బహుళజాతి విద్యుదుత్పత్తి సంస్థకు కూడా స్వామిపేట థర్మల్ ప్లాంట్‌ను కట్టబెట్టాలనుకుంది. అయితే నేరుగా ఓ బహుళజాతి సంస్థకు అంతపెద్ద పవర్‌ప్లాంట్‌ను అప్పగిస్తే మళ్ళీ గొడవలు చేసే అవకాశం ప్రతిపక్షాలకు అనవసరంగా ఇచ్చినట్లవుతుందని పవర్ సెక్టార్‌లో ఏ మాత్రం అనుభవం లేని కుచేలా రియల్ఎస్టేట్ కంపెనీకి పవర్‌ప్లాంట్ కట్టుకొమ్మని చెప్పి పచ్చజెండా ఊపింది. అదీ మీ ఇద్దరు నాయకులతో పాటు మరో అమెరికా కంపెనీ కూడా స్లీపింగ్ పార్టనర్‌గా ఉంటుందని చెప్పి ఇచ్చింది" అరటిబోదె మీద ఒక్కో పొరా వలుచుకుంటూ పోతున్నట్టుగా థర్మల్ పవర్‌స్టేషన్ స్థాపన వెనుక దాగి ఉన్న ఒక్కో విషయాన్నీ విడమర్చి చెప్పుకుంటూ వచ్చాడు ప్రొ. నందగోపాల్.

"అమ్మో! దీని వెనుక ఇంత కథ ఉందా?" గుండెల మీద చేతులుంచుకుంటూ అక్కడ చేరిన వాళ్ళంతా గుసగుసలాడుకోసాగారు.

"ఔను మీరంతా ఎవరికి వాళ్ళు మనకెందుకులెమ్మని ఏమీ పట్టనట్టు కూర్చుంటే వాళ్ళ పని వాళ్ళు చాపకింద నీళ్ల మాదిరిగా చేసుకుంటూ పోతారు. పవర్ ప్లాంట్ పెట్టడానికి కావాల్సిన అనుమతులన్నీ మూడోకంటికి తెలియకుండా తెచ్చు

కుంటారు. కాబట్టి మీరంతా ముందు జాగ్రత్తపడండి. ఆ పవర్‌ప్లాంట్ నిర్మాణాన్ని మొదట్లోనే అడ్డుకొని మీ బీలను మీరు కాపాడుకోండి. మీ బతుకుల్లో పచ్చదనం ఆవిరి కాకుండా చూసుకోండి" అంటూ తను చెప్పదలచుకున్న విషయం ఏమిటో కూలంకషంగా వివరించిన ప్రొ. నందగోపాల్ తన ఉపన్యాసాన్ని ముగించి కూర్చున్నాడు.

ఆ తరువాత "మా బీల మాకు దక్కాలంటే మీ సహాయ సహకారాలు మాకందించాలి సార్! విలాస, కరిబుగ్గ జీడిపిక్కల ఫ్యాక్టరీల్లో కూలీలుగా చేరిన వందలాది మంది పేదవాళ్ళు ఎన్నో ఏళ్ళుగా ఆ కంపెనీలు వదిలిన, వదులుతున్న ఆ మసికీ, ఆ పొగలకు ఆరోగ్యాలు బలిచ్చిన నేపథ్యంలో వాళ్ళకోసం, పర్యావరణాన్ని కాపాడడంకోసం మీరు సాగించిన ఉద్యమం, సాధించిన విజయం మామూలు విషయం కాదు. ఆ విజయోత్సవ సభకొచ్చిన మీరు, మేం కోరగానే మా ఊరొచ్చి మాకు తెలియని ఎన్నో విషయాలు వివరించి రాబోయే ప్రమాదాన్ని ముందుగానే తెలియజేసి, మాకో దిశానిర్దేశాన్ని సూచించినందుకు మీకు ధన్యవాదాలు తెలియజేసుకుంటున్నాం" అంటూ విలాస జీడి గింజల కార్మికుల సభనుండి ప్రొ. నందగోపాల్‌ని జీవభద్రకు తీసుకొచ్చిన సభాధ్యక్షుడు లాయర్ రాజశేఖర్ మైక్ ముందుకొచ్చి మాట్లాడాడు.

వేదిక ముందు కూర్చున్న మల్లీశ్వర్ ఓ పక్క రాజశేఖర్ మాటలు వింటూనే మరో పక్క వాళ్ళిద్దరి మధ్యా పరిచయం ఎలా జరిగిందో, గతంలో రాజశేఖరే తనతో వివరించిన సంగతులను మననం చేసుకోసాగాడు.

★ ★ ★

విలాస, కరిబుగ్గ ప్రాంతాల్లో ఎన్నో ఏండ్ల నుండి జీడిపప్పుల కర్మాగారాల్లో వందలమంది కార్మికులు మసి, పొగ వంటి దారుణమైన పరిస్థితుల్లో పనిచేస్తూ జీడిపిక్కల మాదిరిగానే మాడిపోతూ అకాల మృత్యువు పాలవ్వసాగారు.

ఆ పరిసర గ్రామాలు విపరీతమైన వాతావరణ కాలుష్యానికి గురై ఎంతో మంది ప్రజలు రకరకాల రోగాల బారిన పడుతున్నారు.

ఆ విషయంలో ఒక లాయర్‌గానే కాకుండా, ఒక వ్యక్తిగా ఏదన్నా చేయాలన్న తహతహలో కొట్టుకోసాగాడు లాయర్ రాజశేఖర్.

సరిగ్గా అటువంటి సందర్భంలోనే...ఓ రోజున ప్రొ. నందగోపాల్ విశాఖపట్నం ఆంధ్రా యూనివర్సిటీలో 'ఉత్తరాంధ్ర వెనుకబాటుకు కారణాలు' అనే సదస్సుకు ముఖ్య అతిథిగా వచ్చారు.

ఆ సదస్సుకు అనుకోకుండా లాయర్ రాజశేఖర్ కూడా వెళ్ళాడు.

సదస్సు మధ్యలో భోజన విరామ సమయంలో రాజశేఖర్ మాటల సందర్భంలో విలాస, కరిబుగ్గ జీడిగింజల ఫ్యాక్టరీల గురించి వివరించాడు.

రాజశేఖర్ చెప్పిన అన్ని విషయాలనూ శ్రద్ధగా ఆలకించిన ప్రొఫెసర్ ఆ సాయం

### కొత్తగాలి...



**ఉదయించడం, అస్తమించడం**
**సూర్యుని లక్షణం**
**ఏ సమయాన్నయినా**
**జ్వలించడమే ప్రగతి లక్షణం**

– వి. సూర్యారావు,
అనకాపల్లి

త్రమే రాజశేఖర్‌తోపాటు విలాస వచ్చి జీడిగింజల పరిశ్రమల్లో కార్మికుల బతుకు వ్యథను, పర్యావరణ వధను ప్రత్యక్షంగా చూసి చలించిపోయారు. అప్పటికప్పుడే ఓ నిర్ణయానికి వచ్చి విలాస, కరిబుగ్గ పరిసర గ్రామాల్లో రెండు మూడు రోజులు పర్య టించి ఎన్నో ఆందోళనకరమైన అంశాలను గమనించి నమోదు చేసుకున్నారు.

అదే సందర్భంలో రాజశేఖర్‌లాంటి అభ్యుదయ భావాలు గల మరికొందరితో పాటుగా కళింగ ఉద్యమ నేపథ్యం ఉన్న కుటుంబాలలోని కొందరు యువకులు సహజంగానే ఆయనతో కలిసి జీడిగింజల కర్మాగార వ్యతిరేక ఉద్యమంలో ముందు వరుసలో నిలబడ్డారు. జీడిగింజల ఫ్యాక్టరీ యాజమాన్యాలతో తలపడడానికి తమ సంసిద్ధతను తెలియజేశారు.

ఇక అక్కణ్ణుండి రెండు మూడు సంవ త్సరాల పాటు అనేక రూపాల్లో, అనేక విధాలుగా ఉద్యమాలను నడిపిన ప్రొ.నందగోపాల్ ఆఖరికి ప్రజా ప్రయో జన వ్యాజ్యం కింద హైకోర్టులో కేసువేసి నడిపించారు.

జీడిపప్పు మిల్లుల యజమానులు కార్మి కుల మీద ఎన్నో రకాల నిర్బంధాలను కొనసాగించినా ఎవ్వరూ భయపడకుండా ఉద్యమబాట పట్టారు. ఆఖరికి యాజమా న్యాలు ప్రొఫెసర్ని కొనెయ్యడానికి కూడా ప్రయత్నాలు చేశాయి. కానీ నిప్పుకు చెదలు పట్టదన్న సత్యాన్ని వాళ్ళు త్వర గానే గ్రహించారు.

అంతిమంగా విలాస, కరిబుగ్గ ప్రాంతాల్లో గల జీడిగింజల కర్మాగారాలను వెంటనే మూసివేయాల్సిందిగా హైకోర్టు తీర్పు నిచ్చింది. అయితే కర్మాగారాల యాజమాన్యాలు కోర్టు ఉత్తర్వులను కూడా పెడచెవిన పెట్టి ఫ్యాక్టరీలను యథావిధిగా నడిపించసాగారు.

అటువంటి సందర్భంలో ఓరోజు రాత్రి వందలమంది కార్మికులు, పోలీసుల సాయంతో కర్మాగారాల మీద దాడి చేసి తెల్లవారేటప్పటికి అనేక జీడిగింజల కర్మా గారాల గేట్లు మూసి తాళాలు వేసేశారు

అదో అద్భుతమైన పోరాటం, అంతిమ విజయం ప్రజా పోరాటాలదే అన్న అంశం మరోమారు రుజువయింది.

అప్పటినుండి కళింగాంధ్ర మూడు జిల్లాల్లో ప్రొ. నందగోపాల్ పేరు తెలి యని వాళ్ళులేరు. అలాగే ఆ జీడిగింజల కర్మాగారాలను మూసివేసిన రోజును తమ విజయోత్సవ దినంగా భావించిన కార్మి కులు ప్రతి సంవత్సరం అదే రోజు విజ యోత్సవసభ జరుపుకోవడం ఆనవాయి తీగా పెట్టుకున్నారు. ఆ ఆనవాయితీ ప్రకారం ఈ సంవత్సరం కూడా జరుగు తున్న విజయోత్సవ సభకు ప్రొ. నందగో పాల్ రావడం జరిగింది.

ఆనాటి విజయోత్సవ సభ ముగిసిన తరువాత లాయర్ రాజశేఖర్ వంక చూస్తూ "మీ స్వామిపేట దగ్గర జీవభ ద్రలో ఓ చిన్న సమావేశం పెట్టాలనుకుం టున్న. రేపు కుదురుతుందా? " అంటూ ప్రశ్నించాడు ప్రొ. నందగోపాల్.

"జీవభద్రలో ఎందుకు? స్వామిపేట లోనే పెడదాం సార్" అన్నాడు లాయర్ రాజశేఖర్.

"కాదు, ఆ ఊళ్ళోనే పెట్టాలి" దృఢంగా అన్నాడు ప్రొ. నందగోపాల్.

"సరే సార్. మీ ఇష్టం" జీవభద్రలోనే ఎందుకంటున్నాడో అర్థం కాకపోయినా ఒప్పుకున్నాడు రాజశేఖర్.

"మల్లీశ్వర్‌ను వచ్చి మాట్లాడవలసిందిగా కోరుతున్నాను" అంటూ వేదిక మీద నుండి రాజశేఖర్ ఆహ్వానించడంతో ఆలో చనల్లో నుండి వాస్తవంలోకొచ్చిన మల్లీ శ్వర్ స్టేజీ మీదకు వెళుతుండగా...

అసలు విషయాన్ని అప్పుడే అర్థం చేసుకున్న గ్రామస్తులు "అందుకే కావచ్చు ఆ తాతారావు గాడు మన దగ్గర కొన్న బీల భూముల్ని కుచేలా కంపెనీ పేరు మీదనే రిజిస్ట్రేషన్ చేయించాడు. ఇదేంటని అడిగితే అసలు విషయం చెప్పకుండా మన నోర్లే మూయించేవాడు" ఆశ్చర్యంగా అనుకోసాగారు.

మల్లీశ్వర్ స్టేజీ ఎక్కి మైక్ ముందుకొచ్చి ఏదో మాట్లాడబోతుండగా...

అప్పటికే ఎంపీ, మంత్రిగార్ల దగ్గరనుండి మోటారు బైకులను గిఫ్టులుగా అందుకొని, భవిష్యత్తులో పవర్‌ప్లాంట్ కాలనీ కట్టేటప్పుడు ఆ పక్కనే తమకూ ఇళ్ళు కట్టించి ఇవ్వడంతో పాటు తమ కుటుంబాల్లో ఒక్కొక్కరికీ ఉద్యోగం ఇచ్చేలా హామీలు పొందిన ఇద్దరు స్థానిక విలేకర్లు కంపెనీకి అనుకూల వార్తలూ, వార్తా కథనాలూ రాసి పంపే రహస్య ఒప్పందం కుదుర్చుకున్నారు. జీవభద్ర గ్రామంలో పవర్‌ప్లాంట్‌కి వ్యతిరేకంగా జనాన్ని సమీకరించేందుకు వచ్చిన ప్రొ. నందగోపాల్ మాటలను రికార్డ్ చేసుకోవడానికి వచ్చినట్లుగా వచ్చిన ఆ విలేఖర్లు ఆయనతో వాగ్వివాదానికి దిగారు.

"వెనుకబడిన మా ప్రాంతం అభివృద్ధి చెందాలంటే పరిశ్రమలు స్థాపించాల్సిన అవసరం ఎంతో ఉంది. ఆ విధంగా చూస్తే ఇక్కడికి పవర్‌ప్లాంట్ రావడం మంచిదేగా? దేశంలో ప్రతిచోటా మీలాగే పర్యావరణం పాడవుతుందంటూ, ప్రజలు నిరాశ్రయులవుతున్నారంటూ పవర్‌ప్లాంట్‌లు పెట్టకుండా, ప్రాజెక్ట్‌లు కట్టకుండా అడ్డుకుంటూపోతే ప్రజావసరాలకు కావాల్సిన కరెంట్ ఉత్పత్తి ఎలా జరుగుతుంది? ఆ విధంగా మీరు అభివృద్ధి నిరోధకులుగా మారడం లేదా? చెప్పండి" అంటూ వారిలో ఓ విలేఖరి అన్నాడు.

"కర్మాగారం పెట్టకముందే ఎందుకూ పనికిరాని బీల భూములకు లక్షలరేటు వచ్చింది గదా? అదే రేపు కంపెనీ కట్టినట్టయితే ఇంకెన్ని రెట్లు భూముల రేట్లు పెరుగుతాయో చెప్పలేం కదా? అప్పుడు చిన్న, సన్నకారు రైతులు తమకున్న ఎకరం రెండెకరాలు అమ్ముకొని ఆ డబ్బులతో ఏదన్నా వ్యాపారం పెట్టుకొని హాయిగా బతకొచ్చుగదా?" ఫ్యాక్టరీ కడితేనే అందరికీ మంచిదన్నట్టు సిద్ధాంతీకరించాడు మరో విలేఖరి.

"ఈ ప్రాంతంలో ఏ రైతుకూ ఐదెకరాలకు మించి భూముల్లేవు. కొద్దిపాటి భూమితో చాలీచాలని వ్యవసాయం చేసుకుంటూ ఆ సన్నకారు రైతులంతా ఇబ్బంది పడేదానికంటే ఇదే మేలు కదా?"

"ఏ అభివృద్ధి పథకాన్నైనా అడ్డుకోవడమే ఆశయంగా పెట్టుకున్న సోకాల్డ్ మేధావుల, కొన్ని రాజకీయ పార్టీల వారి మాటలకు ప్రభావితులైన సామాన్యులు ఉద్యమం పేరుతో అరాచకవాదులుగా తయారవుతున్నారు" అంటూ అడ్డదిడ్డంగా వాదనకు దిగారు మరికొందరు ఎంపీ మనుషులు.

అంత దారుణంగా వాదానికి దిగిన వారితో తోటి విలేఖర్లు, గ్రామస్తులకే కాదు..

## కొత్తగాలి...

**పడక**
**పాలసముద్రం**
**పానుపు**
**పాము చుట్ట**
**కబ్జా కాదు! కన్నం పడదు!!**

– సి. సాయిప్రసాద్ రెడ్డి,
*చింతలగూడెం, ప. గో. జిల్లా*

ప్రొ. నందగోపాల్‌కు కూడా ఏం మాట్లాడాలో, ఎలా మాట్లాడాలో అంతుపట్టలేదు. చివరికి ఆయన "ప్రపంచ వ్యాప్తంగా పరిరక్షించాల్సిన చిత్తడి భూముల్లో ఈ స్వామిపేట చిత్తడి భూమి కూడా ఒకటిగా ప్రపంచ పర్యావరణ వేత్తలు ప్రకటించారు. ఆకుపచ్చ బీలను శాశ్వతంగా సమాధి చేసి, ఆ సమాధి మీద అభివృద్ధి పేరు చెప్పి థర్మల్ స్టేషన్ కడతామంటే ఒప్పుకునేదెలా?

ఈ బీల, రాతిపొరల కింద సమాధి అయిన తరువాత ఇక్కడి బావుల్లో చెరువుల్లో వాగుల్లో నీళ్ళుండవు. మీ ఎత్తిపోతల పథకాలు వట్టిపోతల పథకాలవుతాయి. చేపలవేట కోల్పోయిన వేలాది మత్స్యకార కుటుంబాలకు వేరే బతుకు తెరువు ఉండదు. పోనీ బతకడానికి వాళ్ళు ఏదో ఒక పనికి పోదామనుకున్నా, ఆ పని దగ్గర అప్పటికే ఉన్నవాళ్ళకే పనుల్లేక వారంలో నాలుగురోజులే పనిచేస్తూ అర్ధాకలితో బతుకుతుంటారు. మరి అటువంటి చోట్లకు కొత్తవాళ్ళు వెళితే కాంట్రాక్టర్లు, యజమానులూ కూలీరేట్లు మరింత తగ్గించి, పనిగంటలు పెంచి నానా రకాలుగా శ్రమ దోపిడీలకు పూనుకుంటారు. దానితో చేద్దామంటే పనుల్లేక, చేసిన పనికి సరైన కూలీ దొరక్క కార్మికులు అనివార్యంగా వక్రమార్గాల వైపు నెట్టివేయబడతారు. ఫలితంగా సంఘంలో అరాచకం ప్రబలిపోతుంది. ప్రస్తుత సమాజంలో ఎన్నో అనర్థాలకు ఇవే అసలు మూల కారణాలు" అంటూ సమస్యలను చాలా లోతుగా విడమర్చి చెప్పాడు ప్రొ. నందగోపాల్.

"మీరు గోరంతదాన్ని కొండంతలు చేసి చూపిస్తున్నారు సార్! దేశంలో ఎన్ని విద్యుత్ ఉత్పత్తి కేంద్రాలు పనిచేయడం లేదు. అక్కడల్లా మీరు చెప్పినట్టే జరుగుతోందా? జరిగి తీరాలని ఏదైనా రూలు ఉందా? " అంటూ మొదటి విలేఖరి మరింత మొండిగా ప్రశ్నించాడు.

అతనిది అమాయకత్వం అనుకోవాలో? అతి తెలివి అనుకోవాలో? సమస్యపట్ల అనుభవ రాహిత్యం అనుకోవాలో బేరీజు వేసుకుంటూ "చూడండీ! ఇక్కడ కట్టాలనుకుంటున్న థర్మల్ స్టేషన్ వ్యవస్థాపక సామర్థ్యం రెండువేల నాలుగువందల అరవై మెగావాట్లు. మరి దానినుండి ప్రతి రోజూ పర్యావరణంలోకి నలభైవేల టన్నుల పైచిలుకు బూడిద ఈ చుట్టుపక్కల ఎనభైకిలోమీటర్ల దాకా వెదజల్లబడుతుంది. ఆ బూడిద పడినంత మేర భూముల్లో పంటలు పండవు. దాంతో మనుషులకు, పశువులకు తిండి కరువు వస్తుంది. ఆరోగ్యాలు పాడైపోతాయి. ఇప్పుడీ ప్రాంతంలో మనం చూస్తున్న విదేశీ పక్షులే కాదు, ఇక్కడ పుట్టి, ఇక్కడే పెరిగే మన కాకులు, పిచ్చుకలు మచ్చుకు కూడా కన్పించవు. ఓ బాధ్యత గల విలేఖరిగా ఆ పరిస్థితి ఎంత దారుణంగా ఉంటుందో ఊహించుకోండి. మీరు ముందుండి ఈ దుర్మార్గాన్ని ఎదిరించాలి. ప్రపంచానికి ప్రకటించాలి" అంటూ ఎంతో ఉద్వేగంగానూ, ప్రాధేయ పూర్వకంగానూ వివరించాడు ప్రొ. నందగోపాల్.

"ప్రభుత్వం ప్రజల బాగుకోసమని భారీ పరిశ్రమలు వేలకోట్లతో నిర్మించడానికి ముందుకు వస్తుంటే మనం చెబితే మాత్రం వింటుందా? " రెండో విలేఖరి ఇంకా గుడ్డిగా వాదన మొదలుపెట్టాడు.

"ఏ ప్రభుత్వమైనా ప్రజల మాటను కచ్చితంగా విని తీరాలి. ఒకసారి సిడ్నీ ఒలంపిక్స్ సందర్భంగా ఒక స్టేడియం కట్టడం కోసం పని మొదలుపెడుతుండగా అక్కడున్న ఓ చిన్ని నీటిగుంటలో కొన్ని కొత్త రకం మచ్చల కప్పలు కన్పించడంతో

వార్తా సేకరణ కోసం అక్కడికొచ్చిన విలేఖర్లంతా ఆ కప్పలను ఫొటోలు తీసి అరుదైన జాతికి చెందిన ఈ కప్పల పరిరక్షణ కోసం అక్కడ స్టేడియం నిర్మాణం ఆపెయ్యాలంటూ వార్తా కథనాలు ప్రచురించారు. అంతే, ఆ వార్తలను చూసి పర్యావరణ ప్రేమికులైన ఆ దేశవాసుల్లో అత్యధికులు అక్కడ స్టేడియం నిర్మాణం ఆపివేసి జీవ వైవిధ్యాన్ని కాపాడాలంటూ ఆందోళనకు దిగడంతో ఆస్ట్రేలియా ప్రభుత్వం అక్కడ స్టేడియం నిర్మాణాన్ని రద్దు చేసింది. కేవలం ఒక్క కప్పజాతి పరిరక్షణ కోసమే అక్కడివాళ్ళు అంతగా స్పందించి స్టేడియం నిర్మాణాన్నే అడ్డుకుని విజయం సాధిస్తే ఇక్కడ మన బీలలో ఎన్నివందల రకాల అపురూప జీవాలు అదృశ్యమైపోతాయో ఆలోచిస్తే మనం ఎంతస్థాయిలో స్పందించాలో, ఎంత ఉద్యమాన్ని నిర్వహించాలో మీరే చెప్పండి" అంటూ ఆ పాత్రికేయుల్ని సూటిగా ప్రశ్నించాడు ప్రొ. నందగోపాల్.

ప్రొఫెసర్ మాటలతో ఉత్తేజితులైన గ్రామస్తులు ముందుకొచ్చి "ఏటిది? ఇలేకరి బావులూ! మీరేటి మాటాడుతున్నారో మాకేటి అర్థమవ్వట్లే! ఆ పెద్దాయన అల్లెక్కన్నుంచో హైదరాబాద్ నుంచి పారొచ్చీసి జరగబోయే అన్నేయం కల్లకట్టినట్టు ఇడమర్చి సెబుతుంటే, మీరేటిలాగ అడ్డంగా వాదిస్తున్నారు? "

"బీల మాకు కన్నతల్లి కన్నా ఎక్కువ, గౌర్నెంటోడు సాయంగా మా కాల్లకాడికి నడిసొచ్చేసి కోట్లు కుమ్మరిస్తామన్నా మేందాన్ని వదులుకుంటామేటి? "

"ఎవలకో కరెంటు వెలుగులు నింపేటందుకు మా ఇండ్లల్లోన బతుకు దీపాలు ఆర్పేసుకోవాలేటి? "

"చేపలవేట లేకుంట పోయినంక ఇల్లిక్కడ పల్లెకార్లంతా బతికేదెలాగేటి? "

"యవసాయం మా శరీరమైతే, బీల మా మూత్రపిండాల్లాటివి. మూత్రపిండాల్లేని మనిషికి సావు తప్పనట్టు బీల బోయిన్నాడు మా ఊల్లన్నీ వల్లకాట్లో కల్సిపోయినట్టే గదేటి? " మాటల తూటాలు ఆ విలేఖరుల మీదికి ఎక్కుపెట్టారు జనాలు.

గ్రామస్తుల దాడికి ఉక్కిరి బిక్కిరైన ఆ విలేఖరులు 'మాకు వత్తాసుగా మాట్లాడరేటి? ' అన్నట్టు మిగతా విలేఖరుల వంక కొరకొరా చూసినా వారు స్పందించలేదు. దాంతో "విలేఖర్లుగా మాకున్న సందేహాలను కూడా అడగొద్దంటూ మీరంతా అడ్డుపడి ప్రజాస్వామిక హక్కును కూడా కాదంటున్నారు. ప్రజాస్వామిక హక్కుల పరిరక్షణ తమ ధ్యేయంగా చెప్పుకునే

## గోరాశాస్త్రి చతురోక్తులు



'తెలుగు స్వతంత్ర', 'ఆంధ్రభూమి దినపత్రిక'లో అనేక సంపాదకీయాలు రాసిన గోరాశాస్త్రి తెలుగువారు గర్వించదగ్గ సంపాదకులలో ఒకరు. ఆయన వివిధ సందర్భాల్లో చెప్పిన చతురోక్తులు ఇవీ...

### ఎన్నేళ్ళు పాలించారా?

గోరాశాస్త్రిగారి విద్యాభ్యాసం బీఏ వరకు సాగింది. ఆయన నగరం, రాజమండ్రి, రామచంద్రాపురం, బరంపురం, భద్రాచలం, కాకినాడలో చదువుకున్నారు. విద్యార్థి దశనుంచే చిలిపి పనులు చేయడంలో దిట్ట. ఓసారి ఉపాధ్యాయుడు 'దశరథమహారాజు అయోధ్యను ఎన్నేళ్ళు పాలించాడు? ' అని విద్యార్థులను అడిగాడు.

దానికి పిల్లలంతా ఒకరిమొహాలు ఒకరు చూసుకుంటున్నారు, ఏం చెప్పాలో తోచకపోవడంతో. అప్పుడు గోరాశాస్త్రి వెంటనే లేచి నిలబడి 'ఆయన చచ్చేంత వరకూ పాలించాడు సార్!' అని కొంటెగా జవాబిచ్చాడు.

మాతోటి పాత్రికేయ మిత్రులు, ప్రొఫెసర్ కూడా ఒక్కమాటనూ మాట్లాడనందుకు నిరసనగా మేమీ సమావేశాన్ని బహిష్కరి స్తున్నాం" అంటూ వాళ్ళిద్దరూ అక్కణ్ణుంచి లేచి వెళ్ళిపోయారు.

వాళ్లు వెళ్ళిపోయిన తరువాత మరి కొంతసేపు ప్రొ. నందగోపాల్‌తో మాట్లా డిన మిగతా విలేఖర్లూ వెళ్ళిపోయారు.

విలేఖర్లంతా వెళ్ళిపోయిన తరువాత గ్రామస్తులంతా "సారూ! ఇందాక విలేఖర్లు చెప్పినట్టు నిజంగానే మా భూములకు రేట్లు పెరుగుతాయి. చాలా మందికి ఉద్యోగాలు దొరుకుతాయి గదా? " అంటూ ప్రొ. నందగోపాల్‌ని వివరమడిగారు.

## కొత్తగాలి...

**క్రీడాకారులు గర్వించేలా**
**ఒలింపిక్ పతకాలు తెస్తే**
**కల్మా'డీలు' కామన్ వెల్త్..!**
**పోగేసుకున్నారు మరి!!**

– పెన్మెత్స సూరిబాబు,
హైదరాబాద్

"వాళ్ళన్నట్టు భూముల రేట్లు పెరుగు తాయి నిజమే. మీలాంటి వాళ్ళ చేతుల్లో నుండి పొరపాటున భూమి ఒక్కసారి జారిపోతే మళ్ళీ మీ జీవితాంతం కష్టప డినా అర ఎకరం భూమి కూడా తిరిగి కొనుక్కోలేనంతగా రేట్లు పెరుగుతాయి. అది మీకు సమ్మతమేనా?

ఇప్పుడా డబ్బుల ఆశకు భూములు అమ్ముకున్న తరువాత, మీ ప్రమేయం లేకుండా పుట్టుకొచ్చే అనేక అవసరాలకు మీకు తెలియకుండానే ఆ డబ్బు ఖర్చు అయిపోయిన తరువాత ఆ థర్మల్ స్టేష నొచ్చి మీ బతుకుల్నిండా బూడిద నింపి, మిమ్మల్ని, మీ పశువుల్ని రోగాల పాలు చేసిన తరువాత ఆ కంపెనీ వాళ్ళు జాబులు ఎవరికిస్తారు? మీ అందరికీ ఉద్యోగాలివ్వడానికి అదేమన్నా ప్రభుత్వ కర్మాగారం అనుకుంటున్నారా? ఆషామా షీ కర్మాగారం అనుకుంటున్నారా? పూర్తిగా యంత్రాలతోనూ, పెద్ద పెద్ద ఇంజనీరింగ్ చదువులు చదువుకున్న కొద్ది మంది సాంకేతిక నిపుణుల సాయంతోనూ నడిచే అధునాతన విద్యుదుత్పత్తి కేంద్రమ ది తెలుసా? మీలాంటి వ్యవసాయదారు లకు, వ్యవసాయ కూలీలకు అందులో ఉద్యోగాలు దొరుకుతాయనుకుంటే అది వట్టి భ్రమ మాత్రమే అవుతుంది. ఇదంతా మిమ్మల్ని భయపెట్టడానికి చెబు తున్న మాటలు కావు. కచ్చితంగా జరగ బోయే కఠోర వాస్తవాలు" అంటూ వాస్త విక అంశాలను పనస తొనలు వలిచినట్టు ఒక్కొక్క విషయాన్ని విడమర్చి చెప్పాడు ప్రొ. నందగోపాల్.

"ఇంత ఇలువైన బీలను ముంచేసి ఇక్కడే పవర్‌ప్లాంట్ కడతామంతానికి అసలు కిటుకేటో వివరించి చెప్పండి మాస్టు బావూ!" అప్పటి దాకా ముందు వ రుసలో నిలబడి ప్రొఫెసర్ చెప్పిన ప్రతి మాటనూ సావధానంగా విన్న ఎండమ్మ ఒక్కసారిగా ప్రశ్నించింది.

"వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి పేరుతో తమ లాభాల కోసం విద్యుత్ ప్రాజెక్ట్‌లు నిర్మించే పారిశ్రామిక వేత్తలకు ఇటు ప్రభుత్వం ఎన్నో రాయితీలు కల్పిస్తే అటు అంతర్జాతీయ ఆర్థిక సంస్థలు తమకు కావాల్సిన బహుళజాతి కంపెనీ లకు ఆ ప్రాజెక్ట్‌లను కట్టబెడుతున్నాయి. పైకి మాత్రం బడుగు దేశాల, బీద ప్రజల అభివృద్ధికి నిధులిస్తున్నామని అవి నటి స్తుంటాయి.

అది మొదటి కారణమైతే ఇక్కడ కర్మా

గారానికి అవసరమైన నీటికి కరువుండదు. ఇంకా ముఖ్యంగా చెప్పాలంటే పక్కనే ఉన్న సముద్రాన్ని అటు విదేశాల నుండి బొగ్గు తెచ్చుకునే రహదారిగానూ, ఇటు కంపెనీ నుండి వెలువడే వ్యర్థాలను పడ వేసే చెత్తకుండీగానూ వాడుకోవచ్చు అన్న ఆలోచన రెండవది" అంటూ ఎండమ్మతో పాటుగా అక్కడున్న వాళ్ళందరికీ అర్థ మయ్యే రీతిలో వివరించాడు ప్రొ. నంద గోపాల్.

అట్లా దాదాపు గంట, గంటన్నరసేపు గ్రామస్తులకు, ప్రొఫెసర్‌కి మధ్య అనేక విషయాల మీద ప్రశ్నలు, సమాధానాల కార్యక్రమం ఏ నిర్వాహకులూ లేకుండానే ఎంతో ఉపయుక్తంగా జరిగింది. సమా వేశం ముగిసిన తరువాత ప్రొ. నందగో పాల్ ఊళ్ళో ముఖ్యమైనవాళ్ళను ఓ పది మందిని కూర్చోబెట్టి థర్మల్ ప్రాజెక్ట్‌కు వ్యతిరేకంగా ప్రజా ఉద్యమాన్ని ఎలా నిర్మించుకోవచ్చో విపులంగా వివరించి, అవగాహన కల్పించారు.

"మీకు ఎప్పుడు సహాయం కావాలన్నా వెంటనే నాకు ఫోన్ చేయండి... తప్ప కుండా సహాయం చేస్తాను" అంటూ భరోసా ఇచ్చి అటునుంచి అటే ఆయన ఒడిషాలో పోస్కో స్టీల్‌ప్లాంట్ నిర్మాణా నికి వ్యతిరేకంగా ఆదివాసీలు నిర్వహి స్తున్న పోస్కో ఉద్యమానికి నైతిక మద్దతు తెలపడం కోసం గోవింద్‌పూర్, ఢెంకియా గ్రామాలకు వెళ్ళిపోయాడు.

అది మొదలు ఆ ఇద్దరు స్థానిక విలే ఖర్లు స్వామిపేట బీల భూముల విష యంలో ప్రజల పాత్రను, వాళ్ల ఆందోళన ను, అభద్రతను గురించి రాయకపోగా వారికి వ్యతిరేక వార్తలనే పేపర్ల నిండా రాయసాగారు.

నిశి రాత్రిలో మెరుపు మెరిసినట్టుగా వచ్చి వెళ్ళిన ప్రొ. నందగోపాల్ పుణ్యమా అని తాతారావు అసలెవరో? అతని ఉనికి ఏమిటో? బీల భూముల్లో కట్టబోయే ప్రాజెక్ట్ ఏమిటో? మొత్తం జనానికి తెలిసి పోయింది. దాంతో అందరూ శాంతియుత పోరాటానికి సిద్ధమయ్యారు.




**ప్రొ.** నందగోపాల్ వచ్చి వెళ్ళిన తరు వాత ఆయన మాటలు విన్న మల్లీశ్వర్‌కి తన పార్టీ మీద, తన నాయకుల మీద, ఆఖరికి ప్రభుత్వ విధానాల మీద ఒక పరి పూర్ణమైన అవగాహన ఏర్పడింది. అసహ్యం కల్గింది. దాంతో అతను పూర్తిగా మారిపోయాడు. ఏది ఏమైనా ఆఖరికి ప్రాణాలు పోయినా సరే బీలలో పవర్ ప్లాంట్‌ను అడ్డుకోవాలని బలంగా నిర్ణయం తీసుకున్నాడు. అందుకే ఊళ్ళో ఉన్న తన మిత్రులందరినీ ఆ విషయం మీద చర్చించడానికి కూర్చుందాం రమ్మంటూ ఒకటికి నాలుగుసార్లు పిలి చాడు.

ఎన్నిసార్లు పిలిచినా మిత్రబృందం అంతా 'వస్తాం, వస్తాం' అంటూ చెప్పడమే తప్ప ఒక్కసారిగూడా వచ్చింది లేదు.

దాంతో బాగా ఆలోచించిన మల్లీశ్వర్ 'వీళ్ళతో లాభం లేదు' అనుకుని ఓరోజు స్వామిపేట వెళ్ళి తన చిన్ననాటి మిత్రుడు, ప్రొ. నందగోపాల్‌తో పరిచయం ఉన్న వాడు, లాయరయిన రాజశేఖర్‌ని కలిసి

తన మనసులో సుడులు తిరుగుతున్న ఆలోచనలను అతని ముందు వ్యక్తం చేసి, "మనం ఏదో ఒకటి చెయ్యాలి" అంటూ పట్టుపట్టి కూర్చున్నాడు.

మిత్రుని ఆలోచనలను స్వాగతించిన లాయర్ రాజశేఖర్ చివరికి "సర్లే! అలాగే చేద్దాంగాని నువ్విలా క్యూర్చోరా బావూ!" అన్నాడు. అంటూనే- సమస్య మూలాలను తెలుసుకోవాలనంటూ ఇంటర్నెట్ ను ఓపెన్ చేసి భారీ థర్మల్ ప్రాజెక్ట్ వల్ల కలిగే ప్రమాదాలను, పర్యావరణ విధ్వంసాన్ని, కాలుష్య కారకాలను గురించిన సమాచారాన్ని చూడడం మొదలుపెట్టాడతను. చూస్తున్న కొద్దీ రాజశేఖర్ ముఖంలో రకరకాల భావాలు వేగంగా మారిపోసాగాయి.

మల్లీశ్వర్ పరిస్థితీ అదే.

"ఈ సమాచారాన్నంతా ప్రింట్లు తీసి, జిరాక్స్‌లు చేయించి, మొత్తం బీల గ్రామాల్లో కనీసం ఊరికో కాపీ పంచాయితీ ఆఫీసుల్లో పెట్టి వస్తే కొంత ప్రయోజనం ఉండొచ్చు. ఆ తరువాత ఏం చెయ్యాలో ఆలోచిద్దాం" అన్నాడు మల్లీశ్వర్‌తో లాయర్ రాజశేఖర్.

మిత్రుని మాటలకు చిరునవ్వు నవ్వుతూ "పొద్దున లేచింది మొదలు రాత్రి పడుకునే వరకు టీవీలకు, సెల్‌ఫోన్లకూ అలవాటు పడిపోయిన జనాలకు ఇన్నిన్ని పేజీలు, అందులోనూ ఇంగ్లీషులో చదివే ఓపికెక్కడిది? ఒకవేళ ఒకరో ఇద్దరో చదివి అర్థం చేసుకునేవాళ్ళు ఉన్నా అలాంటి వాళ్ళకు ఉద్యమాలన్నా, సామాన్యులతో కలిసి పని చేయాలన్నా నడి ఎండాకాలం రాత్రి కరెంట్ లేక ఉక్కపోతకు గురవుతున్న వాళ్ళ మాదిరిగా ఇబ్బంది పడతారు.

పైగా అలాంటి వాళ్ళు ఇదంతా చూసి 'పవర్‌ప్లాంట్ వస్తేనే మంచిది' అంటూ మనకు వ్యతిరేకంగా ప్రచారం మొదలుపెట్టినా ఆశ్చర్యపోవలసింది లేదు. ఎందుకంటే ఈ తరహా మేధావులు ప్రతి అంశాన్నీ ప్రపంచీకరణకు ముడిపెడతారు. ప్రపంచీకరణ అనేది ఓ అనివార్యమైన అంశం. అదో సర్వరోగ నివారిణి. మూర్ఖంగా దాన్ని వ్యతిరేకించే కంటే స్వాగతించి అందులోనుండి ఫలితాన్ని పిండుకోవాలంటారు. కాకపోతే ఇంకో పనిచెయ్యొచ్చు" మిత్రుడు చెప్పిన విషయాల మీద ఒక అవగాహనకు వచ్చినట్టుగా మాట్లాడాడు మల్లీశ్వర్.

మల్లీశ్వర్ ఏదైనా ఒక పని, అదెంత కష్టమైనదైనా చెయ్యాలనుకున్నాడంటే అది చేసిందాకా, దాని అంతు చూసిందాకా నిద్రపోడనే అనుభవం బాల్యం నుండి ఎరిగి ఉన్న రాజశేఖర్ "ఏంటది?" అన్నాడు ఆసక్తిగా చూస్తూ.

"ఏం లేదు. ఈ నెట్‌లోని విషయాల సారాంశాన్ని తీసుకుని క్లుప్తంగా తెలుగులో ఒక కరపత్రం తయారుచేసి, ఆ కరపత్రాలను అవసరమైతే వేల సంఖ్యలో అచ్చేయించి, ఇరవైఎనిమిది బీల గ్రామాల్లో ఇంటింటికి పంచాలి. అప్పుడు అసలు విషయం ఎక్కువమంది సామాన్యులకు చేరుతుంది" తన బుర్రలో అప్పటికప్పుడు రూపుదిద్దుకున్న ఒక వ్యూహాన్ని ఊహించుకుంటూ మంద్రస్వరంతో చెప్పుకొచ్చాడు

## కొత్తగాలి...



**సెక్యులరిజపు మర్రిచెట్టు**
**పైనేమో రాబందులు**
**కింద పావురాళ్లు**
**మనదీ ప్రజాస్వామ్యమే!**

– కె.వి. సుబ్రహ్మణ్యం,
విశాఖపట్నం

మల్లీశ్వర్.

రెండు మూడు గంటలపాటు నెట్‌లోని సమాచారంతో కుస్తీపట్టిన రాజశేఖర్ అంత విస్తృతమైన సమాచారాన్ని రెండు పేజీల స్థాయికి కుదించి తెలుగులో రాసి మల్లీశ్వర్‌కు ఇచ్చాడు.

"నువ్వీ కాగితాలు తీసుకుని చర్చి సెంటర్లో ఉన్న కె.కె.గ్రాఫిక్స్ కార్తీక్ దగ్గర డి.టి.పి. చేయిస్తుండు. నేను పాలకేంద్రం సెంటర్ దాకా వెళ్లి నా క్లయింట్‌తో ఓ పేపర్ మీద సంతకం తీసుకుని నేరుగా అక్కడికే వస్తాను" అంటూ లేచాడు లాయర్ రాజశేఖర్.

"సరే" అంటూ ఆ కాగితాలు తీసుకుని చర్చి సెంటర్‌కెళ్ళిన మల్లీశ్వర్ డి.టి.పి. చేయిస్తుండగా వచ్చిన రాజశేఖర్ "ఒక పని చేస్తే..?" అన్నాడు మిత్రుని పక్కనే కూర్చుంటూ.

"ఏంటది?" టైప్ అవుతున్న మేటర్ వంకచూస్తూ యథాలాపంగా అడిగాడు మల్లీశ్వర్.

"మన కృష్ణారావు మాష్టారు అమెరికా నుండి నిన్నే ఊళ్ళో దిగారట. ఇప్పుడే తెల్సింది. మనం ఈ కాగితాలు తీసుకుని వెంటనే ఆయన దగ్గరకెళ్ళి విషయమంతా చెప్పి, ఆయన్నిగనుక రంగంలోకి దింపామంటే ఆయన మాట మీద బీల గ్రామాల ప్రజలు కచ్చితంగా కదులుతారు. దేన్నికైనా సిద్ధపడతారు. ఆయనంటే ప్రజల్లో అంత అభిమానముంది. నాకు తెలిసి ఆయన కూడా జనానికి ఇబ్బంది కలిగించే ఈ విషయం మీద వెంటనే స్పందిస్తారు" అన్నాడు రాజశేఖర్.

మిత్రునికొచ్చిన ఆలోచనను మనస్ఫూర్తిగా ఆమోదిస్తూ "హ్వా! ఇంకేటి బ్రహ్మాండమైన ఆలోచన చేశావు, పదా!" అంటూ ఉత్సాహపరిచాడు మల్లీశ్వర్ కూడా.

డి.టి.పి. చేసిన కాగితాలను తీసుకుని వెంటనే కృష్ణారావు మాష్టారి ఇంటికి బయలుదేరారు రాజశేఖర్, మల్లీశ్వర్‌లిద్దరూ.

వాళ్ళు వెళ్లేసరికి కృష్ణారావు మాష్టారు కూడా దాదాపు అదే పనిచేస్తున్నారు. తన ఇంటిపక్కనే ఉన్న ముకుందరావు మాష్టారుతో ప్రొ. నందగోపాల్ వచ్చి వెళ్లిన నాటి సంగతులు అడిగి తెలుసుకుంటున్నాడు.

కృష్ణారావు మాష్టారు పదవీ విరమణకు ఇంకో సంవత్సరం దూరంలో ఉన్నాడు. మనిషి కొంచెం కురచగా చామన ఛాయతో చూడటానికి అంత వయసు ఉన్నవాడిలా అనిపించడు. కళ్ళకు చత్వారం అద్దాలున్నాయి. తల మీద జుట్టు పల్చబడింది. కానీ తెల్లబడటం జరగలేదు. ఎప్పుడూ మల్లెపువ్వు లాంటి ప్యాంట్, బుష్ షర్ట్ వేసుకుంటాడు.

తనింటికే వస్తున్న రాజశేఖర్, మల్లీశ్వర్‌లను చూసిన కృష్ణారావు మాష్టారు వెదకబోయిన తీగె కాలికి తగిలింది అనుకుంటూ "రండి, రండి!" అని ఆహ్వానిస్తూ కుర్చీలు చూపించాడు.

మాష్టారుకి ఎదురుగా కుర్చీల్లో కూర్చున్న మల్లీశ్వర్, రాజశేఖర్‌లిద్దరూ తాము తీసుకొచ్చిన కరపత్రాన్ని ఇచ్చి చూడమన్నారు. దాన్ని చదువుతున్న మాష్టారి ముఖంలో క్రమంగా వెలుగురేఖలు విచ్చుకోవటం గమనించారు.

కృష్ణారావు మాష్టారు ఓ దీర్ఘ నిశ్వాసాన్ని వెలువరిస్తూ "కరపత్రం చాలా వివరంగా వచ్చింది. కానీ ఇది బీల గ్రామాల్లోని ప్రతి ఇంటికీ చేరినప్పుడే అంతో, ఇంతో ప్రయోజనం ఉంటుంది" అన్నారు. ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నట్టుగా ఆయన నుదుటి మీద ముడుతలు తేలాయి.

"ఔను మాష్టారు! మొత్తం ఇరవై ఎనిమిది బీల గ్రామాలకు గ్రామం ఒక్కింటికి వెయ్యి లెక్కన పంచినా మొత్తం ఇరవైఎని

మిది వేల కరపత్రాలన్నా వేయించాలి. ఆ విషయం మేము ఇంతకు ముందే చర్చించుకున్నాం" ఇంతకుముందు తామిద్దరూ మాట్లాడుకున్న మాటలు చెవుల్లో ధ్వనిస్తుంటే చెప్పుకొచ్చాడు మల్లీశ్వర్ మాష్టారితో.

"అన్ని కరపత్రాలు వేయించాలంటే మాటలు కాదు. ఖర్చుతో కూడుకున్న పని. అంత డబ్బు ఎక్కడిది? ఏదైనా ఓ సమస్య మీద పనిచేయాలనుకున్నప్పుడు వచ్చే మొదటి సమస్య డబ్బే" అంటూ అనుభవపూర్వకంగా తానెరిగిన సత్యాన్ని సాకల్యంగా ప్రస్తావించాడు కృష్ణారావు మాష్టారు.

"ఔన్సార్! అన్ని సమస్యలూ ఆర్థిక సమస్యలతో ముడిపడి ఉంటాయి. అందుకే మేం ఒక పని చేద్దామనుకున్నాం" అంటూ మిగతాది చెప్పమన్నట్టు మిత్రునివైపు చూశాడు రాజశేఖర్.

"స్వామిపేటలో ఉన్న షావుకార్లను, డాక్టర్లను, టీచర్లను ఇంకా ఇతర ఉద్యోగవర్గాలవారినీ, వారి వారి ఇళ్ళకెళ్ళి ఈ కరపత్రం ఇచ్చి, మీరు తెర వెనుక నుండి మీ చేతనైనంత ఆర్థిక సాయం చేయండి చాలు. మేం ముందు నిలబడి థర్మల్ ప్రాజెక్ట్‌కి వ్యతిరేకంగా ఉద్యమాన్ని నిర్మిస్తామన్జెప్పి జోలెపట్టి చందాలు వసూలు చేయడమే ఆర్థిక సమస్యకు అసలైన పరిష్కారం. ప్రజల యొక్క, ప్రజల చేత, ప్రజల కొరకు" అనే ప్రజాస్వామ్య మూలాన్ని తనకు తెలియకుండానే ఆచరణలోకి తెచ్చే ప్రతిపాదన చేశాడు మల్లీశ్వర్.

"సెహభాష్! మీ ఆలోచన చాలా బాగుంది. సామాన్య ప్రజానీకాన్ని భాగస్వాములుగా చేయకుండా ఏ ఉద్యమమూ విజయవంతం కాలేదు" అంటూ మెచ్చుకున్న కృష్ణారావు మాష్టారు ఫోన్‌చేసి సిరిబుద్ధ నుండి తన సహచరుడు సుందరరావు మాష్టారును, పోస్ట్‌మాస్టర్ బడగల రమణమూర్తినీ వెంటనే బయలుదేరి తన ఇంటికి రమ్మని చెప్పాడు.

చెప్పినట్టుగానే సుందరరావు మాష్టారు, పోస్ట్‌మాస్టర్ రమణమూర్తులిద్దరూ అరగంటలో కృష్ణారావు మాష్టారు ఇంటికి చేరుకున్నారు.

ఆ ఐదుగురు కూర్చుని ఆ రాత్రంతా ఎన్నెన్నో ఆలోచనలు చేసి చివరికి థర్మల్ విద్యుత్ ప్రాజెక్ట్ వ్యతిరేక ఉద్యమానికి ఒక తాత్కాలిక ప్రణాళికను రూపొందించారు. అన్నింటికన్నా ముఖ్యంగా ముందు ముందు ఉద్యమక్రమంలో ఏ చిన్న పని చేయాలన్నా ఐదుగురూ కూర్చుని మంచీచెడులు నిర్ణయించుకున్న తరువాతనే ముందడుగు వేయాలి. అంతేతప్ప ఇతరులు ఎవరెవరో చెప్పిన మాటలను గుడ్డిగా నమ్మి ఉద్యమాన్ని నడపకూడదు అన్న నిర్ణయం తీసుకున్నారు.

సుందరరావు మాష్టారుకి ఓ గురుతరమైన బాధ్యతను అప్పగించారు. భారీ థర్మల్ విద్యుత్ ప్రాజెక్టుల నిర్మాణం వల్ల రాబోయే ప్రమాదాలను, అందువల్ల జరిగే పరిణామాలతోపాటు ప్రాజెక్ట్‌ల నిర్మాణాన్ని అడ్డుకోవడానికి ప్రపంచ వ్యాప్తంగా జరిగిన, జరుగుతున్న ఉద్యమాల సమాచారాన్ని సేకరించాలి. అందులో నుండి తమ ఉద్యమానికి అవసరమైన మేరకు సమాచారాన్ని వడబోసి మిగతా సభ్యులకు తెలియజేయాల్సివుంటుంది.

ఇక పోస్ట్‌మాస్టర్ రమణమూర్తి, మల్లీశ్వర్‌లకు బీల ప్రాంతంలో ఉన్న గ్రామాల్లో ఉద్యమం ఊపందుకునేందుకు చేపట్టాల్సిన కార్యక్రమాల బాధ్యతలను అప్పగించారు.

ఈ ఉద్యమంలో ముందు ముందు అవసరమయ్యే పోలీస్, న్యాయ వ్యవహారాలకు సంబంధించిన అంశాలు లాయర్ రాజశేఖ

ర్‌కి కేటాయించడం జరిగింది.

ఈ నలుగురినీ సమన్వయ పరుచుకుంటూ మొత్తం ఉద్యమానికి నాయకత్వం వహించాల్సిన బాధ్యత కృష్ణారావు మాష్టారు స్వయంగా తన భుజాల మీదకు ఎత్తుకున్నారు.

అలా పనుల పంపకం జరిగిపోయిన తరువాత ఉద్యమానికి ఓ జెండా కూడా అవసరమనే అతి ముఖ్యమైన అంశం ముందుకొచ్చింది. అయితే ఆ జెండా ఏ రాజకీయ పార్టీ జెండా కాకూడదు అనే నిర్ణయం గట్టిగా తీసుకున్నారు. ఆ నిర్ణయం తీసుకోవడానికి వాళ్ళకో సహేతుకమైన కారణం కూడా ఉంది.

ఒక పార్టీ జెండా కింద కార్యక్రమం మొదలు పెట్టినట్లయితే, మిగతా రాజకీయ పార్టీలన్నీ ఉద్యమానికి దూరమవుతాయి. అంతేకాక జరుగుతున్న ఉద్యమాన్ని బలహీన పరిచే కార్యక్రమాలను ప్రత్యక్షంగా కంటే పరోక్షంగా ఎక్కువగా చేపడతాయి. చేరాల్సిన గమ్యాన్ని ఆ విధంగా అడ్డుకుంటాయి. కాబట్టి వెనువెంటనే ఓ జెండాను ప్రత్యేకంగా తయారు చేసుకోవాల్సిన అవసరం ఎంతో ఏర్పడింది.

చాలా సేపు తర్కించుకున్న తరువాత "జెండా కావాలన్న ఆలోచన సరైనదే. కానీ ఇప్పటికిప్పుడు జెండా అంటే మాటలా? ఆ జెండాకో అర్థం, పరమార్థం ఉండాలి కదా!? " తన లాయర్ బుర్రకు సహజంగా పుట్టుకొచ్చే సందేహాలను అందరి ముందు పెట్టాడు రాజశేఖర్.

ఆ మాటలు వింటూనే "అదేదో మీరే ఆలోచించండి! మనదెంత సేపూ ఫీల్డ్ వర్కే" నవ్వుతూనే తన బలాన్ని, బలహీనతలు రెంటినీ వెలిబుచ్చాడు మల్లీశ్వర్ మిగతా వాళ్ళ వంక చూస్తూ.

"దానికంత బుర్ర బద్దలు కొట్టుకోవడం ఎందుకు? ఓ పని చేస్తే పోలా? " ఏదో ఆలోచిస్తూ అన్నారు సుందరరావు మాష్టారు.

"ఏటది? " వెంటనే అడిగాడు రమణమూర్తి ఆసక్తిగా చూస్తూ.

"మన బీల మూడొందల అరవై రోజులూ పచ్చగానే ఉంటుంది కదా!" అన్నారాయన.

"ఔను" అన్నారు రమణమూర్తి.

అంచేత మన జెండా రంగు ఆకుపచ్చైతే

## పెన్సిల్‌తో పనేముంది?

ఒకసారి ఆచంట జానకిరాంగారు ఆంధ్రభూమి కార్యాలయానికి వెళ్లి గోరాశాస్త్రిగారితో, 'ఇప్పుడు మీరేం చేస్తున్నారు? ' అని ప్రశ్నించారు.

దానికి శాస్త్రిగారు 'ఇప్పుడా! ఇప్పుడే పెన్సిలును చెక్కుతున్నాను' అన్నారు.

'ఏం.. ఎందుకట? ' అన్నారు ఆచంట జానకిరాం.

'ఎందుకేవిటీ? రోజూ పెన్సిల్ చెక్కేవాడే పత్రికారచయిత. ఏరోజు కారోజు పెన్సిలు ముక్కు వాడిగా ఉండాలి. పెన్సిలుతో రాసే



రాతలు సిరాతో రాసే రాతల్లాగా శిలాక్షరాలు కాకపోవచ్చు. కానీ ఆ రోజుకు మాత్రం వెలుగిచ్చే సూర్యోదయంలాంటివి. ప్రతిరోజూ వాడిదనంలో సంపాదకుడి వేడిదనం కనపడాలి కదా? ' అన్నారు గోరాశాస్త్రిగారు.

ఇలా తన వృత్తికి ముడిపెట్టి తను చేస్తున్నపనిని చక్కగా వివరించడంతో ఆచంట జానకిరాం ఫక్కున నవ్వారు.



బావుంటుందేమో ఆలోచించండి" అన్నారు సుందరరావు.

"మంచి ఆలోచన" అన్నాడు రాజశేఖర్ సంతోషంగా.

"ఆ తరువాత? " అడిగారు కృష్ణారావు మాష్టారు.

"బీలలో ఎన్నో వందల రకాల పక్షులుంటాయి కాబట్టి జెండా మధ్యలో ఏదో ఒక పక్షి బొమ్మను తీసుకుంటే సరిపోతుంది గదా!" అంటూ తన ఉపాధ్యాయ వృత్తిలోని మెలకువల నుండి గ్రహించిన నైపుణ్యంతో వెంటనే జెండాకు మనసులో రూపకల్పన చేస్తూనే బహిర్గతం చేశారు సుందరరావు మాష్టారు.

"మీ ఆలోచన బాగుంది. ఎలాగూ పక్షి బొమ్మ అనుకుంటున్నాము కాబట్టి ఆ తీసుకునేదేదో తెల్ల పావురాన్ని తీసుకుందాం. అది మన శాంతియుత ఆందోళనకు ప్రతీకగానూ ఉంటుంది" సుందరావు మాష్టారి ప్రతిపాదనను ఆమోదిస్తూనే చిన్ని సవరణ చేశారు కృష్ణారావు మాష్టారు.

"నాదొక సూచన.." అన్నాడు రమణమూర్తి అందరివంకా చూస్తూ.



'చెప్పండి!' అన్నట్టు చూశారు మిగతా నలుగురూ.

"నాగలి కూడా తీసుకోవాలి. నాగలి శ్రమకు, ఉత్పత్తికి చిహ్నం కాబట్టి మేము శ్రమను నమ్ముకొని బతికేవాళ్ళమే తప్ప, అభివృద్ధి పేరుతో పారిశ్రామిక కాలుష్యాన్ని తింటూ బతకలేమని ఆ నాగలి గుర్తుతో ప్రపంచానికి చాటిచెబుదాం" అంటూ మరో సూచన చేశాడు, మల్లీశ్వర్ రాజశేఖర్‌ల వంక ఏమంటారన్నట్టు చూస్తూ.

"అలక్కానివ్వండి" అన్నాడు రాజశేఖర్ కూడా ఆ చూపులకర్థం తెల్సుకొని.

"బావుంది. మన జెండాకో సంపూర్ణ తాత్వికత కూడా తోడయ్యింది" అంటూ తమ పూర్తి సమ్మతిని తెలియజేశారు మిగిలిన సభ్యులంతా.

ఈ రకంగా ఆ రోజున ఆ ఐదుగురు సామాన్యులు తీసుకున్న ఆ నిర్ణయమే ముందు ముందు బహుళజాతి కంపెనీల భరతం పట్టే ఓ అంతర్జాతీయ ఉద్యమ స్ఫూర్తిగా చరిత్రకెక్కుతుందని ఆ క్షణంలో వారికి కూడా తెలియదు మరి!

★ ★ ★

ముందుగా అనుకున్న ప్రణాళికకు అదనంగా కరపత్రాల్లోని సమాచారాన్ని ఓ స్టేజి ఆర్టిస్ట్‌తో చదివిస్తూ రికార్డ్ చేయించి సీడీలుగా, క్యాసెట్లుగా తీయించి ఓ టాటా మ్యాజిక్‌ను బాడుగకు తీసుకుని, దానిలో మైక్ సెట్‌ను ఏర్పాటు చేసి, దానికి నాలుగు మూలల కొత్తగా తయారు చేసిన జెండాలు కట్టి వారం రోజుల్లోగా ఒక ప్రచార రథాన్ని తయారు చేయించారు కృష్ణారావు మాష్టారువాళ్ళు.

మొట్టమొదట రథాన్ని తిక్కవరం ఆంజనేయస్వామి గుడి ముందు ఆపి క్యాసెట్ వేసేసరికి ఇండ్లలో వాళ్ళంతా వీధుల్లోకొచ్చి రథం లౌడ్‌స్పీకర్లో నుండి విన్పిస్తున్న కరపత్రం ప్రసంగ పాఠాన్ని వింటూ రథం దగ్గర పంచుతున్న కరపత్రాలను తీసుకుని ఆసక్తిగా చదువుకోసాగారు.

కరపత్రం చదువుకున్న గ్రామస్తులంతా గుడి ముందు గుమిగూడి 'ఓలమ్మోలమ్మా! మాయదారి గుంటలు ఎంత మోసానికి తలపడ్డారో సూడుమి' అనుకుంటూ ఎవరికి వాళ్ళు ముందుకొచ్చి-

"తాతారావుగాణ్ణి పులుసులోకి ముడుసు మిగలకుండా ఇరగదియ్యాల"

"చేపల చెరువులెడతా మస్జెప్పి మోసం జేసి బీల భూములన్నీ గొని తీరా చివరాఖరికొచ్చేసరికి కరెంట్ కంపెనీ కట్టేస్తామంటారా! ఎంత మోసం!"

"బీల లేని ఊరు, తల లేని మొండెంతో సమానం కాదేటి? "

"ముందా ఎం.పి. గంగాజల్రావును, మినిస్ట్రు నిశ్చింతరావుని నిలేసి పీకలట్టుకుంటే మొత్తం విషయాలన్నీ సర్దుకుంటాయి"

"దొంగలు, దొంగలు ఊళ్ళు పంచుకున్నట్లు ఆ ఇద్దరికిద్దరు తోడు దొంగలై వనగిరిని ఉట్టి బొంకుల్దిబ్బగా మార్చెయ్యాలని కంకణం కట్టుకున్నారేటోమరి. అందుకే ఇలగ సేస్తన్నారు కాబోలు? "

"ఆళ్ళకు ఓట్లేస్సి గెల్పించినందుకు మనకేటి సాయం చెయ్యకపోగా బీలను, బీలతోపాటు మనను నిండా ముంచేద్దరని కంకణం కట్టుకున్నారేటో? "

"మా తిక్కవరంలో ఆ పవర్‌ప్లాంట్‌కి వ్యతిరేకంగా పోట్లాడేటందుకు మీరే ఒక్క మిటీ వేసి ఎలబారి పోండి. ముందు ముందు మీరు ఏ పిలుపిచ్చినా ముందు కొచ్చి పని సెయ్యాలంటే మీరు మా అందరినీ కలిసే దానికంటే మా గ్రామ కమిటీకి సెబితేసాలు, మిగతా పన్లన్నీ మేమే చూసుకుంటాం" అంటూ కృష్ణారావు మాష్టారు కూడా ఊహించనంత విలువైన సూచనలు, సలహాలు ఇవ్వసాగారు.

ఆ సామాన్యుల అసామాన్య చైతన్యానికి, నివురుగప్పిన నిప్పులా ఉన్న ఆ స్పందనకు ఒక్కసారిగా విస్తుబోయిన కృష్ణారావు మాష్టారు బృందానికి ఆనందంతో పాటు ఆశ్చర్యం, ఆశ్చర్యంతో పాటు ఉద్వేగం, ఉద్వేగంతో పాటు కళ్ళ వెంట నీటి ఊటలు స్రవించాయి. జనం గుండెల్లో కుత కుత ఉడుకుతున్న లావా బయటకు ఎగ చిమ్మి ధర్మాగ్రహాన్ని ప్రకటించేందుకు చేసే ప్రయత్నంలో మనం సమిధలుగా మండిపోయినా ఫరవాలేదు అన్న నిర్ణయానికొచ్చారు.

అలాంటి ప్రతిస్పందన ఆ ఒక్క తిక్కవరం గ్రామంలోనే కాదు. విలాసపురం, బురదపాలెం, కృష్ణయ్యపాలెం సిరిబుద్ధ లాంటి బీల గ్రామాలన్నింటిలోనూ కృష్ణారావు మాష్టారి బృందానికి ఎదురయ్యింది. అన్ని గ్రామాల ప్రజల్లోనూ ఒకే విధమైన ప్రతిస్పందన, ఒకే విధమైన అలజడీ, ఆందోళన. 'అధికారానికి, అణచివేతకు వ్యతిరేకంగా తిరుగుబాటు ఉద్యమాల వారసత్వపు ఊట తమలో ఇంకా మిగిలే ఉంది' అంటూ ఊరు ఊరునా మరోసారి

పోరు నగారా మోగించారు బీల గ్రామాల జనం.




**ఒ**కరోజు-

ఉదయం ఎనిమిది గంటలకల్లా జీవ భద్ర రచ్చబండ దగ్గరికి రయ్యిమంటూ రెండు ఏసీ బస్సులొచ్చి ఆగాయి.

"ఈ బస్సులేటబ్బా? " ఆశ్చర్యంగా అనుకుంటూ ఊరిజనం మొత్తం గబ గబా రచ్చబండ దగ్గరికి కదలివచ్చారు. జనం అలా చూస్తుండగానే ఓ బస్సులో నుండి తెల్లటి ఎప్రాన్లు తొడుక్కుని, చేతుల్లో స్టెతస్కోప్‌లు పట్టుకుని కొంతమంది డాక్టర్లు, మరో బస్సులో తల మీద తెల్లటి నర్సింగ్ క్యాప్‌లతో, వంటి మీద తెల్లటి గౌన్లతో కొంత మంది నర్సులూ, మందులు అవీ పెట్టుకొని కన్నదాసు, బొర్రయ్యలతో పాటు తాతారావూ దిగాడు.

తాతారావును చూసిన గ్రామస్తులు కోపంతో రగిలిపోతూ "అసలు నువ్ మమ్ముల్ని ఏటనుకుంతున్నావ్? ఇంత మోసం జేసి గూడా మళ్ళీ మా ముందుకొచ్చీసినావంటే నీకెంత ధైర్యమున్నాదనుకోవాల? " అంటూ ఒక్కపెట్టున అతణ్ణి చుట్టుముట్టారు.

గ్రామస్తుల మాటలు వింటూనే అన్యాయంగా అపవాదుకు గురైన అమాయకుడి మాదిరి గ్రామస్తుల వైపు చూస్తూ "నేనేం మోసం చేసాను!? మీ భూములకు రెట్టింపు ధర ఇస్తామని ఇవ్వలేదా? కాదూ మీ ఊళ్ళో ఎవరి దగ్గరైనా అప్పులు తీసుకుని ఎగ్గొట్టి పోయానా? ఏంటి నేను చేసిన మోసం? ఈ చుట్టుపక్కల గ్రామాల్లో నేనెక్కడన్నా మోసం చేసి భూములు తీసుకున్నానని గానీ, ఎవర్కైనా డబ్బులు ఇవ్వలేదని గానీ ఎవరన్నా రుజువు చేస్తే మీ కాళ్ళసందు గుండా దూరిపోతాను" అంటూ ఎదురు తిరిగి గట్టిగా మాట్లాడాడు తాతారావు.

అతనంత గట్టిగా మాట్లాడేసరికి గ్రామస్తుల ఆవేశపు పొంగు మీద "నిజమే గదేటి!" అన్న ఒక సంశయంపు చన్నీళ్ళు చల్లినట్టు చప్పున చల్లబడిపోతూ "అది కాదు తాతారావు బావూ! మీరు మా దగ్గర భూములు కొనేటప్పుడు చేపల చెరువుల కోసమని చెప్పినారు కదా? మరిప్పుడిదేటి బీలలోన ఏదో కరెంట్ కంపెనీ కట్టబోతున్నారంటగదా? " గొంతుల్లో తీవ్రత తగ్గిపోతూవుంటే తెచ్చి పెట్టుకున్న గాంభీర్యంతో మాట్లాడారు గ్రామస్తులు.

"ఔన్నిజమే. చేపల చెరువులు పెట్టిద్దామనే భూములు కొన్నాం. పెద్దఎత్తున చేపల వ్యాపారం చేద్దామనే ఆ మధ్యన కొంత పని మొదలు పెట్టామా? లేదా? మీరే చెప్పండి" అంటూ మరింత లౌక్యంగా మాట్లాడాడు తాతారావు.

"మరిప్పుడీ పవర్‌ప్లాంటేటి? " అడిగారెవరో జనంలో నుండి తాతారావును.

"ఔనది కూడా నిజమే, మార్కెట్ ధర కంటే రెట్టింపు ధర పెడితే మీరు నాకు భూములమ్మినట్టు నేను కొన్న ధర కంటే ఎవరైనా అంతో ఇంతో ఎక్కువిస్తానంటే నేను మాత్రం అమ్ముకోనా? ఇప్పుడు అదే జరిగింది. కుచేలా కంపెనీ వాళ్ళు నేను కొన్న దానికంటే ఎక్కువిస్తానంటే అమ్ముకున్నాను. అందులో తప్పేముంది? కొను

క్కున్న కంపెనీవాడు అందులో చేపల చెరువులు పెట్టుకుంటే నాకేంటి? పవర్‌ప్లాంట్ కట్టుకుంటే నాకేంటి? ” గ్రామస్తుల మాటల్లో వాదన పదును తగ్గి పోతుంటే తన మాటల్లో పదును పెంచుతూ మాట్లాడాడు తాతారావు.

“బీల భూముల్లోన పవర్‌ప్లాంట్ కట్టుకొమ్మంటు గవర్నమెంట్ కుచేలా కంపెనీ వాడికి ఏ లెక్కన కట్టబెడుతుంది? ” ముందు ముందు రాజకీయాల్లో చురుగ్గా ఎదిగిపోవాలని కలలు గంటున్న వార్డు మెంబర్ దుర్యోధన గట్టిగా అడిగాడు.

“ఏ లెక్కేంటండీ! మీ ఊరి తహసీల్దార్, మీ జిల్లా కలెక్టర్‌తో పాటు మీ నాయకులు కూడా ఆ బీల ఎందుకూ పనికిరాని వట్టి బంజరు భూమి, అలా ఎందుకు పనికిరాకుండా పడుండే దానికన్నా ఆ భూమిలో పవర్‌ప్లాంట్ కడితే వెనుకబడిన ప్రాంతం అభివృద్ధి చెందుతుంది. ప్రజల బతుకులు బాగుపడతాయని ప్రభుత్వానికి రాశారు, తెలుసా? ” అంటూ తన మాటల గారడితో గ్రామస్తులను పూర్తిగా ఆలోచనల్లో పడేశాడు మరోసారి తాతారావు.

గ్రామస్తులు ఆలోచనల్లో పడిపోవడం గమనించిన కొత్త వ్యక్తుల్లో ఒకడు ముందుకొచ్చి “నా పేరు శ్యాంప్రసాద్, కుచేలా కంపెనీ జనరల్ మేనేజర్‌ని. ప్రభుత్వం వారు మీరంటున్న బీల భూముల్లో మేం కొన్నది గాక దాదాపు ఇంకో వెయ్యి ఎకరాల భూమిని, మీ వెనుకబడిన ప్రాంతాన్ని అభివృద్ధి చెయ్యండంటూ పవర్‌ప్లాంట్ కోసం మాకిచ్చింది. ముందు ముందు ఈ బీల చుట్టూ ఉన్న గ్రామాలన్నింటినీ కంపెనీ దత్తత తీసుకుని ఇండ్లు, రోడ్లు, బళ్ళు, కరెంట్, వైద్యం, చెట్ల పెంపకం, తాగునీరులాంటి ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలు ఉచితంగానే చేపట్టి గ్రామస్తులకు సేవ చేస్తుంది” అంటూ అక్కడ గుమిగూడిన ప్రజలకు అరచేతిలో వైకుంఠం చూపించసాగాడు.

“ఆవు గంగడోలు ఎద్దెందుకు నాకుద్దో ఆ మాత్రం మాకు తెల్దేటి? అసలా కంపెనీ ఇంకా వచ్చిందే లేదు గానీ అప్పుడే మీరు ఇంతమంది డాక్టర్లను, నర్సులను ఎంటెట్టుకుని, ఇన్నిన్ని మందులు తీసుకొచ్చి ఉత్తిపున్నానికి ఇస్తున్నారంటే మేమేటనుకోవాల? ముందు ముందు మీరేటి సేసినా మేం నోరిప్పకుండా వేస్తున్న ముందరి కాళ్ళ బంధం అనుకోవాల. ముందు ముందు ఆ కంపెనీతోటి మాకు ఎంతెంత ప్రమాదముండకపోతే ఇప్పన్నించే ఇంత ఖర్చు ఎందుకు చేస్తారు? ” కృష్ణారావు మాస్టారువాళ్ళు ఏర్పాటు చేసిన జీవభద్ర గ్రామ కమిటీ సభ్యుల్లో ఒకడైన గరగ సత్యం, కంపెనీ జి.ఎం.కు ముచ్చెమటలు పట్టేలా నిర్భయంగా దడదడమంటూ మాట్లాడాడు.

సత్యం మాటలకు ఒకింత బిత్తరపోయిన కంపెనీ జి.ఎం. “మీరెవ్వరూ అటువంటి అనుమానాలు పెట్టుకోవాల్సిన అవసరమే లేదు. మీకు నిజంగా ఏమైనా సందేహాలుంటే మా కంపెనీ చరిత్రేంటో? మా కంపెనీ పేరు ప్రతిష్టలేంటో? మేము ఎన్నెన్ని చోట్ల ఇలాంటి సామాజిక సేవా కార్యక్రమాలు చేపట్టామో మన ఎం.పి.

## కొత్తగాలి...



**భావిపౌరుల తయారీ**
**కర్మాగారం పాఠశాల**
**ఒత్తిళ్లతో కావద్దది**
**పిల్లల పాలిట కారాగారం**

– టి.వి.ఆర్. నర్సయ్య,
మహబూబాబాద్, వరంగల్ జిల్లా

గంగాజల్రావుగారినీ, మంత్రి నిశ్చింతరావు గారినీ కనుక్కోండి. మీరనుకుంటున్నట్లు మేము నిజంగా మోసగాళ్ళమైతే వాళ్ళూరు కుంటారా? వాళ్ళూ మీలాగే ఇక్కడ పుట్టి పెరిగినవాళ్ళే కదా? మీరంతా అనుకుంటు న్నట్టు నిజంగానే మా ప్లాంట్ వల్ల ఏదన్నా ప్రమాదం జరిగితే అది వాళ్ళకూ జరుగుతుంది కదా? మీకు తెలిసినంత మాత్రం వాళ్ళకు తెలియదా? " అంటూ ఇంకా ఏదో మాట్లాడబోతుండగానే నాలు గైదు మోటారు సైకిళ్ల మీద కృష్ణారావు మాష్టారువాళ్ళు నేరుగా రచ్చబండ దగ్గర కొచ్చి ఆగారు.

వాళ్ళను చూడగానే గ్రామస్తుల కళ్ళల్లో ఓ విధమైన సంతృప్తి బహిర్గతమవుతుంటే ఎవరికి వాళ్ళు 'ఇప్పుడేటి జరగబోతోందో సూడాలి?' అనుకుంటూ నిశ్శబ్దమైపో యారు. అప్పటిదాకా కంపెనీవాళ్ళకు, తమకూ మధ్య జరిగిన సంభాషణను పొల్లుపోకుండా మాష్టారువాళ్ళకు వివరిం చారు గ్రామస్తులు.

చెప్పినదంతా విన్న కృష్ణారావు మాష్టారు ఆఖరికి నోరు విప్పుతూ "తాతా రావు చెప్పిందాంట్లో ఒక్కటి మాత్రం నిజం" అన్నారు వచ్చిన డాక్టర్లను, నర్సు లను మనస్సులోనే లెక్కించుకుంటూ.

"ఏటది? " అన్నట్లు చూశారు అక్కడి గ్రామస్తులు.

"కలెక్టర్, తహశీల్దార్ వాళ్ళు ఎంతో విలువైన మన బీల భూములను ఎందుకూ పనికిరాని పోరంబోకు, బంజరు భూములుగా చూపెట్టింది మాత్రం య థార్థం. వాళ్ళెందుకట్లా చూపించారు? వాళ్ళతో ఎవరు అలా చూపించమన్నారు? అలా చూపించినందువల్ల ఎవరికి లాభం? ఆ విషయాలు మనం బయటకు లాగితే మిగతా భూములన్నీ వాటంతటవే బైటికొస్తాయి"

"ఇంకేవలేటి? ఉన్నారుగా మన నాయ కులు" అంటూ ఒకేసారి చాలామంది అరి చారు. అదే సమయంలో కొంతమంది యువకులు "గోబ్యాక్ గోబ్యాక్" "కుచేలా కంపెనీ జి.ఎం. గోబ్యాక్" అంటూ ఎవరూ ఊహించని విధంగా నినాదాలు అందుకుని జి.ఎం.ను, తాతారావును చుట్టుముట్టారు.

"ఆగండాగండీ! ఇప్పుడు వాళ్ళనేమీ అన కండీ! పాపం! ఈ తాతారావుది, ఆ జి. ఎం. లదేముంది? జీతంరాళ్ళ కోసం పని చేసే ఉద్యోగులు. మనం అనాల్సింది ఈ గడ్డ మీద పుట్టి, ఈ గడ్డ మీద పెరిగి, ఇక్కడి ప్రజల ఓట్లతో నాయకులైన మన

## రోజూ గొప్పగా రాయడమా?

గోరాశాస్త్రిగారు గొప్ప సంపాదకీయాలు రాయటంలో దిట్ట. అయినా ఆయనకు అహంభావం ఉండేది కాదు. తాను లేకపోతే ఆంధ్ర జర్నలిజం లేదనిగానీ, తానొక గొప్ప సంపాదకుడిననిగానీ ఆయన భావించేవారు కాదు. పైగా స్వోత్కర్ష ఎన్నడూ చేసుకునే వాడు కాదు. ఒకసారి ఒక అభిమాని ఆయ నను కాస్త రెచ్చగొట్టే స్వరంతో 'మీ సంపాద కీయం ఈ రోజు ఏమాత్రం బాగా లేదు. పైగా పరమ అసహ్యంగా ఉంది' అన్నాడు.



దానికాయన 'రోజూ రాసే సంపాదకీయాల్లో ప్రతి పదమూ రమ్యంగా రాయా లంటే సాధ్యమా? ఏవో నెలకు నాలుగైదు సంపాదకీయాల్ని బాగా రాయగల మంతే. రోజూ అట్టుపోసే ముసలమ్మకు సైతం కొన్ని చిదేస్తయి కదా?' అని జవాబి చ్చాడు. దాంతో ఆయన చమత్కారానికి ఆ విమర్శకుడు నవ్వుకుంటూ వెళ్లిపోయాడు.

మంత్రిని, మన ఎంపీని అనాలిగాని.

పచ్చిస్వార్థంతో పుచ్చిపోయిన మన నాయకులు కుచేలా కంపెనీతో కుమ్మక్కై కట్టబోయే థర్మల్ పవర్ ప్లాంట్‌లో బినామీలుగా చేరి, మనకు నష్టం చెయ్యడానికి కూడా సిద్ధపడ్డందుకు ఏమన్నా వాళ్ళననాలి. వాళ్ళ ఒత్తిడి మేరకే ఈ జిల్లా అధికారులంతా బీలను గురించి గవర్నమెంట్‌కి తప్పుడు నివేదికలు పంపించి ఉంటారు. దాంతో గవర్నమెంట్ కూడా గుడ్డిగా ఆ నివేదికల మీదనే ఆధారపడి అనుమతులిచ్చింది.

కాబట్టి మనం తేల్చుకోవాల్సింది వాళ్ళతో తప్ప వీళ్ళతో కాదు. ఎలాగూ ఊళ్ళోకి డాక్టర్లు, మందులూ వచ్చాయి కాబట్టి ఈ రోజుకిక్కడ వాళ్ళు జరపాలనుకున్న మెడికల్ క్యాంప్ జరగనివ్వండి. చూపించుకోవాలనుకున్న వాళ్ళను చూపించుకోనివ్వండి" అంటూ గ్రామస్తులను సముదాయించాడు కృష్ణారావు మాష్టారు.

కృష్ణారావు మాష్టారి మాటల మీది గౌరవంతో ఎక్కడి వాళ్ళక్కడ నిశ్శబ్దం అయిపోయిన తరువాత తాతారావు, జి.ఎం.ల వంక చూస్తూ, "ఈ రోజుకు ఇలాక్కానివ్వండి. కానీ రేపటి నుండి ఈ చుట్టుపక్కల బీల గ్రామాల్లో మీరు ఎక్కడ కనిపించినా దారుణమైన పరిస్థితులు ఎదుర్కోవాల్సి ఉంటుంది జాగ్రత్త!" అంటూ గట్టిగా హెచ్చరించాడు మల్లీశ్వర్.

ఆ దెబ్బతో... వచ్చిన డాక్టర్లు, నర్సులు, కాంపౌండర్లు అంతా "బతుకు జీవుడా!" అనుకుంటూ నిశ్శబ్దంగా తలలు ఊపారు.

ఆ తరువాత ఊరి జనంవైపు చూస్తూ "రేపు ఉదయం పది గంటలకల్లా మీ ఊరి వాళ్ళంతా మంత్రిగారింటికి వచ్చేయండీ! అన్ని గ్రామాలవాళ్ళూ వచ్చేస్తున్నారు. అందరం కలిసి బీల విషయమేంటో అతనితో అక్కడే తేల్చుకుందాం" అంటూ రేపటి కార్యక్రమాన్ని వివరించాడు రాజశేఖర్.




**మ**రునాడు ఉదయం...

"జీవభద్ర గ్రామంలో కుచేలా కంపెనీ వాళ్ళ మెగా మెడికల్ క్యాంప్ సూపర్ హిట్!"

"కంపెనీ అధికారులకు ప్రజల ఘన స్వాగతం!"

"నాయకుల మాటలు పట్టించుకోని గ్రామస్తులు" అంటూ కొన్ని పత్రికలలో వార్తలు వచ్చాయి. గ్రామస్తుల నిరసననూ, అధికారులకు ఇచ్చిన హెచ్చరికలనూ అసలు వాటిలో ప్రస్తావించనేలేదు.

ప్రజలంతా తన ఇంటికి రాబోతున్నట్టు ముందుగానే సమాచారం అందుకున్న మంత్రి నిశ్చింతరావు అందుకు తగ్గట్టుగా తయారై జనాన్ని చూస్తూనే ముఖానికి నవ్వులు పులుముకుంటూ "రండి మాష్టారు! రండీ! రండీ! మీ అమెరికా ప్రయాణం బాగా సాగిందా? అక్కడ మీ అమ్మాయి, అల్లుడూ వాళ్ళంతా కులాసాయేనా?" అంటూ కుశల ప్రశ్నలతో సాదరంగా కృష్ణారావు మాష్టారుతో పాటు మిగతా వాళ్ళనూ ఆహ్వానించాడు.

కాస్సేపు మాటామంతీ అయ్యాం తరువాత కృష్ణారావు మాష్టారు అసలు విషయంలోకొస్తూ "ఇప్పటికే కోస్టల్ కారి

డార్ పేర సముద్రతీర ప్రాంతాన్నంతా ఏదో విధంగా ప్రైవేట్ పెట్టుబడిదారులకు కట్టబెడుతున్న ప్రభుత్వం మన జిల్లాలో ఏకంగా ఏడెనిమిది మెగా పవర్ ప్రాజెక్టులను తలపెట్టింది. అనుకున్న ప్రకారం ఆ ప్రాజెక్టలన్నీ కట్టడం పూర్తయి, ఉత్పత్తి మొదలుపెడితే జిల్లా మొత్తం బూడిద దిబ్బగా మారిపోతుంది" అన్నారు వినయంగా.

"ఇప్పటికే మన జిల్లా నుండి రాష్ట్రంలోని అన్ని పట్టణాలకూ వేలాదిమంది ప్రజలు వలసలు పోతున్నారు. ఇంకొన్నేళ్ళు పోతే ఆ పవర్ ప్లాంట్‌లు తప్ప మనిషనే వాడు మచ్చుక్కూడా జిల్లాలో కనిపించే పరిస్థితి ఉండదు. నిజంగా ఆ పరిస్థితి ఊహించుకుంటేనే భయమేస్తుంది" అన్నారు మరొకరు.

"మీలాంటి ప్రజానాయకులన్నా ఈ దారుణానికి వ్యతిరేకంగా ముందు వరుసన నిలబడి పోరాడాల్సిందిపోయి, మీరే ఆ కర్మాగారాల్లో భాగస్వాములుగా చేరి పవర్‌ప్లాంట్ నిర్మించ బూనుకోవడం చాలా విచారకరం" అంటూ కృష్ణారావు మాష్టారుతో పాటు మరికొందరు ముఖ్యమైన గ్రామస్తులు కూడా వాళ్ల వాళ్ల అభిప్రాయాలను మంత్రి ముందు ఉంచారు.

వాళ్ల మాటలన్నీ జాగ్రత్తగా విన్న మంత్రి నిశ్చింతరావు తన పక్కనే కుర్చీలో ఠీవిగా కూర్చొని ఉన్న డాబర్‌మాన్ తల మీద, పులి తలమీద దువ్వినట్టు సున్నితంగా దువ్వుతూ "లేదు, లేదు. మీరంతా కచ్చితంగా పొరబడుతున్నారు. నేను, మన ఎంపీగారు కూడా ఆలోచిస్తోంది మన జిల్లా అభివృద్ధి, జిల్లా వాసుల సంక్షేమం మాత్రమే. ఈ పవర్‌ప్లాంట్ కట్టాలనుకుంటుంది మీరనుకుంటున్నట్టు మా లాభం కోసమో, మా ఆస్తులు పెంచుకోవడం కోసమో కాదు, కేవలం మన జిల్లా వాసుల అభివృద్ధి కోసమే.

కొంత బీల భూమి నష్టపోయినా, కొంత మంది జనం తాత్కాలికంగా నిరాశ్రయులై ఇబ్బందులకు గురైనా ముందు ముందు మాకు కొన్ని ఓట్లు పడకపోయినా, ఆఖరికి మేం ఓడిపోయినా బాధపడేది లేదు. కానీ మేం అనుకున్నట్టు మాత్రం ఆ పవర్ ప్లాంట్ కట్టి తీరాల్సిందే. అది కడితేనే మన జిల్లాకు అంతర్జాతీయ గుర్తింపు వస్తుంది. మా నిజాయితీని శంకించిన వాళ్లే రేపు కళ్లు మిరుమిట్లు గొలిపే అభివృద్ధిని చూసి ఆశ్చర్యంతో నోళ్లు వెళ్లబెడతారు. అందుకోసమే మా రాజకీయ స్పర్థలను కూడా పక్కనబెట్టి రాజీపడి, మన

> **కొత్తగాలి...**
>
> **పాఠం- పరీక్ష**
> **గురువు**
> **పరీక్ష- పాఠం**
> **జీవితం**
>
> – కర్లపాలెం హనుమంతరావు,
> హైదరాబాద్

జిల్లా వాసులకు ఈ పని చేసిపెడుతున్నాం. అందుకు మేము నిజంగా గర్విస్తున్నాం" అంటూ డాబర్‌మేన్ వీపు మీద మరింత మృదువుగా దువ్వసాగాడు మంత్రి నిశ్చింతరావు.

'చెవిటివాని ముందు శంఖం ఊదినట్టు మంత్రితో ఎంతసేపు మాట్లాడినా ప్రయోజనం లేదు' అన్న విషయాన్ని ఆపాటికే అర్థం చేసుకున్న కృష్ణారావు మాష్టారు వాళ్లు "ఇంక మేం వెళతాం" అంటూ లేచారు.

"కాదు, కాదు మీరిలా కూర్చోండి... చివరిగా నేనో మాట చెప్పాలనుకుంటున్నా"

డాబర్‌మేన్ కళ్లల్లోకి కళ్లుపెట్టి చూస్తూ అన్నాడు మంత్రి నిశ్చింతరావు, వెళ్లబోతున్న కృష్ణారావు మాష్టారువాళ్లతో.

"చెప్పండి ఫర్లేదు" నిల్చునే అన్నారు కృష్ణారావు మాష్టారువాళ్లు.

"మనకన్నా ముందుగానే చిరవాడలో పెద్ద పవర్‌ప్లాంట్ కట్టి ఉత్పత్తి కూడా తీస్తున్నారు. నేనో నాలుగు ఎ.సి. బస్సులు, తిండి తిప్పలు, వసతి వగైరా అన్ని ఏర్పాటు చేస్తాను. మీరంతా అక్కడికి వెళ్లి ఆ ప్రాంత రైతులను కలిసి ప్లాంట్ పెట్టడం వల్ల వాళ్లకొస్తున్న సాధక బాధకాలేంటో తెలుసుకొని రండి. దాన్ని బట్టి మన బీలలో పవర్‌ప్లాంట్ కట్టాలో, వద్దో, ఒకవేళ కడితే వచ్చే లాభనష్టాలేంటో ఆలోచిద్దాం" అంటూ ఓ సరికొత్త ప్రతిపాదనా పాచికను విసిరాడు మంత్రి.

ఆ ప్రతిపాదనను విన్న తరువాత కొంత సేపు తమలో తామే చర్చించుకున్న కృష్ణారావు మాష్టారువాళ్లు 'చూసొద్దాం, ఇదీ ఒకందుకు మంచిదే. మంత్రి ఒకందుకు మనను చిరవాడ పంపిద్దామని ఆలోచిస్తున్నాడు. మనం దాన్నే ఇంకో రకంగా ఉపయోగించుకుందాం' అనుకుంటూ ఓ నిర్ణయానికి వచ్చి "సరే అలాక్కానివ్వండీ!" అంటూ చిరవాడ సందర్శనకు అంగీకరిస్తూ లేచివెళ్లారు.

మంత్రి నిశ్చింతరావు దగ్గర నుండి బయటకొచ్చిన కృష్ణారావు మాష్టారువాళ్లు స్వామిపేట ఊరి చివర పైడితల్లి గుడి ముందర కూర్చొని మరికొంతసేపు చిరవాడ సందర్శన విషయం మీద లోతుగా చర్చించుకొని, వెళ్లి రావడమే సరైన నిర్ణయంగా భావించుకున్నారు.

వచ్చే గాంధీ జయంతిని దృష్టిలో ఉంచుకొని మరో ముఖ్యమైన నిర్ణయం కూడా తీసుకుని ఆ తరువాతనే ఎవరి ఊళ్లకు వాళ్లు బయలుదేరి వెళ్లారు.

★ ★ ★

ఆ రోజు గాంధీ జయంతి.

కృష్ణారావు మాష్టారు వాళ్లు జీవభద్ర రచ్చబండ ఎదురుగా ఉన్న గాంధీ విగ్రహానికి మాలవేసి, ఆయన విగ్రహం సాక్షిగా పవర్‌ప్లాంట్‌కి వ్యతిరేకంగా స్వాతంత్ర్య సమరయోధుడు సౌజన్యరావుతో రిలే నిరాహారదీక్షా శిబిరాన్ని ప్రారంభించారు.

మొదటిరోజు దీక్షలో మల్లీశ్వర్, రాజశేఖర్‌లతో పాటు ఎండమ్మ, ఢిల్లెమ్మలు కూడా కూర్చున్నారు.

ఆ రోజు ఆ విధంగా మొదలుపెట్టిన నిరాహారదీక్షా శిబిరాన్ని బీల గ్రామాల ప్రజల సహకారంతో కేవలం మహిళల నేతృత్వంలోనే పవర్‌ప్లాంట్ విషయం ఏదో ఒకటి తేలేంత వరకూ నడపాలనే నిర్ణయం తీసుకున్నారు కమిటీవాళ్లు.

గాంధీ జయంతి వెళ్లిన నాలుగు రోజుల తరువాత ఓ రోజు ఉదయం ఏడు గంటలకు ఆ రోజు దీక్షలో కూర్చోబోయే వాళ్లను కూర్చోబెడుతున్న సమయంలో నాలుగు ఏసీ కోచ్‌లు శిబిరం దగ్గరకొచ్చి ఆగాయి.

'ఈ బస్సులేంటబ్బా!' అనుకుంటూ శిబిరం దగ్గరున్న వాళ్లంతా నిలబడి చూడసాగారు.

ఆ బస్సుల్లో ఒకదాంట్లో నుండి దిగివ

## కొత్తగాలి... 

**తోకచుక్క**
**రాలింది!**
**దేని ధర దాన్ని ఢీకొట్టిందో!**

– ప్రతాప వెంకట సుబ్బారాయుడు,
సికింద్రాబాద్

చ్చిన మంత్రిగారి మనిషి ఒకడు "చిరవాడ వెళ్లి రావడం కోసం మంత్రిగారు పంపించారు" అన్నాడు శిబిరం ముందుకొచ్చి జనాంతికంగా.

అప్పుడర్థమైంది వాళ్లందరకూ బస్సులెందుకొచ్చాయో.

అర్థమైన వెంటనే కృష్ణారావు మాష్టారు మల్లీశ్వర్, రాజశేఖర్ల వంక చూశాడు.

మాష్టారి చూపును అర్థం చేసుకున్న వాళ్లు వెంటనే "బస్సులు, చిరవాడ పవర్ స్టేషన్ దాని చుట్టు పక్కల గ్రామాలు తిరిగి చూసి, వాళ్ల అనుభవాలు తెలుసుకోవడం కోసం మంత్రిగారు పంపించారు. చూసి రావాలనుకున్న వాళ్లంతా అర్ధ గంటలో తయారై వస్తే బస్సులెక్కి వెళ్ల వచ్చు" అంటూ శిబిరంలోని మైక్ నుండి గ్రామస్తులకు విషయం వివరించారు.

అన్నట్టుగానే అరగంటలో ఓ సగం బస్సు నిండా వచ్చి కూర్చున్నారు గ్రామస్తులు. ఆ గ్రామస్తులను ఎక్కించుకున్న బస్సులు మెల్లగా కదిలి మరో బీల గ్రామం వైపుగా సాగాయి.

చిరవాడ పవర్‌ప్లాంట్‌ని, దాని నుండి వస్తున్న బూడిద మేఘాలనూ ఆశ్చర్యంగా చూసిన బీల గ్రామాల రైతులు ఆ తరువాత ఆ ప్లాంట్ చుట్టూ పది కిలోమీటర్ల పరిధిలోని గ్రామాలకు వెళ్లి అక్కడవున్న తోటిరైతులను కలిసి తామెందుకొచ్చింది, ఎవరు పంపించిందీ, పంపించిన వారి ఉద్దేశాన్ని కూలంకషంగా వివరించి, "ఈడ మీ పరిస్థితేటి మరి? " అంటూ ప్రశ్నించారు.

అక్కడ ఏ రైతును కదిలించినా "అన్నా! వద్దన్నా.. ఈ పవర్‌ప్లాంట్‌లొద్దూ పాడొద్దు. ప్లాంట్ పెట్టేటప్పుడున్న మాటలు పెట్టిం తరువాతుండవు. ప్లాంట్‌లోన భూమి పోయిన కుటుంబాలకు ఇంటికొకొ ఉద్యోగమిస్తామని ఆశపెట్టారు. ఇప్పుడు ఉద్యోగం కాదు కదా! కనీసం కంపెనీలో రోజు కూలీలుగా కూడా తీసుకోవడం లేదు. పైనుండి భూములకు ఇవ్వాల్సిన నష్టపరిహారం కూడా ఇంకా చాలామందికి ఇవ్వనే లేదు"

"ఈ కంపెనీ మొత్తమంతా కొత్త టెక్నాలజీతో కట్టినారంట. ఇట్టాంటి కంపెనీల్లో మన్లాంటి మామూలు మనుషులకు ఉద్యోగాలు రాడానికి అవకాశమే లేదట. ఐనా! కంపెనీ వాళ్లు మాత్రం మా కన్నీళ్లు తుడ్డానికన్నట్టు అదిగో ఉద్యోగమిస్తాం, ఇదుగో ఉద్యోగమిస్తాం అంటూ మభ్యపెడుతూ వాళ్ల చుట్టూ తిప్పుకుంటున్నారు"

"ప్లాంట్ కిందపోయిన భూములు పోగా మిగిలిన భూముల్లో, ఈ కంపెనీకి చుట్టుపక్కల పాతిక కిలోమీటర్ల మేర ఉన్న గ్రామాల్లో ఎక్కడ చూసినా బూడిద రాసులురాసులుగా పేరుకుపోతోంది. బావులు, చెరువులు పూడి పోతున్నాయి. నీళ్లన్నీ పాడైపోతున్నాయి. ఊళ్లల్లో ఎక్కడ చూసినా ఈ బూడిద వల్ల పశువులకూ, మనుషులకూ రకరకాల రోగాలొస్తున్నాయి. పంటల్లేవ్వా, పాడీలేదు. పవర్ ప్లాంట్ కింద మా బతుకులన్నీ ఎండమావుల్లోన నీళ్లు తాగినట్టుగా తయారయ్యాయి" అంటూ చిరవాడ పవర్ ప్లాంట్‌తో తాము పడుతున్న ఇబ్బందులను ఏ అధికారులతోనూ, రాజకీయ నాయకులతోనూ చెప్పుకోలేనంత ఇదిగా తోటి రైతులముందు తమ హృదయాలను గుమ్మరించి, ఏ అరమరికలు లేకుండా తమ గుండె లోతుల్లో జరుగుతున్న అంతర్మథనాన్ని, అసంతృప్తినీ, అసహాయతను వెళ్లబోసుకున్నారు.

వెళ్లబోసుకోవడమే కాదు, "ఎట్టి పరిస్థితుల్లోనూ బీలలో పవర్‌ప్లాంట్‌ను కట్టనివ్వద్దు. కంపెనీవాళ్ల మాటలు నమ్మి, వాళ్లు చూపించిన ఆశల వలతాళ్ళకు చిక్కి కంపెనీని గనుక ఒకవేళ కట్టనిచ్చినట్ట

యితే, ఆ తరువాత ఆ బూడిదతో, ఆ వాతావరణ కాలుష్యంతో చచ్చిపోతారు. దానికన్నా కంపెనీ కట్టేదానికి వ్యతిరేకంగా పోరాటం చేస్తూ చచ్చిపోయినా మంచిదే" అన్న అభిప్రాయాన్ని బీల గ్రామాల రైతుల గుండెల్లో బలంగా నాటుకునేలా విడమరిచి చెప్పారు చిరవాడ రైతన్నలు.

అట్లా చిరవాడ రైతుల అనుభవాలను, ఆక్రోశాలను ప్రత్యక్షంగా పరికించి చూసిన బీల గ్రామాల రైతులు 'ఎట్టి పరిస్థితుల్లోనూ, బీలలో పవర్ ప్లాంట్ కట్టనివ్వరాదు' అన్న ప్రతిజ్ఞ తీసుకుని మరీ వెనుదిరిగారు.

ఇది మంత్రి నిశ్చింతరావు, ఎం.పి. గంగాజల్రావులకు ఏమాత్రం ఊహించని ఎదురుదెబ్బ.

ఇది కృష్ణారావు మాస్టారువాళ్లకూ ఊహించని సంఘటనే అయ్యింది. జరిగిన సంఘటన ఒకటే ఐనా దాని పరిణామాలు ఉద్యమకారులకు నైతిక బలాన్నిస్తే మంత్రి, ఎం.పి.లను భయంతో ఉలిక్కిపడేలా చేసింది.

రైతులిచ్చిన నైతిక స్థైర్యంతో కృష్ణారావు మాస్టారువాళ్లు తమ పోరాటంలో మరో కొత్త అధ్యాయానికి నాంది ప్రస్తావన చేశారు. దాని ప్రకారం బీల గ్రామాలన్నింటిలోనూ ఏర్పాటై ఉన్న గ్రామ కమిటీలు ఊరూరా ఇంటి కింతని చందాలు పోగు చేసి ఆ డబ్బులతో రంగులు, బ్రష్‌లు కొనుక్కొచ్చి ప్రతి ఇంటి గోడమీద 'కుచేలా కంపెనీ వాడా! బీల జోలికి రావద్దు- ప్రజల తిరస్కారాన్ని చూడొద్దు'

'పవర్‌ప్లాంట్ నిర్మాణంలో వచ్చే ఉద్యోగాలెన్ని? పోయే భూములెన్ని?'

'మమ్ములను నమ్మించి మోసం చేస్తే- చూస్తూ ఊరుకోము'

'గోబ్యాక్, గోబ్యాక్- కుచేలా కంపెనీ గోబ్యాక్' అంటూ నినాదాలు రాయించాయి.

ఒకరోజు సాయంత్రం.

జీవభద్ర దీక్షా శిబిరంలో ఆ రోజు దీక్షలో కూర్చున్నవాళ్లకు నిమ్మరసం ఇచ్చి దీక్ష విరమింపజేస్తూ శిబిరాన్ని ఉద్దేశించి మల్లీశ్వర్ మాట్లాడుతున్న సమయంలో రెండు జీపులనిండా గూండాలను ఎక్కించుకొని వచ్చిన మంత్రి నిశ్చింతరావు బంధువు "ఏంట్రా! నాకొడుకుల్లారా! ఏంట్రా మీరు సేసింది? మేం తినిపించిన చికెన్ బిర్యానీలు తిని, మేం తాగించిన మందు తాగి, మాకే ఎదురు తిరిగి బీలలోన పవర్‌ప్లాంట్ కట్టొద్దంటూ ఉద్యమాలు చేస్తార్రా! ఉద్యమాలు" అంటూ నోటికొచ్చిట్టు మాట్లాడుతూ జనాన్ని రెచ్చగొట్టసాగాడు.

అతని మాటలు వినీ వినీ, చేష్టలు చూసీ చూసీ సహనం నశించిన జనం ఒక్కసారిగా "ఏట్నువ్ మాటాడేది? మీరేటి నేసినారు? చింత గింజేసి తాటి గింజ గుంజాలని చూసేరు కదా? మీ డబ్బులెట్టి ఏసీ బస్సుల్లోన మమ్ముల్ని చిరవాడదాకా పంపినారంటే ముందు, ముందు మీకెంత లాభమో? మాకు తెల్దనుకున్నారా? "

"మీ లాభం కోసరం, మీ స్వార్థం కోసరం ఏటి చేసినా తప్పులేదుగాని, మా బతుకులు బుగ్గైపోతాయని తెల్సి మామంతా ఏకమై మా ప్రయత్నాలు మేం చేసుకోవడం తప్పైపోనాదేటి? " అంటూ గట్టిగా ఎదురుతిరిగి మాట్లాడారు.

దాంతో 'అసలే అధికార మదం తలకెక్కిన కోతి, అందులోనూ ఉక్రోషం అనే కల్లు తాగింది. సామాన్య ప్రజల తిరుగుబాటు అనే ముల్లు తొక్కింది. మద్యం మత్తు మంటల్లో దూకింది' అన్నట్టుగా తయారైన ఆ బంధువు కోపంతో తెగ రెచ్చిపోతూ వచ్చిన గూండాలతో కలిసి

శిబిరం మీద పడి మదపుటేనుగులాగా నానా బీభత్సం చేస్తూ అక్కడ ఉన్న గ్రామ స్తులను ఆడా మగా అన్న విచక్షణ కూడా లేకుండా తరిమి తరిమి కొట్టాడు.

ఫలితం!

జీవభద్రలో పోలీసు పికెటింగ్ ఏర్పాటు చేయబడింది.

బీల గ్రామాల్లో ఈ మధ్య ఎవరెవరో కొత్తకొత్తవాళ్లు రకరకాల కార్లలో వచ్చిపో తున్నారు. వాళ్లెవరో? ఎందుకొస్తున్నారో? ఎందుకుపోతున్నారో? గ్రామాల్లో ఎవ్వరికీ అర్థం కావడం లేదు. అందరికంటే ముందు గ్రామాలకొచ్చి రైతుల దగ్గర కంపెనీ తరపున భూములు కొన్న తాతా రావు ఏమైపోయాడో అసలే తెలియడం లేదు. బొర్రయ్య, కన్నదాసులు కూడా ఊళ్ళో సరిగ్గా కనిపించడంలేదు. ఎటుపో తున్నారో? ఎటొస్తున్నారో ఇంట్లో వాళ్లు కూడా చెప్పలేకపోతున్నారు.

కాగా త్వరలోనే కంపెనీవాడు పవర్ ప్లాంటుకి శంకుస్థాపన చేయబోతున్నాడన్న వార్త బీల గ్రామాల్లో కార్చిచ్చులా వ్యాపిం చింది. దాంతో మరింతగా బెదిరిపోయిన రైతులు, మత్స్యకారులు, వ్యవసాయ కూలీలు జీవభద్ర శిబిరం దగ్గరికి గుంపులు గుంపులుగా వచ్చి కృష్ణారావు మాష్టారువాళ్ళతో "ఏటిసేద్దాం మేస్త్రు బావూ?" అంటూ తీవ్ర కలవరపాటు చెందసాగారు.

ఏంచేయాలో పాలుపోని కృష్ణారావు మాష్టారు ఆఖరికి ఓరోజు మల్లీశ్వర్ వాళ్లతో "మరోసారి మంత్రిని కలిసొద్దాం, ఆ ఎంపీ ఎలాగూ దొరకడం లేదు కదా" అంటూ జనాన్ని వెంటబెట్టుకొని నేరుగా నిశ్చింతరావుగారింటికెళ్ళారు.

ఆయన అప్పుడే విందారగించి, సేవ కుడు కాళ్లు వత్తుతుంటే విశ్రాంతి తీసుకుం టున్నాడు.

మాష్టారువాళ్ళను చూడడంతోనే ముఖ మంతా కందగడ్డలా పెడుతూ "చూడండీ! మాష్టారూ! ప్రభుత్వ ఉపాధ్యాయుడుగా పనిచేస్తున్న మీరు ఇలా జనాన్ని వెంటేసు కుని తిరగడం, ప్రభుత్వ వ్యతిరేక కార్యక లాపాల్లో పాల్గొనడం నేరమని తెలి యదా? తెలిసినా ఏటవుతుందిలే అన్న అహంభావమా! మీరిలాగే ప్రవర్తిస్తే మీ మీద కేస్ బుక్‌చేసి లోపలేసీమని ఇప్పుడే పోలీసులకు ఫోన్ చేసి చెబుతానేమనుకు న్నారో!" అంటూ మాష్టారు మీదకి ఒంటి కాలుతో లేచాడు మంత్రి నిశ్చింతరావు.

మంత్రి ఎప్పుడైతే మాష్టారు మీద నోరు చేసుకున్నాడో అప్పుడే అప్పటిదాకా మౌనంగా నిల్చున్న మల్లీశ్వర్, రాజశేఖర్ వాళ్ళతోపాటు వచ్చిన జనమంతా ఒక్కసా రిగా ఆయన మీద తిరగబడి "నువ్వేటి మాటాడుతున్నావో తెలిసే మాటాడుతు న్నావా? మా వోట్లతోటి గెల్చీసి, మంత్రివై మా మాట మాట్లాడకుండా ఆ కంపెనీ వాళ్ళతో లాలూచి పడి వాళ్ళ మాటలు మాటాడుతుంది సాలక దేవుడిలాటి మేస్త్రు బావు మీదనే లేస్తావా?" అంటూ ఏక వచనంలోకి దిగిపోతూ పెద్దగా వాదన పెట్టుకోసాగారు.

అది చూసిన మంత్రి బంధువు "ఏంట్రా నాకొడకల్లారా! మా ఇంటికొచ్చీసి

---

## కొత్తగాలి...

పుస్తకం
నా వెంట ఉంటే
ఎవరూ లేకున్నా
అందరూ ఉన్నట్టే

– భానుమూర్తి,
హైదరాబాద్

పెద్దాచిన్నా లేకుండా మంత్రిగారిపై మాటలు తూల్తా్రా!" అంటూ జనం మీదకి దూసుకొచ్చాడు.

పరిస్థితి అదుపు తప్పుతోందని గ్రహించిన పీఏ, మంత్రి చెవిలో ఏదో గుసగుసలాడాడు.

ఆ దెబ్బకు కళ్ళు తెరిచిన మంత్రితోపాటు ఆ బంధువు కూడా ఒక్కసారిగా చిల్లుబడిన బెలూన్ల మాదిరి కూలబడిపోతూ "ఇదంతా కాదు కాని, వారం రోజుల్లో బీలలోన పవర్ప్లాంట్ పెట్టాలా? వద్దా? అన్న విషయం మీద కలెక్టర్, ఆర్.డి.ఓ., తహాశీల్దార్ వాళ్ళొచ్చి బీల గ్రామాల్లోన గ్రామ సభలు నిర్వహిస్తారు. మీరు చెప్పుకునేదేదన్నా ఉంటే ఆ గ్రామసభల్లోన చెప్పుకోండి. గ్రామ సభల్లోన మెజారిటీ ప్రజలు వెలిబుచ్చిన అభిప్రాయాన్నిబట్టి, తరువాత ఏటి చేయాలో నిర్ణయం తీసుకుంటాం" అంటూ వెంటనే లేచి ఇంట్లోకెళ్ళబోతున్న నిశ్చింతరావుతో, "చూడండీ! మంత్రిగారూ! ఒక్కమాట" అంటూ ఆపేడు లాయర్ రాజశేఖర్.

"ఏటో చెప్పు" అన్నట్టు చూశాడు మంత్రి.

"ఇందాకేటన్నారు? మాష్టారు జాబ్ చేస్తూ ఉద్యమంలో తిరుగుతున్నారని, అల్లా తిరిగితే జాబ్ పీకేయిస్తానని కదా అన్నారు. నిజానికి మాష్టారు తన విధి తాను చేయాల్సిందానికన్నా ఎక్కువగానే చేస్తున్నారు. తను క్లాస్‌రూమ్‌లో తెలిసో, తెలియకో తప్పుచేసిన విద్యార్థిని కొట్టో తిట్టో దారికి తీసుకొస్తారు. అట్టాగే ఇప్పుడు సమాజ పాఠశాలలో బాధ్యతగల పెద్దవాళ్ళే తప్పులు చేస్తున్నప్పుడు వాళ్ళను సరిదిద్దే ప్రయత్నంలో తన ఒక్కడి బలం సరిపోదనుకొని తనచుట్టూ ఉన్న సామాన్యుల సాయం తీసుకుని పాఠాలు చెబుతున్నాడు. మీరనుకుంటున్నట్టు తను చేస్తుంది రాజకీయ పోరాటం కాదు. ప్రభుత్వాన్ని కూల్చేందుకు కుట్ర అంతకన్నా చెయ్యడంలేదు. ప్రజలందరికోసం ప్రకృతి ప్రసాదించిన వనరులను కొద్దిమంది పెట్టుబడిదారులకు కట్టబెట్టి మెజారిటీ సామాన్యుల బతుకుల్లో మట్టి కొట్టొద్దని చెబుతున్నారంతే. దానికి మీరేదో వ్యాఖ్యానాలు చేసి నోటికొచ్చినట్టు మాట్లాడ్డం మంచి పద్ధతి కాదు" అంటూ విరుచుకుపడ్డాడు రాజశేఖర్.

ఆ మాటలతో మరింతగా చిరాకు పడుతూ "ఏటీ నన్ను బెదిరిస్తున్నావా?" అంటూ బిరబిరా లోపలికెళ్ళిపోయాడు నిశ్చింతరావు.

మంత్రి వైఖరిని నిరసిస్తూ చాలాసేపు అక్కడే కూర్చున్న జనమంతా చివరికి మాష్టారి చొరవతోనే లేచి ఎవరి ఊళ్ళకు వాళ్ళు వెనుదిరిగి వెళ్ళిపోయారు.




చాటింపును విన్న వెంటనే శిబిరం దగ్గర సమావేశమైన గ్రామ కమిటీ 'రేపు కలెక్టర్‌గారితో ఎవరెవరు ఏమేమి మాట్లాడాలి' అంటూ రాత్రి పన్నెండు గంటల దాకా క్షుణ్ణంగా చర్చించుకుని వారి, వారి అభిప్రాయాల ఆయుధాలకు పదునుపెట్టుకున్నారు.

మరునాడు చెప్పిన సమయానికి గంట ఆలస్యంగా రెండు కార్లు, నాల్గు జీపుల్లో ఆర్.డి.ఓ., తహాశీల్దార్‌లతోపాటు పది మంది సాయుధులైన పోలీసులతో జీవభద్ర రచ్చబండ దగ్గరకొచ్చాడు కలెక్టర్.

రచ్చబండ ఎదురుగానే ఉన్న దీక్షా శిబిరాన్ని పరికిస్తూ కూర్చున్న కలెక్టర్ గ్రామ సభను ప్రారంభిస్తూ "అన్ని రంగాలలోనూ వెనుకబడిన మన జిల్లాను అభివృద్ధి పథంలో నడిపేందుకు మన నాయకులు

గంగాజలరావుగారు, మంత్రివర్యులు నిశ్చింతరావుగార్లు ప్రభుత్వంతో పోట్లాడి మరీ జిల్లావ్యాప్తంగా ఎన్నో కొత్త కొత్త ప్రాజెక్ట్‌లు పట్టుకొచ్చారు.

తమవంతు కర్తవ్యంగా వాళ్ళు కష్టపడి ప్రాజెక్ట్‌లకు అనుమతులు పట్టుకురాగానే సరిపోదుకదా! ఏ పరిశ్రమ పెట్టాలన్నా ప్రధానంగా మూడు అంశాలతో ముడిపడి ఉంటుంది. ఒకటి భూమి, రెండు పెట్టుబడి, మూడు విద్యుత్.

మన జిల్లాలో పెట్టుబడి పెట్టడానికి అనేకమంది పెద్దపెద్ద పారిశ్రామికవేత్తలు, బహుళజాతి కంపెనీలవారూ ముందుకొస్తున్నారు. అంచేత పెట్టుబడికి కొదువ లేదు. ఇకపోతే రెండో అంశం భూమికి సంబంధించింది. మన బీలలో ప్రభుత్వ భూమి ఓ వెయ్యి ఎకరాల దాకా ఉంటుంది. ఆ భూమిని కుచేలా కంపెనీవారికి ఇవ్వడానికి నాయకులిద్దరి కృషితో ప్రభుత్వం నిర్ణయం తీసుకుంది. ప్రభుత్వం కుచేలా కంపెనీ వారికిచ్చిన వెయ్యి ఎకరాలకు తోడు తాతారావు రైతుల దగ్గర కొన్న వెయ్యి ఎకరాలు కలిపి మొత్తం రెండు వేల ఎకరాలలో, రెండు వేల ఆరువందల నలభై మెగావాట్ల థర్మల్ విద్యుదుత్పత్తి కేంద్రాన్ని నిర్మించడానికి అన్నిరకాల అనుమతులూ వచ్చేశాయి.

ఆ విద్యుత్ కేంద్రం పూర్తయి, ఉత్పత్తి ప్రారంభిస్తే మన జిల్లా ముఖ చిత్రమే మారిపోతుంది. అప్పుడు ఎన్నో రకాల పరిశ్రమలు వరసకట్టి వస్తాయి. ఆ రకంగా మన జిల్లాను అభివృద్ధిపరిచే కార్యక్రమంలో మొట్టమొదటి పరిశ్రమగా తరలి వస్తున్న విద్యుదుత్పత్తి కేంద్రం నిర్మాణానికి ప్రభుత్వపరంగా మేం చేయాల్సిందంతా చేశాం. ఇక కావాల్సిందల్లా మీ సంపూర్ణ సహాయ సహకారాలే!

జిల్లా అభివృద్ధి యజ్ఞంలో పాల్గొనే మహదవకాశం మొట్టమొదటగా మన బీల పరిసరవాసులుగా మీకే దక్కబోతుంది. అందుకే మీరంతా ఎవ్వరో చెప్పిన చెప్పుడు మాటలు వినకుండా మీవంతు ధర్మంగా మీరీ గ్రామ సభలో విద్యుదుత్పత్తి కేంద్రానికి అనుకూలంగా ఏకగ్రీవ తీర్మానాన్ని ఆమోదిస్తారని ఆశిస్తున్నాను. అంత పెద్ద కర్మాగారంలో మీకూ, మీ పిల్లలకు ఉద్యోగాలు దొరుకుతాయి. చేతినిండా డబ్బులు ఆడతాయి. మీ కొనుగోలు శక్తి పెరుగుతుంది. లాండ్రీ షాపులవాళ్ళ దగ్గర్నుండి లక్షల్లో వ్యాపారాలు చేసే బంగారు షాపులవాళ్ళ దాకా ఎంతోమందికి పరోక్షంగా ఆదాయవనరులు పెరుగుతాయి" అంటూ ఎంతో నేర్పుగా తను చెప్పదలచుకున్న చేదు విషయాన్ని తీపి మాటల పూతతో గ్రామ సభలో విన్పించాడు.

"తరతరాలుగా ప్రజలకు ఉపయోగపడుతున్న బీల భూములను ప్రభుత్వం కుచేలా కంపెనీవాడికి మాకిష్టం లేకుండా ఎట్లా కట్టబెడుతుంది, వాడు ఎట్లా తీసుకుంటాడు? మేం ఒప్పేసుకుంటామని మీరెట్లా అనుకున్నారు? "

"మాకు పవర్ ప్రాజెక్ట్‌లు, పరిశ్రమలు అవసరంలేదు. మా బీల మాకు సాలు, కంపెనీవాడు తాతారావు ద్వారా మోసం

### కొత్తగాలి...

**గంగిరెద్దు**
**గుమ్మానికి వచ్చిందా?!**
**హమ్మయ్య!**
**నా సంస్కృతి బతికే ఉంది**

*– కిలపర్తి దాలినాయుడు,*
సాలూరు, విజయనగరం

చేసి మా భూములు కొన్నాడు. ఇప్పుడు అసలు విషయం తెలిసింది కాబట్టి మా భూములు మాకు వెనక్కివ్వాల్సిందే. పవర్‌ప్లాంట్ కోసమైతే మేం మా భూములు ఇవ్వనే ఇవ్వం. ఏం చేసుకుంటారో చేసుకోమనండి" అంటూ గ్రామస్తులంతా ఒక్కసారిగా తమ అసమ్మతిని వ్యక్తం చేయడంతో కోపంతో ఊగిపోయిన జిల్లా ఎస్పీ, కూర్చున్నవాడల్లా దిగ్గున లేచి "కలెక్టర్‌గారితో మాట్లాడే పద్ధతి ఇదేనా? ఎవరైనా హద్దుమీరి ప్రవర్తిస్తే పరిణామాలు చాలా తీవ్రంగా ఉంటాయి జాగ్రత్త!" అంటూ చేతిలోని రివాల్వర్‌ని ఆడిస్తూ పెద్దపులిలా గాండ్రించాడు.

ఆయన అరుపులకు ఏమాత్రం భయపడని గ్రామస్తులు "బీల భూముల్లో పవర్ ప్లాంట్ కట్టడానికి మేం ఒప్పుకోవడంలేదు. ఇదే విషయాన్ని గ్రామసభ తీర్మానం కింద రాసుకుని ఇవ్వండి. మేమంతా సంతకాలు పెడతాం" అంటూ గ్రామస్తులందరి తరపునా మాట్లాడాడు సర్పంచ్ అలుగురాజు.

"ప్రెసిడెంట్‌గారూ! మీరు బాగా ఆలోచించుకుని చెప్పండి. గ్రామ సభ తీర్మానం అంటే ఆషామాషీ వ్యవహారం కాదు. ఒక విషయం మీద ప్రభుత్వం నిర్ణయం తీసుకున్న తరువాత అంత తొందరగా వెనక్కిపోదు. ఇక్కడ మీమీద సానుభూతితో పవర్‌ప్లాంట్ నిర్ణయాన్ని వెనక్కి తీసుకుంటే, అది ఇక్కడితో ఆగదు. దీన్ని సాకుగా చూపించి రేపు కాకరకాయలపల్లి, బద్దెనపాడుల్లో కూడా జనం ముందుకొచ్చి పవర్‌ప్లాంట్‌లు కట్టొద్దంటే అప్పుడేంటి పరిస్థితి? అక్కడా వెనక్కి పోవాల్సిందేనా? మరి ఇల్లా అన్నిచోట్లా ప్లాంట్‌లు కట్టొద్దంటే ఈ వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి ఎట్లా కొనసాగుతుంది?

మీరంతా ఒక్క విషయం గుర్తుపెట్టుకోండి. ప్రస్తుత సమాజంలో బతుకుతున్న మనం ఎంతోకొంత త్యాగాన్ని భరించకుంటే, భవిష్యత్ తరాలకు మనుగడే ఉండదు. త్యాగం పునాదిగానే మానవ సమాజం నిత్య నూతనమవుతూ నానాటికీ పురోగమిస్తుంది. కాబట్టి నేటి మీ త్యాగమే రేపటి తరాలవారికి ముఖ్యంగా మీ పిల్లలకు పెట్టుబడి అవుతుంది. దీనికి భిన్నంగా మీరు వ్యవహరిస్తే అభివృద్ధి శాశ్వతంగా కుంటుపడుతుంది" మీరంతా గ్రామసభ ద్వారా పవర్ ప్లాంట్ నిర్మాణానికి అంగీకరించక తప్పదన్నట్లు మాట్లాడసాగాడు స్వామిపేట తహశీల్దార్, ప్రజాభిప్రాయానికి భిన్నమైన పంథాని అవలంబిస్తూ.

"మీరెన్నైనా చెప్పండి బావూ! మేం మాత్రం బీలను అప్పగించం, ఎవ్వలూ సంతకాలు సేయం. మీరేటి రాసుకుపోతారో మీ ఇష్టం" కరాఖండీగా గ్రామ ప్రజలంతా తేల్చి చెప్పారు.

కొంతసేపు తర్జన భర్జన తరవాత గ్రామసభ తీర్మానం తాము కోరుకున్న రీతిలో జరగలేదన్న కోపంతోనూ, దుగ్ధతోనూ అర్ధాంతరంగా సభను వాయిదా వేసుకొని నల్లగండి గ్రామం వైపుగా సాగిపోయారు కలెక్టర్, ఆయన మందీ మార్బలం మొత్తం.

నల్లగండి వెంకటేశ్వరస్వామి ఆలయం. ఆలయం లోపల దేవేరులతో కొలువై ఉన్న స్వామి 'ఈ గొడవలు నాకేల?' అన్నట్లు చిద్విలాసంగా చూస్తూ ఎప్పటి మాదిరిగానే మౌనంగా ఉన్నాడు.

ఆలయం ముందున్న రావిచెట్టు మాత్రం నిజంగానే పవర్‌ప్లాంట్ వస్తే ముందు ముందు తానెంత బూడిద మోయాలో అనే భయంతో కొమ్మారెమ్మల శరీరంతో వణికిపోతూ 'ఆకుల నోళ్ళతో థర్మల్ స్టేషన్ వద్దు, వద్దు' అంటూ గల గలా

మొత్తుకోసాగింది.

దూరంగా ఎక్కణ్ణుంచో కుక్కలు అదే పనిగా ఏడుస్తున్నాయి, ఎందుకో?

గుడి ఆవరణలో ఊరిజనం మొత్తం ఆడ, మగ ఉత్తర, దక్షిణాలుగా ఎదురెదురుగా సభదీరి కూర్చున్నారు.

వాళ్ళ మధ్యలో గ్రామ కార్యదర్శి ఏర్పాటు చేసిన ఒక టేబుల్, ఏడెనిమిది ప్లాస్టిక్ కుర్చీలు కన్పిస్తున్నాయి.

ఇంతలో మందీ మార్బలంతో కలెక్టర్ నేరుగా గుడి ముందుకొచ్చి వాహనం నుండి దిగాడు.

గ్రామ కార్యదర్శి వచ్చినవాళ్ళను గ్రామస్తులకు పరిచయం చేసిన తరువాత ఇంతకుముందు జీవభద్రలో చెప్పిన మాటలనే, మళ్ళీ క్యాసెట్ వేసినట్లు పొల్లు తేడా పోకుండా చెప్పుకొచ్చాడు కలెక్టర్.

కలెక్టర్‌తోసహా అధికారులంతా 'పవర్ ప్లాంట్ ఏర్పాటును గ్రామస్తులంతా ఏకగ్రీవంగా ఆమోదించాల్సిందే. అంతకుమించి మీకు వేరే మార్గం లేదు' అన్నట్లు ఊకదంపుడు ఉపన్యాసాలు చాలా దంచారు.

అధికారుల హెచ్చరికలను సావకాశంగా ఆకళింపు చేసుకున్న నల్లగండి గ్రామస్తులు "ఇదేటిది? మనం సెప్పింది సెప్పినట్లు రాసుకుపోకుండా ఆల్లు సెప్పినట్టే మన్ని రాసీమన్నట్టుగా మాటాడతారేటి? " అంటూ గుసగుసగా తమలో తామే మాట్లాడుకొని అందరూ కలిసి తెప్పల కోదండరామ్‌ను ఊరి తరపున మాట్లాడమన్నారు.

ఊరువాళ్ళ ఉమ్మడి నిర్ణయానికి కట్టుబడి లేచి నిలబడ్డ కోదండరామ్ "నమస్కారమయ్యా కలెక్టర్ బావూ! ఒక విషయం మాకు తెలియకడుగుతున్నాం, సెబుతారేటి బావూ!" అంటూ చేతులెత్తి నమస్కరిస్తూ అన్నాడు.

"అడుగేంటో" కోదండరామ్ వంక నిశితంగా చూస్తూ అన్నాడు కలెక్టర్.

"మీరు గొప్ప గొప్ప సదువులు సదువుకున్న మారాజులు. సింహం అడవికి రాజైనట్టే మీరు జిల్లాకు రాజులాంటోరు. మీరు ఒక్కసారి కలెక్టర్రైతే ముప్పై, ముప్పై అయిదేండ్లు సర్వీసు సేస్తారు. మీరు ఎవ్వరికీ భయపడకుండా, ఎవ్వరి మాటలూ పట్టించుకోకుండా, మాలాంటి బీదాబిక్కి జనానికి సాయం చేయాల్సినోరు. అట్టాటి మీరు.. ఎప్పుడుంటారో? ఎప్పుడూడతారో తెలియని ఎంపీలు, మంత్రులు సెప్పినట్టుయిని మమ్ముల్ని గ్రామసభలో పవర్ ప్లాంట్‌కి అనుకూలంగా తీర్మానం చేయమనటం బాగుందేటి బావూ!" దేనికో నాందీ ప్రస్తావనగా అనుకొచ్చాడు కోదండరామ్.

"ఏంటి పెద్ద పెద్ద మాటలు మాట్లాడుతున్నావ్? " పోలీస్ దర్పంతో అన్నాడు ఎస్పీ.

"మరేటి బావూ! గ్రామసభంటే గ్రామస్తులు చేసిన తీర్మానం రాసుకోని పోడమా? లేకుంటే మీరు బెదిరిస్తే బెదిరిపోయి మీరు చెప్పినట్టు రాసీడమా? " అంటూ సూటిగా ఎస్పీనే ప్రశ్నించాడు కోదండరాం.

పొద్దున లేస్తే బీలలో బడి చేపలు పట్టుకుని పొట్టబోసుకునే ఓ పల్లెకారు, జిల్లా ఎస్పీ, కలెక్టర్లనే ఢీకొనడం చూసి ఎస్పీకి ఎక్కళ్ళేని కోపం తన్నుకొచ్చింది. ముక్కుపుటాలు అదురుతుంటే "నువ్వు ఎవరితో మాట్లాడుతున్నావో? ఏం మాట్లాడుతున్నావో తెలిసే మాట్లాడుతున్నావా? " మళ్ళీ అన్నాడు రౌద్రంగా.

"తెలుస్సార్! కలెక్టర్ బావంటే ఈ జిల్లాకే తండ్రంతటోడండీ! ఏ ఇంట్లోనైనా ఏ పిలకాయైనా తనకు ఏదన్నా సమస్యొస్తే చెప్పుకోవాల్సింది తండ్రితోనే గద బావూ? ఒకేల చెప్పుకోకపోతే ఏటైద్దండీ?

ఆ పిలకాయకు శానా ట్రబులైద్దండీ! అలా ట్రబులై ఒక్కోసారి పీకలమీదకొస్తుంది కదేటి బావూ! అంతే గదండీ మరీ! అలాగే నేను కూడా ఓ పిలకాయ మాదిరిగా నా తండ్రిలాటి కలెట్రు బావును డౌటడుక్కుంటుంటే మద్దెన మీరెందుకు ఎస్పీ బావూ! అంత గరమైపోతున్నారు? మీరలగ కోపం తోటి మాట్లాడితే మేం మరింకేటి మాట్లాడగలం? సొరసేపకు కోపమొస్తే పిత్త పరిగ కుత్తుక తెరుస్తాదేటి? " అంటూ ఎస్పీని వెన్నముద్దతో కొట్టినట్టు మెత్తటి మాటలతో కనబడని కౌకు దెబ్బలు కొట్టాడు కోదండరామ్.

కోదండరామ్ మాటలు విన్న ఎస్.పి. "ఈ నా కొడుకులంతా ఈ మధ్యన తెగ తెలివి మీరిపోయారు" లోలోపల సణుక్కుంటూ అసహనంగా ఏం చేయాలన్నట్టు కలెక్టర్ వంక నర్మగర్భంగా చూశాడు.

కలెక్టర్ ఆర్డీవో వంక చూశాడు.

ఆర్డీవో తహశీల్దార్ వంక చూశాడు.

ఆ చూపులకర్థం తెలుసుకున్న తహశీల్దార్ కోదండరామ్ వంక కొరకొర చూస్తూ "మేం మీ ఊరు వచ్చేముందు మీ ఊరి గురించి, మీ ఊరి మనుషుల గురించి ముఖ్యంగా నీ గురించి సమాచారం అంతా తెలుసుకునే వచ్చాం. ఎందుకైనా మంచిది నీ నోరు కొంచెం సంబాళించుకుని మాట్లాడితే మంచిది. లేకపోతే నీ జాతకం మొత్తం బైటకొస్తుంది" పలుకు పలుకులో అసహనాన్ని వెలిబుచ్చుతూ మాట్లాడాడు తహశీల్దార్.

"నా జాతకం గురించి మీరు తెల్సుకునేదేటుంటాది బావూ! ఏదో ఆ బగవంతుడు ఇచ్చిన బీలలో సన్నచేపలు పట్టుకొని పొట్ట బోసుకునే పల్లెకార్నాకొడుకుని. మీరన్నట్టు ఒకేలా నా గురించి ఏదన్నా తెల్సుకున్నా నన్ను సేసేదేటి? నేనేమన్న స్మగ్లింగు సేస్తున్నానా? బినామీ పేర్లతో దందాలు సేస్తున్నానా? " ఏదో పూనకం పట్టిన వాడిలా నదురు బెదురు, భయం గియం లేకుండా ధైర్యంగా మాట్లాడాడు కోదండ రామ్.

"నువు ఎర్రజెండావాళ్ళతో తిరుగుతుంటావు కదూ, అందుకే ఇలా మాట్లాడుతున్నావ్. మీ ఆవిడ అంగన్‌వాడీ టీచర్‌గా చేస్తుంది కదా? " అదుపు తప్పిన అసహనాన్ని ప్రదర్శిస్తూ నోటికొచ్చినట్టు మాట్లాడాడు తహశీల్దార్ పెద్దపెద్దగా చేతులు ఊపుతూ.

"నా ఎర్రజెండాకి మాయావిడ ఉద్యోగానికీ లింకేటి బావూ!" మరింత గడ్డుదేరి పోయినట్టుగా ఉంది కోదండరామ్ స్వరం.

> **కొత్తగాలి...** 
>
> **ఆమె చేతిలో**
> **గోరింటాకే కాదు**
> **కవిత్వమూ**
> **పండుతుంది**
>
> – కందేపి రాణీప్రసాద్

"మేము తల్చుకుంటే ఈ క్షణంలోన ఆమె ఉద్యోగం పీకీగలం తెల్సా" తానొక బాధ్యతగల అధికారన్న ప్రాథమిక సత్యాన్నే మర్చిపోయి మామూలు వీధిమనిషిలా వాదులాటకు దిగాడు తహశీల్దార్.

"అద్గదీ సంగతి బావూ! సక్కగ సెప్పినావు. గతారునెల్ల నుండి యం.డి.ఓ. బావు ప్రద్దానికి మీ ఆయన పెద్ద ఎర్ర జెండా లీడరంట గదా? అని సతాయిస్తున్నాడంటే ఎందుకోననుకున్నా. ఇదన్న మాట అసలు విషయం. ఉద్యమంలో చలాగ్గ తిరుగుతున్న నన్నేటి సెయ్యలేక అల్లొకనాడు అర్జునుడు శిఖండి నడ్డం

బెట్టుకొని తాతను గూల్చినట్టు ఇయ్యాల నా ఇల్లాల్ని అడ్డెట్టుకొని నన్ను సాధిద్దారనుకుంటున్నారన్న మాట.

మాయ్యావిడ ఏం తప్పుసేసిందని సెప్పి తీసేస్తారేటి? ఏదీ తీసెయ్యండి సూద్దాం, ఏటవుతుందో? ఇనుకోండి బావూ! సెబుతున్నాను. మాయ్యావిడ ఇషయంలో మీ చేతైంది చేస్కోపోండి బావూ! మేం పుట్టినప్పుట్నుండి ఈ అంగన్‌వాడీ టీచర్ పోస్ట్ ఉంటేనే బతికినావేటి? బీల మీద బతికినాము గాని, అమ్మలాంటి బీలే పోతుందంటే మాకా ఉద్యోగమొక లెక్కేటి? " ఎండు దుంగను రంపంతో కోసినట్టు కర్రు కర్రున మాట్లాడాడు కోదండరామ్.

**కొత్తగాలి...**

**కాన్వెంట్ బజారులో**
**చదువు**
**కేజీల లెక్కన**
**అమ్ముడవుతోంది**

– ముండూరు ఉమాబాల,
హైదరాబాద్

'వీడేం చూసుకొని ఇంతగా రెచ్చిపోయి మాట్లాడుతున్నాడు' అనుకోసాగారు జిల్లా కలెక్టర్, ఎస్పీలిద్దరూ గుసగుసగా.

ఇంతలో...

కృష్ణారావు మాష్టారు, మల్లీశ్వర్, రాజశేఖర్ మొదలైన ముఖ్యనాయకులంతా బైక్‌ల మీద, స్కూటర్లమీదా నల్లగండి గ్రామసభకు చేరుకున్నారు.

వాళ్ళను చూడ్డంతోనే కలెక్టర్ ఎస్పీ చెవిలో ఏదో ఊదాడు.

ఎస్పీ ఎస్సై చెవిలో ఏదో గుసగుసలాడాడు.

ఎస్సై హెడ్ కానిస్టేబుల్‌తో ఏదో అన్నాడు.

హెడ్డు తన కింద పోలీసులతో ఏదో చెప్పాడు.

వాళ్ళంతా కలిసి నేరుగా బైక్ దిగి వస్తున్న కృష్ణారావు మాష్టారును చుట్టుముట్టి "ప్రభుత్వాధికారుల డ్యూటీని అడ్డుకుంటూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా జనాలను రెచ్చగొడుతున్నందుకు ఐపిసి సెక్షన్ 186 ప్రకారం రాజద్రోహం కేసు కింద మిమ్మల్ని అరెస్టు చేస్తున్నాం" అంటూ ఆయన్ని నెట్టుకుంటూ జీపుదగ్గరకు నడిపించారు.

ఎప్పుడైతే మాష్టారువాళ్ళను పోలీసులు జీపెక్కించడానికి ప్రయత్నించారో అప్పుడు కోదండరామ్ సహా ఊరివాళ్ళంతా ఒక్కపెట్టున ఎదురు తిరిగారు.

అలాంటి అవకాశం కోసమే ఎదురు చూస్తున్న ఎస్పీ వెంటనే లాఠీచార్జికి ఆర్డరిచ్చాడు.

అంతే!

మరుక్షణంలో ఆ ఊరివాళ్ళమీద ఆడామగా, వృద్ధులు, పిల్లలు అన్న తేడా లేకుండా జిల్లా కలెక్టర్ సాక్షిగా పోలీస్ లాఠీలు స్వైరవిహారం చేశాయి.

ఎవరు ఎంత మొత్తుకున్నా, ఊరంతా అడ్డుపడ్డా కృష్ణారావు మాష్టారుతో సహా మరో ఇరవైమంది ఉద్యమకారులను అరెస్ట్ చేసి తీసుకెళ్ళారు. నలభై, యాభై మందికి బలమైన లాఠీ దెబ్బలు తగిలాయి. అందులో ఇద్దరికి తలలు పగిలితే మరో ముగ్గురికి చేతులు విరిగాయి.

ఇంత జరిగిన తరువాత ఇక లాభం లేదనుకుని గ్రామసభను వాయిదా వేసుకుని కలెక్టర్, ఎస్పీలు అక్కణ్ణుంచి వెళ్ళిపోయారు.

'నల్లగండి గ్రామంలో పవర్ ప్రాజెక్ట్ నిర్మాణం విషయంలో ప్రజాభిప్రాయ సేకరణలో భాగంగా జిల్లా కలెక్టర్ గ్రామసభ

నిర్వహించబోగా ఆయనమీద దౌర్జన్యానికి దిగిన ఆందోళనకారులు, సంయమనంతో వ్యవహరించిన పోలీసులు, స్వల్ప లాఠీచార్జీతో ఉద్రిక్తతను అదుపులోకి తెచ్చిన పోలీసులు' అంటూ మరునాడు కొన్ని పేపర్లలో వార్తలొచ్చాయి.

జిల్లా కేంద్రంలో ఉన్న బార్ అసోసియేషన్ ఈ విషయం తెలియగానే సర్వసభ్య సమావేశం పెట్టుకొని కుచేలా కంపెనీ ప్లాంట్‌కి వ్యతిరేకంగా పనిచేస్తున్న నాయకుల మీద, కార్యకర్తలమీద బనాయిస్తున్న అక్రమకేసుల్లో వాదించడానికి లాయర్లంతా ప్రాధాన్యత ఇవ్వాలని, బాధితుల తరపున ఉచితంగా కేసులు వాదించడమే కాకుండా పేపర్ ఖర్చులు, కోర్టు ఖర్చులు కూడా అసోసియేషన్ నిధి నుండే భరించాలని ఏకగ్రీవ తీర్మానంతో ఉద్యమానికి సంపూర్ణ మద్దతు తెలిపింది.

అనుకున్నట్లు మూడోరోజు సాయంత్రం నాలుగ్గంటలకల్లా బార్ అసోసియేషన్ వాళ్ళు పోలీసులు తీసుకుపోయిన నాయకులను, కార్యకర్తలను బెయిల్‌మీద బయటకు తీసుకొచ్చారు.

ఆ తరువాత మూడోరోజు బడికి వెళ్ళిన మాష్టారుని సస్పెండ్ చేస్తున్నట్టుగా డి.ఇ.ఓ. పంపిన ఉత్తర్వులను చేతికిచ్చిన హెచ్.యం. "సారీ" అన్నాడు.

"కావాలని ప్రభుత్వమే చేసినదానికి మీరెందుకు సార్! సారీ చెప్పడం" అంటూ సస్పెన్షన్ ఆర్డర్ని తీసుకున్నాడు కృష్ణారావు మాష్టారు.

మాష్టార్ని సస్పెండ్ చేసిన విషయం తెలిసిన బీల గ్రామాల ప్రజలు కోపంతో ఊగిపోతూ జీవభద్ర శిబిరం దగ్గరికి చీమల బారుల్లా కదిలివచ్చారు.

వచ్చిన వాళ్ళంతా ఒక్కగొంతుకతో "మాష్టారి సస్పెన్షన్‌కి వ్యతిరేకంగా మనమంతా పెద్ద ఎత్తున ఏదైనా ఆందోళనా కార్యక్రమం చేపట్టాల్సిందే" అంటూ ఏకాభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.

జనమందరి మూకుమ్మడి అభిప్రాయాన్ని విన్న మల్లీశ్వర్ శిబిరంలోని మైక్ ముందుకొచ్చి "నామీద ఇప్పటి వరకూ ముప్పై రెండు కేసులు, రాజశేఖర్‌మీద ఇరవైనాలుగు కేసులు పెట్టినా భయపడలేదు. కానీ ఇవ్వాళ దేవుడిలాంటి మాష్టారు మీద కూడా రాజద్రోహం కేసు పెట్టి ఉద్యోగంలో నుండి సస్పెండ్ చేశారంటే ఇదంతా తెరవెనుక నుండి ఆ గంగాజర్రావు, నిశ్చింతరావులు కావాలనే చేయించుంటారు. వాళ్ళ హస్తం లేకుండా ఇదంతా జరగదు. కంపెనీవాడితో కుమ్మక్కై మన బీలలో ఎట్లాగైనా పవర్ ప్లాంట్ కట్టి మన అన్నంలో మన్ను పోయాలని చూస్తున్నారు. ఇప్పటి దాకా మీరంతా అన్నట్టు ఇంకా ఏదో ఒక పెద్ద మూమెంట్ తీసుకురావడం తప్ప గత్యంతరం కనబడ్డం లేదు" అంటూ ఆవేశంతో దడ దడ మాట్లాడుకొచ్చాడు.

వెంటనే మైక్ ముందుకొచ్చిన మాష్టారు "ఈ సమయంలో మనం సంయమనం కోల్పోయి ఆవేశపడడం మంచిది కాదు. నా ఒక్కడి కోసం మీరంతా ఆందోళన చెందడం నా మనసును కదిలిస్తోంది. ఆ అభిమానం చాలు నాకు, నా సస్పెన్షన్ కోసం ఇప్పుడేదో ఆందోళన మొదలుపెడితే, మన అసలు సమస్య పక్కకు పోతుంది. మన ప్రత్యర్థులు కోరుకునేది కూడా అదే కాబట్టి మనం వాళ్ళకు ఆ అవకాశం ఇవ్వకూడదు.

మీరంతా ప్రశాంతంగా ఉండాలి. మనం శాంతియుత పద్ధతుల్లోనే ఈ ఉద్యమం సాగించాలన్న ఆలోచనతోనే గాంధీగారు పుట్టిన రోజున ఆయన విగ్రహం సాక్షిగా ఈ దీక్షా శిబిరాన్ని ప్రారంభించాం. ఆ సంగతి మీరంతా గుర్తుంచుకోవాలి.

సస్పెన్షన్ అనేది శిక్ష కాదు. నా ఉద్యోగం ఎక్కడికీ పోదు. మనం ఎంచుకున్న మార్గం నుండి కొంచెం పక్కకు జరిగినా ప్రభుత్వం మరింత కఠినంగానూ, కర్కశంగానూ వ్యవహరిస్తుంది. నిర్దాక్షిణ్యంగా ఉద్యమాన్ని అణచివేస్తుంది. అప్పుడు మనం మరింత నిర్బంధాన్ని ఎదుర్కోవలసి వస్తుంది. అందుకే జాగ్రత్తగా ఉండమని మరీ మరీ చెబుతున్నా.

ఈ ఉద్యమం మన ఒక్కరి మీదనే ఆధారపడి నడవడం లేదు. ఇంకా అనేక మంది అనేక రకాలుగా ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ పెద్ద ఎత్తున పనిచేస్తున్నారు. 'ఫోరం ఫర్ బెటర్ విశాఖ' అనే స్వచ్ఛంద సంస్థ వాళ్లు పవర్ ప్లాంట్ నిర్మాణం వల్ల పర్యావరణం ఎంత దెబ్బ తింటుందో సోదాహరణంగా పేర్కొంటూ నేషనల్ ఎన్విరాన్‌మెంట్ అప్పిలేట్ అథారిటీ ముందు కేసు ఫైల్ చేశారు. ఇక్కడ మనం ఫెయిల్ అయితే దీని ప్రభావం దాని మీద కూడా పడుతుంది. న్యాయం మన పక్షాన ఉంది. అంతిమంగా విజయం మననే వరిస్తుంది" అంటూ ప్రశాంతంగా ఒక్కో విషయాన్నీ వివరించి జనాన్ని చల్లబర్చి ఆలోచనల్లో పడవేశాడు.

జనం ఆవేశపు వరదకు తన వివరణతో అడ్డుకట్ట వేసిన కృష్ణారావు మాష్టారును ఉద్దేశిస్తూ "మరి మనం ఇప్పుడేటి చేయాలో అది కూడా మీరే సెప్పండి మాస్టు బావూ!" అంటూ కొందరు యువకులు ముందుకొచ్చారు.

"నాకు తెలిసి ఏ ఉద్యమానికైనా ప్రజా బలంతో పాటు రాజకీయ బలం కూడా అవసరమే కాబట్టి మనలో కొందరం వెంటనే హైదరాబాద్ వెళ్ళి ప్రొ. నందగోపాల్ గారిని తీసుకుని ఆ పార్టీ, ఈ పార్టీ అని లేకుండా అన్ని రాజకీయ పార్టీల నాయకులను కలిసి మన సమస్యను, బీల భూముల ప్రాశస్త్యాన్నీ, పర్యావరణ దుష్ఫలితాలను, జీవ వైవిధ్యాన్ని కాపాడవలసిన అవసరాన్ని వివరించి పవర్ ప్లాంట్ నిర్మాణాన్ని ఆపేలా కృషిచేయమని కోరుదాం" అంటూ ఎంతో ముందు చూపుతో, పరిణితి చెందిన ఆలోచనతో తన మనసులోని భావనను వాళ్ళ ముందు ఉంచాడు కృష్ణారావు మాష్టారు.

మాష్టారి ఆలోచనను అక్కడ చేరిన జనమంతా ఆమోదించడంతో ఆ మరుసటి రోజే ఐదుగురు సభ్యుల ప్రధాన బృందం హైదరాబాద్ వెళ్ళి అనుకున్నట్టే ప్రొ. నందగోపాల్‌ను తీసుకుని అన్ని రాజకీయ పార్టీల అగ్రనాయకులను కలిసి తమ పోరాటానికి మద్దతు తెలిపి సహకరించవల్సిందిగా అభ్యర్థించారు.

ఆశ్చర్యకరంగా అన్ని రాజకీయ పార్టీల అగ్రనాయకులందరూ "అసలు ముందు మీ రాజకీయ విధానమేంటో వివరించండి. ఇప్పటిదాకా పరోక్షంగానైనా సరే ఏదో ఒక రాజకీయ పార్టీ అండదండలు లేకుండా ఇంత పెద్ద ఎత్తున, ఇంత పకడ్బందీగా ఇన్ని రోజులుగా ఉద్యమాన్ని నడుపుకొస్తున్నారంటే నమ్మడానికి మేం సిద్ధంగా లేము. అంతమాత్రం అవగాహన లేని వాళ్ళం కాము. కచ్చితంగా మీ వెనుక ఏదో ఒక అజ్ఞాత రాజకీయ శక్తి ఉండే ఉంటుంది. ఆ శక్తి ఏదో స్పష్టం కానంత వరకూ మేం చేయగలిగింది ఏమీ లేదు" వాస్తవానికి తామంతా రాజకీయం అనే ఒకే తానులోని ముక్కలం అన్నట్టు తెలియజేస్తూ అన్యాపదేశంగా 'మీ ఉద్యమం వెనుక నిషేధిత పార్టీల పాత్ర ఉంది' అన్న భావాన్ని వ్యక్తం చేస్తూ ఒకే రకంగా మాట్లాడారు.

అసంఖ్యాక ప్రజా బాహుళ్యంతో విస్తృత సంబంధాలు కొనసాగించే రాజకీయ పార్టీల నాయకులుగా, నిజమైన

ప్రజా ఉద్యమాన్ని అంచనా వేసి, సాయం అందించడంలో విఫలమైన వివిధ పార్టీల నాయకత్వాల సహాయాన్ని అర్థించ వచ్చిన ఆపన్నులకు వెంటనే చేయూతనందించక పోగా మీ ఉద్యమం వెనుక వేరెవరో ఉన్నారన్నట్టుగా సిద్ధాంతీకరిస్తూ మాట్లాడ డంతో కృష్ణారావు మాష్టారు వాళ్ళు ఆశ్చ ర్యంతో గడ్డకట్టుకుపోతూ 'వీళ్ళంతా దూరపు కొండలాంటి వాళ్ళు' అనుకున్నారు తమలో తాము. దాంతో "ఇక తాడో, పేడో మనమే తేల్చుకుందాం పదండీ!" అంటూ ప్రొ. నందగోపాల్ దగ్గర సెలవు తీసుకుని ఎట్లా వెళ్ళిన వాళ్ళు అట్లాగే వెను దిరిగి వచ్చారు.

రకరకాల పద్ధతుల్లో ఉద్యమం శాంతి యుతంగానే నడుస్తోంది.

★ ★ ★

ఉద్యమంలో మునిగిపోయిన వాళ్ళకు రోజులు ఎలా గడిచిపోతున్నాయో అర్థమే గావడం లేదు.

గవర్నమెంట్ కూడా ముఖ్యంగా జిల్లా మంత్రి, ఎంపీలిద్దరితో వెంటనే 'ఏదో విధంగా పవర్ ప్లాంట్‌కు శంకుస్థాపన చేయించి వదిలితే ఆ తరువాత జరిగే పరి ణామాలను ఏ విధంగానైనా సర్దుబాటు చేసుకోవచ్చు' అన్న ఆలోచనతో వేగంగా పావులు కదపసాగింది.

ఆ ఇద్దరు నాయకుల ఎత్తుగడలతో ఏం చేయాలో పాలుపోని కృష్ణారావు మాష్టారు వాళ్ళు ఇకముందు ఏం చేయాలోనన్న ఆలోచనతో ప్రొ. నందగోపాల్‌ని కలుద్దాం అనుకుంటుండగానే ఆయనకు హార్ట్‌ఎటాక్ రావడంతో కేర్ హాస్పిటల్లో చేర్పించారని తెలిసి తాత్కాలికంగా తమ ప్రయాణాన్ని వాయిదా వేసుకున్నారు.

మరో వారం రోజుల తరువాత 'ఈ రోజు రాత్రి హైదరాబాద్ వెళ్దాం' అను కుంటుండగానే సామాజిక ఉద్యమకారుడు, పర్యావరణవేత్త ప్రొ. నందగోపాల్‌కి ఈ ఉదయం మూడోసారి తీవ్రమైన గుండె పోటు రావడంతో, కుటుంబ సభ్యులు హాస్పిటల్‌కి తీసుకుపోతుండగా దారిలోనే అంతిమశ్వాస వదిలారు' అంటూ టీవీల్లో బ్రేకింగ్ న్యూస్‌లు రాసాగాయి.

ఆ వార్తను చూసిన కృష్ణారావు మాష్టా రుకి కూడా స్ట్రోక్ వచ్చినంత పనై పోగా పక్కనే ఉన్న కుర్చీలో నిస్తేజంగా కూలబ డిపోయాడు.

ప్రొ. నందగోపాల్ మరణ వార్తతో జీ వభద్ర శిబిరం దగ్గర విషాదచ్ఛాయలు అలుముకున్నాయి. వెంటనే ఎవరో

## ఎందుకేశామో తెల్సా?

ఓ రాత్రి దాదాపు ముప్పై మంది విద్యా ర్థులు గోరాశాస్త్రిని ఆయన నివాసంలో దిగ్బంధనం చేసి, తమ వార్తకు ఆయన పత్రి కలో ఇచ్చిన అతి తక్కువ ప్రాధమ్యం గురించి నిలదీశారు.



'మా వార్తను ఆరో పేజీలో ఎందుకు వేశారు? ' అని అడిగాడు ఓ విద్యార్థి.

దానికి గోరాశాస్త్రి ఏం సమాధానం చెబు తారోనని అందరూ చెవులు రిక్కించారు. ఆ యన తన సహజ గంభీర ధోరణిలో 'ఏడో పేజీలో మీ వార్త లేదు గనుకనే దాన్ని ఆరో పేజీలో వేసుకున్నాం' అని జవాబిచ్చారు.

దాంతో ఆ విద్యార్థులంతా హాయిగా నవ్వుకుని, వెళ్లిపోయారు.

ఆయన ఫొటో తెచ్చిపెట్టి పూలమాలలు సమర్పించారు.

ఒక విధంగా చూస్తే నిజమైన ఉద్యమ కారుని జీవితం భౌతికంగా ముగిసిపో యిన తరువాతనే అతని కార్యదక్షతా, త్యాగం జనంలోకి చొచ్చుకుపోయి అతణ్ణి శాశ్వతంగా బతికిస్తాయి. ఆయనకో అమ రత్వాన్ని ఆపాదించి పెడతాయనే వాస్తవం ప్రొ. నందగోపాల్ విషయం లోనూ మరోసారి నిరూపితమయింది.

ప్రొ. నందగోపాల్ అకాల మరణం దేశంలోని ఎన్నో రకాల ప్రజా ఉద్యమా లకు అశనిపాతమైతే కుచేలా కంపెనీకి, ఎం.పి. గంగాజలరావు, మంత్రి నిశ్చింతరా

> ## కొత్తగాలి...
>
> **పిట్టలను**
> **సెల్‌టవర్లు,**
> **తోకలేని పిట్టలను**
> **సెల్‌లూ, చంపేస్తున్నాయి**
>
> *– గుడిమెట్ల గోపాలకృష్ణ,*
> *అరసవిల్లి*

వు లాంటి రాజకీయ నాయకులతో పాటు కొందరు పెట్టుబడిదారులకు అంతులేని సంతోషాన్నిచ్చింది.

ఒకరికి ఖేదం!

ఒకరికి మోదం!

సకలం ఎరిగిన సామాన్యులు మాత్రం బడబాగ్నిలా గంభీరంగా మిన్నకుండి పోయారు.

★ ★ ★

రాత్రి ఎనిమిది గంటల సమయం.

హైదరాబాద్‌లోని ఓ ఖరీదైన హోటల్! నియోన్ లైట్ల వెలుగులో బంగారు పోత బోసిన ఇంద్రభవనంలా మెరిసిపోతోంది.

ఖరీదైన కార్లల్లో వచ్చిన, అతి ఖరీదైన మనుషులకు వంగి వంగి సలామ్‌లు చేస్తు న్నారు గేట్‌బాయ్స్.

ఆ రోజు రాత్రి తొమ్మిది గంటలకు డూప్లెక్స్ సూట్ నెంబర్ తొమ్మిదిలో ఒక సమావేశం జరుగుతోంది.

ఆ సమావేశంలో ఎం.పి. గంగాజలరావు, మంత్రి నిశ్చింతరావులతో పాటు కుచేలా కంపెనీకి చెందిన ముఖ్యమైన వ్యక్తులు నలుగురు కూర్చుని ఏదో విషయం మీద తీవ్రంగా చర్చించుకుంటున్నారు.

వాళ్ళు చర్చల్లో ఉండగానే హైటెక్ ముహూర్తాల సిద్ధాంతి విరాగిశర్మ కాషాయ వస్త్రాల్లో ఏసీకారులో కదిలివచ్చి సమావేశంలో పాలు పంచుకున్నాడు.

"బీల గ్రామాల జనం, ఉద్యమకారులు కూడా ప్రొ. నందగోపాల్ చనిపోయిన దిగ్భ్రమలో ఉండగానే మనం ప్లాంట్ నిర్మాణానికి భూమిపూజ చేసేయాలి. అందుకు మీరో మంచి ముహూర్తం చూసి పెట్టాలి" సిద్ధాంతిని తన పక్కనే కూర్చోబెట్టుకుని అతణ్ణి పిలిపించిన విష యాన్ని వివరించాడు గంగాజలరావు.

"అలాగే అలాగే" అంటూ తన పి.ఎ. దగ్గరున్న ల్యాప్‌టాప్ తీసుకొని కీబోర్డు మీద చేతి వేళ్ళను వేగంగా కదిలిస్తూ ఏవేవో టైప్‌చేసి అర్ధగంట తరువాత ఏసీ రూములోనూ ముఖానికి పట్టిన చిరుచెమ టను మెత్తటి చేతిరుమాలుతో వత్తు కుంటూ "వచ్చే నెలలో నాలుగో శనివారం ఉదయం పదిన్నర గంటలకు మూలా నక్షత్రం నాలుగో పాదంలో దివ్యమైన ముహూర్తం ఉంది" అంటూ కర్మాగారా నికి శంకుస్థాపన ముహూర్తం నిర్ణయిం చిన విరాగిశర్మ ఆ తరువాత భారీ సంభా వనలు పుచ్చుకుని బరువుగా వెళ్ళిపో యాడు.

అనుకున్న ముహూర్తానికి శంకుస్థాపన

జరిపించడానికి కుచేలా కంపెనీ యాజమాన్యం వెంటనే కార్యరంగంలోకి దిగింది. యుద్ధప్రాతిపదికన భూమి పూజకు సంబంధించిన కార్యక్రమాలను మొదలుపెట్టింది.

తేళ్లమెట్టకు దిగువన, సరివి తోటలకు దగ్గర్లో బీలకు ఈశాన్యంగా భూమి పూజకు స్థల నిర్ణయం చేసుకున్న యాజమాన్యం జెసీబీలను, బుల్ డోజర్లను, టిప్పర్లను రప్పించి శంకుస్థాపన స్థలాన్ని చదును చేసే కార్యక్రమాన్ని ఆగమేఘాలపై ప్రారంభించింది.

ఎన్ని వేలమందిలో ఉన్నా సులభంగా గుర్తించేటట్టు నీలం రంగులో మెరిసిపోతున్న యూనిఫాం ధరించిన మూడు వందల యాభై మంది కంపెనీ సెక్యూరిటీ గార్డులు తమ చేతుల్లో లాఠీలు పట్టుకొని సివంగుల్లాంటి కుక్కలతో శంకుస్థాపన కార్యక్రమం నిర్వహించబోయే స్థలం చుట్టూ పహారా తిరగసాగారు.

ఆ స్థలం చుట్టూ పెద్ద పెద్ద షామియానాలు లేపి నిలబెట్టారు.

కంపెనీవాళ్ళ హంగామా చూస్తున్న బీల గ్రామాల ప్రజలంతా ఏదో జరుగబోతోందన్న భావనకు లోనయ్యి అసహనంతోనూ, అశాంతితోనూ పైకి కనిపించని అగ్నిపర్వతాల మాదిరిగా కుతకుత ఉడికిపోసాగారు.

కృష్ణారావు మాష్టారు మిగతా నాయకులు, కార్యకర్తలు, గ్రామస్తులు అందరూ జీవభద్ర శిబిరం దగ్గర చేరి 'ఇప్పుడేం చేయాలి. శంకుస్థాపన కార్యక్రమాన్ని ఎట్లా అడ్డుకోవాలి?' అనుకుంటూ పరిపరి విధాలుగా ఆలోచించసాగారు.

చూస్తుండగానే కంపెనీ భూమి పూజా కార్యక్రమం మూడురోజుల దూరంలోకి వచ్చేసింది.

బీల గ్రామాల్లో ఏ ఊళ్ళో చూసినా పోలీసులు, కంపెనీ సెక్యూరిటి గార్డులతో పాటు ఎవరెవరో కొత్తకొత్త వాళ్ళు కన్పిస్తున్నారు. వాళ్ళెవరో? ఎక్కణ్ణుంచి వచ్చారో? ఎందుకొచ్చారో? ఎవ్వరికీ అర్థం కాని పరిస్థితి నెలకొంది. దాంతోపాటు అక్కడ జరుగుతున్న పనుల్ని చూసి జనం పలువిధాలుగా భయపడసాగారు.

స్థానిక విలేఖర్లతోపాటు ఇంకెవరెవరో కొత్త కొత్త వాళ్లు విలేఖర్లం అంటూ వచ్చి గ్రామాల్లో తిరుగుతూ రకరకాలుగా ప్రశ్నించసాగారు. ప్రజల ప్రతి కదలికలను వీడియోల్లో బంధించి ఎప్పటికప్పుడు తమ న్యూస్ సెంటర్లకు పంపిస్తూ విరామం లేకుండా రయ్యిమని తిరుగుతున్న ఓబీ వ్యాన్లు, పోలీస్ ఫొటోగ్రాఫర్లు, రణగొణ ధ్వనులతోనూ బీల గ్రామాలన్నీ సంతలాగా మారిపోయాయి.

## కొత్తగాలి...

**అయ్యకిత్తురు రూక**
**అమ్మకిత్తురు కోక**
**ఎన్నికల్లో కేక**
**ఓ ఓటరయ్య!!**

*– కిలపర్తి దాలినాయుడు,*
సాలూరు

ముహూర్తం దగ్గరికొస్తున్న కొద్దీ ఆందోళన పెరిగిపోతుండటంతో కృష్ణారావు మాష్టారువాళ్ళు కూడా టూ వీలర్లు వదిలేసి రెండు మూడు టాటా మ్యాజిక్‌లు అద్దెకు తీసుకుని వాటిల్లో ఊరూరా తిరుగుతూ "ఎల్లుండి ఉదయం పదిన్నరకు కంపెనీవాళ్ళు భూమిపూజకు ముహూర్తం పెట్టుకున్నారు. కాబట్టి మనం తొమ్మిది గంటలకల్లా అక్కడికి చేరుకోవాలి. మనం పోలీసుల చేతుల్లో లాఠీదెబ్బలు తిన్నా,



తూటా దెబ్బలు తిన్నా ఫరవాలేదు కానీ, ఏ దశలోనూ తొందరపడవద్దు. ఇప్పటి దాకా ఎంత ప్రశాంతంగా ఉద్యమం నడుపుకొస్తున్నామో అంతే శాంతియుత పద్ధతిలో రేపు కూడా నడుచుకుందాం. శాంతియుతంగానే భూమి పూజను అడ్డుకుందాం" అంటూ అంతిమ యుద్ధానికి ప్రజాసైన్యాన్ని సిద్ధం చేస్తున్న సేనాధిపతుల్లా జనాన్ని జాగృతం చెయ్యసాగారు.

బీల గ్రామాలన్నింటిలోనూ ఎల్లుండి కంపెనీ ముహూర్త సమయంలో ఏదో జరగబోతోందన్న ఆందోళన తీవ్రస్థాయిలో కన్పిస్తుంటే అంతా అదో రకమైన పరధ్యానంలో తమ తమ దైనందిన కార్యక్రమాలు నిర్వహించుకోసాగారు.

రేపు ఉదయమే భూమి పూజ.

బీల గ్రామాల జనం అటు స్వామిపేటకు, ఇటు జీవభద్ర శిబిరానికి మధ్య చీమల బారుల్లా తెంపు లేకుండా వచ్చి పోతున్నారు. తమలో తామే ఏదేదో చర్చించుకుంటున్నారు.

ముహూర్తానికి మూడు రోజుల ముందే వచ్చిన జిల్లాకలెక్టర్, ఎస్పీలు స్వామిపేట ఊరి చివరి ఆర్ అండ్ బి బంగ్లాలో మకాం వేసి వాకీ టాకీలు, సెల్‌ఫోన్‌ల మీద పోలీసులకు ఎప్పటికప్పుడు ఆజ్ఞలు జారీ చేయసాగారు.

వాళ్ళ ఆదేశాల మేరకు మూడువేల మంది పోలీసులు శత్రురాజ్యాన్ని వశబరచుకోబోతున్న సైనికుల మాదిరిగా గ్రామాల్లో వీధి వీధినా కవాతు చేస్తూ, "ఎల్లుండి కంపెనీ తలపెట్టిన భూమి పూజకు గ్రామస్తులెవరూ రాకూడదు. గ్రామాలన్నింటిలోనూ నూటా నలభై నాలుగో సెక్షన్ ఈ రోజు నుండే అమలులోకొస్తుంది. కాబట్టి ఒకరిద్దరి కన్నా ఎక్కువ మంది కలిసి తిరుగకూడదు. సభలు, సమావేశాలు పెట్టకూడదు. ఎవ్వరూ తమ చేతుల్లో చిన్న కర్రపుల్ల కూడా పట్టుకొని తిరుగకూడదు. ఇది కలెక్టర్ గారి ఆదేశం. దీన్ని ఎవరు అధిగమించినా వెంటనే అరెస్ట్ చేసి జైలుకి పంపించడం జరుగుతుంది" అంటూ మెగాఫోన్‌లో హెచ్చరికలు చేస్తూ ఉప్పెనలా ఊళ్లను చుట్టివేస్తూ ప్రజల్లో తీవ్రమైన భయభ్రాంతులను వ్యాపింపజేయసాగారు.

'రేపు ఉదయం జరుగబోయే యుద్ధాన్ని త్వరగా వచ్చి చూద్దాం' అన్నట్లు ఆ రోజుకి పడమటి సూర్యుడు గబగబా జాజ్ రంగు మబ్బుల తలుపులు వేసుకొని పశ్చిమ సంద్రపు ఇంటిలోకి జారుకున్నాడు.




"ఓలమ్మా! ఓలమ్మా! ఏటే!? మీ ఇద్దరికీ దెయ్యంగినా పట్టినాదేటేలమ్మా! జనమంతా బీల దిక్కు ఎలా ఎలబారిపోతుంటే మీరేటిలగ మిట్టమీదకెల్లొస్తున్నారు? "

అప్పుడే వచ్చిన ఆదెమ్మ - పక్కన నిలబడిన సూరా పునివాసిని, ఢిల్లెమ్మలను పలకరించింది.

ఆదెమ్మ మాటలతో పునివాసిని, ఢిల్లెమ్మలిద్దరూ "ఏటి లేదు పాయే బాప్పా" అంటూ జనంతోపాటు ముందుకు కదులుతూ జీడిమామిడి తోటలు, పనస తోటలు, సరుగుడు తోటల గుండా బీలలోకొచ్చి పడ్డారు.

అప్పటికి సరిగ్గా ఉదయం తొమ్మిది

గంటలవుతోంది. అప్పటికే తన బంగారు కిరణాల కళ్లతో ఆకుపచ్చ నేల వంక ఉత్సాహంగా చూస్తూ మేఘాల చెట్ల మీద కూర్చుని ఉన్నాడు ఉదయభానుడు.

బీల గ్రామాల ప్రజలు ఎక్కువ శాతం మంది జీవభద్ర దీక్షాశిబిరాన్ని సందర్శించి అక్కణ్ణుంచి నేరుగా గోర్జన పడి, నల్లమెట్ట పక్కగా భూమిపూజ గురించి కంపెనీ వాళ్ళు వేసిన షామియానాలవైపు సాగిపోతున్నారు.

ఎండమ్మ చేలకు అడ్డంపడి ఎగశ్వాస దిగశ్వాసగా ఉరికొస్తూనే ఉంది. అలా ఉరికొస్తూ... ఉరికొస్తూనే 'అక్కడెలగుందో ఏటో? ఎంత మందొచ్చేసినారో? ఏటి జరగనుందో? ఏటో? ఆఖరికి పానాలైనా ఇడాలగాని, బీలను మాత్రం ఇడొద్దు' అనుకుంటోంది తనలోతానే.

అలా ఆలోచించుకుంటూనే అట్టాడ చిన సూరినాయుడి ఆకుమళ్ళు దాటి, గంటేడ సత్యంనాయుడి పెద్ద గడ్డ మీదుగా రోడ్డెక్కిన ఎండమ్మకు ఎదురుగా చిక్కటి చిరుగడ్డితో నల్లటి ఏనెరాళ్ళతో, శిఖరం మీద ఊడలుదిగి, అర ఎకరం మేర విస్తరించిన మర్రిచెట్టుతో గోవర్ధనగిరిలా నల్లమెట్ట కన్పించింది.

నల్లమెట్టను చూడగానే 'ఇల్లిదిగో! ఈ నల్లమెట్టనెక్కి సూసినమంటె ఇసయమేంటో తెల్సిపోద్ది' అనుకుంటూ చీరను పట్టిలాగుతున్న బలుసు పొదలను, కాళ్ళకు అడ్డుపడుతున్న దుసేరు తీగలను కూడా పట్టించుకోకుండా వడిసేల రాయి మాదిరిగా రివ్వున మెట్ట పైకెక్కసాగింది ఎండమ్మ.

ఓ ఇరవై ఐదు నిమిషాల్లో నల్లమెట్ట పైకెక్కిన ఎండమ్మకు పడమరవైపు దిగువన బీలలో కనిపించిన దృశ్యంతో ఒక్కసారిగా ఒళ్ళంతా అదోరకమైన పులకింత కలిగింది. ఒంటిమీద రోమాలన్నీ నిక్కబొడుచుకున్నాయి. ఉద్వేగపు వెల్లువ ఒకటి ఆమె అంతరంగంలో సుడులు తిరుగుతుండగా అట్లాగే నిలబడి చూడసాగింది.

"ఓలమ్మో! ఓలమ్మో! అంత పరద్దానం ఏటేలమ్మో! ఇందాకట్నుంచి పిల్చి, పిల్చి సాలొచ్చిపోనాదే తల్లీ!" నల్లమెట్ట మీద ఎండమ్మను చూసిన మడ్డు ఢిల్లెమ్మ తనూ పైకొస్తూ గట్టిగా మాట్లాడింది.

"ఏంటేలమ్మీ! ఎండా! నేనిటు మాట్లాడుతున్నా, నువ్వేటే ఏదో ఆలోసిస్తా నడస్తన్నావు? " అంటూ ఆశ్చర్యంతో బుగ్గలు నొక్కుకుంటూ దగ్గరకొచ్చి తన ఎడమ చేతి పిడికిలితో ఎండమ్మ బుగ్గలమీద సుతారంగా పొడిచింది ఢిల్లెమ్మ.

"ఏంలేదు బాప్పా! ఇదంతా సూత్తాఉంటే ఏటవుద్దో, ఏటోనని బయమేస్తా ఉండాదే!" కళ్ళు రెండూ ఆల్చిప్పల మాదిరిగా అల్లల్లన అల్లార్చుకుంటూ అంది ఎండమ్మ.

"ఏటవుతాదే గుంటా! ఈ పొద్దు మనవో, ఆ కంపెనీ వాడో తేలిపోతాదంతే" ఒక నిర్ణయం తరువాత కలిగిన ఆత్మస్థైర్యంతో మాట్లాడింది ఢిల్లెమ్మ, బీలలో పోగవుతున్న జనాన్ని గమనిస్తూ.

"ఔనే బాప్పా! ఆ తాతారావు బావు మన్నెంత మోసం జేశాడో తల్సుకుంటే వల్లు కంపరమెత్తి పోతుందేలప్పా" తాతారావు మీద కసినంతా తన మాటల్లో వ్యక్తం చేస్తూ అంది ఎండమ్మ.

"నేనూ అదే అనుకుంటున్నానమ్మీ!" బదులిచ్చింది ఢిల్లెమ్మ ఎదురుగా వెళుతున్న మనుషుల్లో తనకు తెలిసినవాళ్ళెవరన్నా ఉన్నారేమోనన్నట్టు చూస్తూ.

మొత్తం మీద ఐదారువేలమంది గ్రామస్తులు బీలలోకి వచ్చేశారు. వచ్చిన వాళ్ళంతా నిన్న పోలీసు హెచ్చరికను గుర్తుంచుకున్నట్టుగా చేతుల్లో పూచిక పుల్ల కూడా పట్టుకురాకుండా కట్టుబట్టలతో ఖాళీ చేతులు ఊపుకుంటూ వచ్చారు.

ఉదయం ఎనిమిది గంటలకే అన్ని

ఏర్పాట్లతో నెమళ్లమెట్ట మీదకి చేరుకున్న పోలీసులు ప్రవాహంలా వచ్చిపడుతున్న ప్రజలను చూస్తూనే మెగాఫోన్లు బైటకు తీసి "పోలీసువారి హెచ్చరిక! ప్రజలెవ్వరూ కంపెనీ టెంట్ల పక్కకు వెళ్ళవద్దు. పోలీసు వారి మాట కాదని ఎవరైనా అటువైపు వెళ్ళినట్లయితే ఆ తరువాత జరగబోయే పరిణామాలకు వారే బాధ్యులవుతారు. అంచేత అటువైపు వెళ్ళకండి.. వెనక్కు రండి!" అంటూ పదేపదే అదే పనిగా హెచ్చరించసాగారు.

అయినా పోలీసుల మాటలను ఏమాత్రం ఖాతరు చేయని జనం అటు

> ### కొత్తగాలి...
>
> **చెట్టు కాస్తే**
> **పంట సరుకు**
> **ఎండిపోతే**
> **వంట చెరకు**
>
> – సాధనాల నాగవర్ధని,
> నూజివీడు

నెమళ్లమెట్టనుండి మొదలుపెట్టి ఇటు నల్ల మెట్ట దాకా మధ్యలో ఉన్న తెల్లమెట్టను చుట్టేస్తూ వచ్చి చుట్టూ మానవహారంలా నిల్చున్నారు. ఆ మానవహారాన్ని గమనిం చిన పోలీసు ఉన్నతాధికారులు 'ఏం జరు గుతుందో ఏమిటో?' అని అనుకొంటూ లోలోపల వణికి పోతూనే తమ కిందివా ళ్ళకు ఏవేవో జాగ్రతలు, సూచనలు ఇవ్వ సాగారు.

దాంతో అప్పటిదాకా నెమళ్లమెట్ట మీదనే ఉన్న పోలీసు బలగాలు దేశ సరిహద్దుల కావలవుండే శత్రువుల మీద ప్రయోగించే యుద్ధతంత్రాన్ని సామాన్యుల మీద ప్రయోగించాలన్న అధికారుల ఆదేశాలను తలదాల్చి ఒకరి పక్కన ఒకరుగా ఒక్కో అడుగు ముందుకువేస్తూ, లాఠీలు, సేఫ్‌గా ర్డులు, తుపాకులు ఒడిసి పట్టుకుంటూ జనానికి పై ఎత్తునుండి తమతో పాటు కంపెనీ సెక్యూరిటీ గార్డులను, గార్డుల ముసుగులో ఉన్న ఇతర గూండాలను కలుపుకొని మెల్ల మెల్లగా ప్రజలను చక్ర బంధనంలో ఇరికిస్తూ దగ్గరి దగ్గరికి వత్తుకు రాసాగారు.

పోలీసుల కదలికలను గమనించిన జనానికి వాళ్ళ ఎత్తుగడ ఏమిటో అర్థం అవ్వగానే 'ఓలెమ్మో! అందరం వెనకా ముందూ సూసుకోకుండా ఒకేసారి బీల లోకి చొచ్చుకొచ్చి పోలీసుల ఉచ్చులో చిక్కుకోలేదు కదా! మనం కొంతమంది పోలీసులకు లోపల, మరికొంతమంది పోలీసులకు బయటా ఉన్నట్టయితే వాళ్ళనే మధ్యలో ఇరికించేవాళ్ళం' అనుకున్నారు. అయినా వెంటనే సర్దుకున్న జనం పోలీ సులు చేపట్టిన చర్యకు, ప్రతిచర్యగా ఏదో ఒకటి చెయ్యాలన్న ఆలోచనకు తలుపులు తెరిచారు.

ఇంతలో...

"మగవాళ్ళంతా వెనక్కు తగ్గండి. మేం ఆడవాళ్ళం ముందుకు కదులుతాం. మా ఆడోళ్ళ మీద చెయ్యేస్తే ఏటవుద్దో ఇయ్యాల పోలీసోల్లకు రుచి చూపిస్తాం"

చట్టం ప్రకారం ఆడవాళ్ళ మీద ఆడ పో లీసులే తప్ప, మగ పోలీస్‌లు చెయ్యిచేసు కోరాదన్న విషయం తెలియకపోయినా అప్రయత్నంగా పోలీసుల మెగాఫోన్లను మించి గర్జించి చెప్పింది ఎండమ్మ.

అంతే...

యుద్ధభూమిలో సేనాపతి ఆజ్ఞను శిర సావహించే సిపాయిల మాదిరిగా నిశ్శ బ్దంగా మగవాళ్ళంతా వెనక్కి తగ్గుతుంటే ఆడవాళ్ళంతా మెల్లగా ముందుకు ముం దుకు కదలసాగారు.

జనం ఆ విధమైన ఎత్తుగడ తీసుకోవడంతో అదిరిపోయిన పోలీస్ ఉన్నతాధికారులు ఒక్కక్షణం విస్తుబోయి ఏంచేయాలో అర్థంగాక వెంటనే స్వామిపేట బంగ్లాలో కూర్చున్న కలెక్టర్‌కి, ఎస్పీకి ఫోన్‌చేశారు.

వాళ్ళుకూడా ఫోన్లలోనే ఏవేవో ఆదేశాలు జారీచేశారు.

"బీలలో రోజూ చేపలు పట్టుకొని బతికే ఆడదానికే అంత తెలివి, తెగింపు ఉంటే సంవత్సరాల తరబడి ట్రైనింగ్ తీసుకొని, యూనిఫాం వేసుకున్న మనకెంత తెలివుండాలి! ఆడ, మగ అన్న విచక్షణను కాస్సేపు విడిచిపెట్టండి. లాఠీలు ఝుళిపించండి. లాఠీ దెబ్బలు తిన్న ఏ ఆడది మళ్ళీ ఆర్నెల్ల దాకా మొగుడితో కాపురం చెయ్యగూడదు. లోతొడలు పగిలి పోవాలి. మగడి దగ్గర పడుకోవాలనుకున్నప్పుడల్లా పోలీస్ దెబ్బలు జీవితాంతం గుర్తుకు రావాలి. అందుకు మీరు తొడలతో పాటు, పొత్తి కడుపులను కూడా టార్గెట్ చేసుకొని లాఠీలకు పనిచెప్పండి" జలియన్ వాలాబాగ్ మానవ హననాన్ని సాగించిన ఆంగ్లేయ అధికారైన డయ్యర్ కూడా సిగ్గుతో తలవంచుకునేటంత నికృష్టంగా తన కింది పోలీసులకు ఫోన్ల మీద ఆదేశాలు జారీచేశాడు పోలీస్‌బాస్. బాస్ ఆదేశాలకు పైశాచిక ఆనందంతో రక్తం ఉరకలు వేస్తుంటే పోలీసులు అదే పనిగా బొబ్బరిస్తూ ముందుకు ఉరికారు.

దూరంనుండే పోలీసుల దూకుడు చూసిన జనమంతా ఒక భయవిహ్వలత్వానికి లోనై ఎక్కడి వాళ్ళక్కడ గోడకు కొట్టిన మేకుల్లా నిల్చుండిపోయారు.

ఇదే అదనుగా భావించిన పోలీసులు కట్టు తెంచుకున్న మదపుటేనుగుల్లా పరుగెత్తు కొచ్చి ఆడవారి మీదపడి లాఠీలతో విచ్చలవిడిగా బాదసాగారు.

తగలరాని తావుల్లో లాఠీలు తగులుతుంటే నొప్పితో విలవిల్లాడూతా నీళ్ళలోని చేపల మాదిరిగా ఎగిరెగిరి పడుతూ ఆ స్త్రీలు చేస్తున్న ఆర్తనాదాలతో బీల తల్లి గుండెలు బీటలు వారి పోతుంటే పరిసరాలు హోరెత్తిపోసాగాయి.

అప్పటిదాకా వెనుక వరుసలో నిల్చుని ఉన్న మగవాళ్ళంతా ఒక్కసారిగా ఉలిక్కిపడి హాహాకారాలు చేస్తూ ముందుకు దూసుకొచ్చి ఆడవాళ్ళకు అడ్డుపడ్డారు.

సరిగ్గా అదే సమయంలో సూరా పునివాసినిని చుట్టుముట్టిన నలుగురు కుచేలా కంపెనీ గూండాలు ఆమెను బురదమట్టిలో పడేసి లాఠీలతో చావబాదుతుంటే ఆ దెబ్బలకు తాళలేక "నన్నొగ్గీయండి. నే సచ్చిపోతా బాబోయ్! నన్నొగ్గీయండీ బావూ!" అంటూ రెండు చేతులెత్తి మొక్కుతూ లబ లబలాడుతున్నా ఏమాత్రం కనికరం లేకుండా అలాగే కొట్టసాగారు.

అరవై ఏండ్ల ముసలమ్మను అంత దారుణంగా కొడుతుండడంతో చూడలేకపోయిన ఎండమ్మ కోపంతో ఊగిపోతూ కళ్ళల్లో నుండి నిప్పులు రాలుతుంటే, సిగముడి విడిపోగా, విడివడిన జుట్టు వీపు నిండా జీరాడుతుంటే చీర కుచ్చిళ్ళను మడిచి గోచీ పెట్టుకుంటోంది. అప్పుడు ఆమెను కూడా కొట్టడానికి లాఠీ ఎత్తి వస్తున్న ఓ కుచేలా కంపెనీ గూండా గుండెల మీద తన ఎడమచేతి పిడికిలితో ఓ పిడిగుద్దు గుద్దింది. కుడిచేత్తో వాడి లాఠీని గుంజుకొని, అదే ఊపులో వాడి మోకాళ్ళ చిప్పల మీద లాగిపెట్టి కొట్టింది. ఆ దెబ్బకు నాభి రంధ్రాల్లో నుండి బాధను వెలిగక్కుతూ వాడు 'ధబ్' మంటూ బురదలో కూలిపోయి ఊరపందిలా దొర్లసాగాడు.

కంఠనాళాలు తెగిపోయేలా అరుస్తున్న వాడి అరుపులకు విస్తుబోతూ పునివాసి

నిని కొడుతున్న కుచేలా కంపెనీ గూండాలు ఒక్క నిమిషంపాటు ఏం జరిగిందో అర్థంగాక లాఠీలను గాలిలోనే ఎత్తి పట్టి అయోమయంగా నిలబడి అపరకాళిలా విజృంభిస్తున్న ఎండమ్మ వైపు చూడసాగారు...

"యుద్ధరంగంలో జయాపజయాలు తారుమారవ్వడానికి ఒక్కనిమిషం చాలు" అన్నమాటను నిజం చేస్తూ ఆ కాస్త సమయాన్ని ఒడిసి పట్టుకున్న ఎండమ్మ ఒక్క ఉదుటున పునివాసిని దగ్గరకెళ్ళి వాళ్ళు తేరుకునే లోగానే ఆమె చుట్టూ ఉన్న గూండాల్లో దెబ్బకొకడి చొప్పున నలుగురు గుండాలను నేలకు కర్చుకునేలా, మాడు పెంకులు చిట్లిపోయేలా పడగొట్టింది, వాళ్ళు నలుగురూ పడగలు పగిలిన పాములు నేలనపడి తోకలు ఆడిస్తున్నట్టు కిందపడి కాళ్ళు చేతులు కొట్టుకుంటుంటే పునివాసినిని అమాంతంగా లేపి తన ఎడమ భుజాన వేసుకుని సరుగుడు తోట వైపు పరుగులు తీసింది ఎండమ్మ.

ఎండమ్మ తెగువకు పోలీసులతోపాటు నింగిన సూర్యుడు కూడా విస్తుబోయి ఆమె ముందు ముఖం చెల్లక మబ్బుతెరల మాటుకు తప్పుకున్నాడు.

అప్పటికి ఎనభైశాతం మంది ప్రజలు పోలీసుల లాఠీ దెబ్బలకు తట్టుకోలేక సరుగుడు తోటలోకి పరుగెత్తుకొచ్చారు.

వందలమంది స్త్రీలు లాఠీ దెబ్బలు తిని ఆ దగ్గర్లోనే ఉన్న సముద్రపు హోరును మించి హాహాకారాలు చేస్తూ ఏడుస్తూంటే చూసిన కృష్ణారావు మాష్టారు ఒక్కసారిగా వడ వడ వగడాకులా వణికిపోతూ కన్నీరు పెట్టుకున్నాడు.

మాష్టారు ఏడవడం చూసిన ఎండమ్మ రోహిణీ కార్తెలో చంద్రనిప్పులు చెరిగే మధ్యాహ్నపు సూర్యునిలా మండిపడుతూ "ఏటది మల్లెన్నా! మీరంతా ఏటి సూస్తన్నారు? దేవుడిలాంటి మాస్టుబావు గోడు గోడునేడుస్తుంటే మీకెలాగ కాలు నిలుస్తుంది. ఆ సురినారాయణ మూర్తినాగ ఈ బూమ్మీద సిరంగ సీలగొట్టుకొని ఈడె



వలూ ఉండబోవట్లేదు. బతికే సచ్చే తను వులకు మనిసైపుట్నంక కుస్సింత రోస ముండాల. ఈ బీల బోయినంక మన మింక బతికేట్నాబం? బీల ఉండడమో, మనం సావడమో ఇయ్యాల్టితో తేలిపో వాల నడండి? " అంటూ మల్లీశ్వర్, రాజ శేఖర్ వాళ్ళనుద్దేశించి పిడుగులు రాలుతు న్నట్టు మాట్లాడుతూనే సరుగుడు తోట లోపలికెళ్ళి ఫట్ మంటూ పచ్చి సరుగుడు కర్రను విరిచి పట్టుకొని రుద్రకాళిలా పోలీ సులకు ఎదురు నడిచింది.

అంతే!

కళింగ కొండల్లో రోహిణీ కార్తె ఎండ లకు కార్చిచ్చు పుట్టినట్టు ఎండమ్మను ఆ తీరును చూసిన జనం గుండెల్లో నిప్పు రా జుకుంది.

"ఈ పోలీసులతో పెట్టుకోవడం తమ వల్లనౌతుందా? " అన్న సందిగ్ధపు ఆనక ట్టకు ప్రళయకావేరి వెల్లువ మాదిరిగా అంతటితో బద్దలు కొట్టిన జనం "హరోం హర హర" అంటూ దక్షయజ్ఞ విధ్వంసా నికి సాగే ప్రమథ గణాల్లా ముందుకు దూకారు.

సరుగుడు తోట మొత్తం జనం చేతుల్లో



యాదవ వంశాన్ని నిర్మూలనం గావించిన ముసలం నుండి పుట్టిన జమ్ముతీరుగా మహా ఆయుధాలుగా మారిపోయింది.

మబ్బు విడిచిన ఎండను, గట్టుతెగిన ఏటినీ అడ్డుకునేదెవ్వరు?

సామాన్యులు సహనాన్ని కోల్పోయి చండప్రచండంగా చెలరేగితే ఎదుర్కొనే మొనగాళ్ళెవ్వరు?

పోటెత్తిన జనసంద్రం బడబాగ్నికి ముందుగా ఎర్రైపోయింది పోలీసులు కాదు, కంపెనీ గూండాలు అంతకన్నా కాదు, ఎవరు మరి?

ప్రలోభాలకు లొంగిపోయి ఎవరైతే ప్రజా వ్యతిరేకులుగా మారారో ఆ ఇద్దరు పత్రికా విలేఖరులు.

ఆ తర్వాత-

కనీవినీ ఎరుగని ఓ అసాధారణ సంఘటన కళ్ళముందు కన్పించడంతో చేష్టలు డిగి నిలబడిపోయిన పోలీసులు, పూర్తిగా తేరుకోక ముందే రేచుకుక్కల్లా వాళ్ళను చుట్టిముట్టిన జనం ఒక్కో పోలీసును బీల బురదలో రెక్కలు ఊడేసిన శనగ పిట్టలను ఉరికించినట్టు ఉరికించి ఉరికించి పట్టుకొని చితక్కొట్టి తుంగగడ్డి అంపశయ్యపై వరుసగా పడుకోబెట్టసాగారు.

"అమ్మో! ఇక్కడి జనం దెబ్బకు విలేఖర్లకు, పోలీసులకే దిక్కులేదు. ఇంక మనమో లెక్కా?" అనుకున్న కంపెనీ సెక్యూరిటీ గార్డులు బీల బురదలో ఎందుకు కొరగానివిగా మారిపోయిన కుక్కలను వెంటబెట్టుకొని పత్తాలేకుండా ఎప్పుడో పారిపోయారు.

తమ ఆయుధాలు, తమ పోలీసు బలగాలు తమ కళ్ళముందే ఎందుకూ కొరగాక కుప్పగూలి పోతుంటే విస్తుబోతూ చూసిన, డి.యస్పీ వెంటనే తేరుకుని జనం మీదికి టియర్ గ్యాస్ బాంబింగ్‌ను చేయించాడు.

పొగబాంబుల దెబ్బకు సూదులు గుచ్చినట్టుగా కళ్లు మండిపోయి మూతలు పడుతుంటే ఎదురుగా ఉన్నది పోలీసులో? తమవాళ్లో కూడా అర్థంగాక పోవడంతో కంగారుపడిన జనం ఒక్కసారిగా వెనక్కి తగ్గి దూరంగా మళ్లీ సరుగుడు తోటల్లోకి పరుగులు తీశారు.




దాదాపు రెండు గంటలపాటు అక్కడ నెమళ్లమెట్ట వైపుగా పోలీసులు- కుచేలా కంపెనీ గూండాలు, ఇటూ సరుగుడు తోటవైపు బీల గ్రామాల జనం దెబ్బలు తగిలిన వాళ్లను ఓదార్చుకుంటూ, ఎదుటి వాళ్లను ఎట్లా దెబ్బకొట్టాలా అని బుర్రలకు పదును పెట్టుకుంటూ ఉప్పెన ముందటి సముద్రంలా ఎవరికివాళ్లు నిశ్శబ్దమైపోయారు.

ఆకాశంలో అప్పుడప్పుడే పడమర దిక్కుకు పయనం గట్టిన సప్తాశ్వసమారూఢుడు ఆ ఉత్కంఠను భరించలేక మబ్బుల లోగిలి నుండి బయటికొచ్చి కిరణాల కన్నులతో ఏం జరుగబోతుందోనన్నట్టు తీక్షణంగా చూడసాగాడు.

పొగబాంబుల మేఘాల వెనుక ఏం జరుగుతుందోనన్న ఉత్కంఠతతో ఎదురు చూస్తున్న పోలీసులు పొగ పూర్తిగా తగ్గిపోయే సరికి ఎదురుగా కన్పించిన దృశ్యం చూసి అవాక్కయ్యారు. ఒక్కసారిగా చేష్ట

లుడిగి బొమ్మల్లా నిల్చుండిపోయారు.

అక్కడ!

ఆ పొగ మేఘాల వెనుక..

భూమి పూజ కోసం ఏర్పాటుచేసిన షామియానాలు మొత్తం దసరా ఉత్సవాల్లో ఏర్పాటుచేసిన రావణాసురుని కొయ్యబొమ్మల్లా కాలి కూలిపోతున్నాయి.

ఆ రీతిన కూలిపోతున్న షామియానాలను, కాలి పేలిపోతున్న కంపెనీ వాహనాలను చూసిన పోలీసుపెద్దలు "మనం ఇంతమందిమి ఉండికూడా నిరాయుధులైన జనం చేతుల్లో నుండి కంపెనీ ఆస్తులను కాపాడలేకపోవడం మనకు సిగ్గుచేటు. అంతేకాదు దీనివల్ల ప్రభుత్వం కూడా తలదించుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది" అనుకుంటూ కలెక్టర్, ఎస్పీలకు తమకు ఫైరింగ్ ఆర్డర్లు కావాలంటూ నెమళ్లమెట్ట మీద నుండి ఫోన్లు చేశారు.

దానికి వాళ్లు "జరిగిన నష్టం చాలు, ఇంకా అటువంటి పన్లేం చేయకండి" అంటూ గట్టిగా మందలించారు.

అటు కంపెనీ ఆస్తులను కాపాడలేకపోయామన్న కోపంతోనూ, ఇటు ఉన్నతాధికారులతో చివాట్లు తినవల్సి వచ్చిందన్న దుగ్ధతోనూ, కాలిపోతున్న షామియానాల దగ్గర మిగిలివున్న జనాలను చావ చితగొట్టండంటూ నెమళ్లమెట్టమీద ఉన్న డిఎస్పీ పోలీసులను జనం మీదికి ఉసిగొల్పాడు.

అప్పటిదాకా తమ కళ్ల ముందే అరవై, డెబ్బై మంది తమ తోటి జవాన్లు జనం చేతుల్లో చావు దెబ్బలు తిని బీల గడ్డిలో శవాలా మాదిరిగా పడి ఉండడంతో తమ పోలీసు అహం మీద బలమైన దెబ్బ తగిలినట్టుగా అప్పటికే కుత కుత ఉడికిపోతున్న పోలీసులకు బాస్ అనుమతి లభించడంతో వాళ్లంతా పలుపులు తెంపుకున్న విత్తనపు దున్నల్లా లాఠీలు ఝుళిపిస్తూ జనంమీదికి పరుగులు తీశారు.

తమ మీదికి దూసుకు వస్తున్న పోలీసులను గమనించిన జనం కూడా ఏదో సామూహిక శక్తి తమను ఆవహించినట్టుగా పోలీసులకు ఎదురు ఉరికి ద్వంద్వ యుద్ధానికి సిద్ధపడ్డారు.

ఉదయం నుండి వేలాదిమంది తొక్కిడితో బీల నేలంతా కదిలిపోయి బురద బురదగా మారి మోకాళ్లలోతుకు దిగబడిపోయింది. ఆ బురదలో పోలీసులంతా ఎత్తుబడ్డ ముసలెద్దుల మాదిరిగా కూరుకుపోయి పీక్కోలేక పోతున్నారు.

పుట్టినప్పటి నుండి బీలలో తిరగాడుతూ పెరిగిన ఆ పల్లె జనం బురదలో మట్టగిడసల్లా సర్రున దూసుకుపోతూ బురదనే కారప్పొడిలా చేసుకొని పోలీసుల కళ్లల్లోకి విరజిమ్ముతూ సరుగుడు కర్రలను తిరగెయ్యసాగారు. దాంతో ఒక్కొక్క పోలీసూ బురదలో పడి తపా తపా కొట్టుకుంటూ పైకి లేవలేక అందులోనే దొర్లాడారు.

సిసలైన ప్రజా సైనికుల అసలైన గెరిల్లా పోరాటం ఎలా ఉంటుందో తెలిసివచ్చిన పోలీసులు ఉద్యమకారుల దాడికి చిత్తైపోసాగారు. ప్రజా గెరిల్లా పోరాటానికి ప్రత్యేకమైన యుద్ధతంత్రంగాని, అధునాతనమైన ఆయుధ సంపత్తి అవసరంగానీ ఉండనే ఉండదు. అప్పటికప్పుడు యుద్ధ పరిసరాల్లో లభించే ప్రాకృతిక వనరులనే ఆయుధాలుగా మార్చుకొని గెరిల్లా యోధులు యుద్ధాన్ని కొనసాగిస్తారు. ఎంత బలమైన శత్రువునైనా ముప్పుతిప్పలు పెడతారు. మూడు చెరువుల నీళ్లు తాగిస్తారు.

ఇప్పుడు బీలలో జరుగుతున్నది కూడా సరిగ్గా అలాంటి ప్రజాగెరిల్లా పోరాటమే. అందుకే సహజంగా అక్కడ ప్రజలదే పై చేయి అయ్యింది.

ఎందుకంటే బతుకే ప్రశ్నార్థకమైన సామాన్యులకు, బతుకు తెరువుకోసం పని చేస్తున్న జీతం రాయుళ్లకు మధ్య అంచనా

లకు అందనంత వ్యత్యాసం ఉంటుంది.

ఊపిరి పీల్చుకోవడానికి కూడా అవకాశం ఇవ్వకుండా చాకిరేవు పెడుతున్న జనం దెబ్బలకు పోలీసులు కకావికలైపోయి మళ్లీ నెమళ్లమెట్ట మీదికి పరుగులు తీశారు.

తమ నిస్సహాయతను అర్థం చేసుకున్న పోలీసు అధికారులు వెంటనే వంటి మీది బనీన్లు విప్పి తెల్లజెండాల మాదిరిగా గాలిలోకి ఎగిరేస్తూ "శాంతి శాంతి" అంటూ శాంతి మంత్రాన్ని పఠించారు.

పోలీసుల చేతలను, మాటలను విన్న కృష్ణారావు మాష్టారు రాజశేఖర్, మల్లీశ్వర్ల వంక చూస్తూ "శాంతి శాంతి అంటూ తెల్లజెండాలు ఎత్తుతున్న వాళ్లతో ఇంకేం యుద్ధం చేస్తాం? మన వాళ్లందరినీ వెనక్కి తీసుకురండి" అన్నాడు. ఓ పక్క క్షమాగుణం పొంగులు వారుతుంటే, మరో పక్క జరగబోయే పరిణామాలు ఎలా ఉంటాయో ఆలోచిస్తూ అన్నారాయన.

మల్లీశ్వర్ వాళ్లు షామియానాల దగ్గరకి వెళ్లేసరికి నలుగురైదుగురు గ్రామస్తులు స్వామిపేట ఎస్సైని చుట్టుముట్టి కర్రలతో కుళ్లబొడుస్తూంటే తట్టుకోలేక ఆ బురదలో కొంతదూరం పరుగెత్తుకెళ్లి జర్రున జారి పడిపోయాడు.

అదే అదనుగా భావించిన గ్రామస్తులు మళ్లీ పరుగెత్తి పాతర గుంటలో పడిపోయిన పిచ్చికుక్కను చుట్టుముట్టినట్టు అతణ్ణి చుట్టుముట్టి కర్రలతో పొడవబోతున్నారు. వేగంగా పరుగెత్తుకొచ్చిన మల్లీశ్వర్, సుందరరావు మాష్టారు జనానికి అడ్డుపడి ఆపుజేసే సరికి మిగతా నాయకులు కూడా వచ్చి చేరుకున్నారు.

అందరూ కలిసి కింద పడ్డ ఎస్సైని చేతుల మీద ఎత్తుకుని తీసుకుపోయి నెమళ్లమెట్ట మీద ఉన్న అతని బలగానికి అప్పగించి వచ్చారు.

అంతటితో జనం కోపం వెల్లువ తీసినట్టు మెలమెల్లగా తగ్గిపోవడంతో అంతా కలిసి వెళ్ళి మళ్లీ సరుగుడు తోటలో సమావేశమై జరిగిన సంఘటనలను సమీక్షించుకోసాగారు.

"మనం ఇప్పటిదాకా శాంతియుతంగా రకరకాల పద్ధతుల్లో ఉద్యమం చేసుకుంటూ వచ్చింది కాస్తా ఈ రోజుతో ముగిసిపోయింది. ఇక ముందు జరగబోయే ఉద్యమం ఇంకా కొత్త ఎత్తుగడలతో నడవబోతున్నది, అంటే మన ప్రజా ఉద్యమం తొలిదశను దాటి మలిదశ ఉద్యమంగా మారబోతుందన్న మాట. కాబట్టి మనం మరింత జాగ్రత్తగా మసలుకోవాల్సిన అవసరం ఉంది. మన సహనమే మనకు విజయాన్ని సాధించి పెడుతుందన్న సహజ సామాజిక సూత్రాన్ని ఎవ్వరూ మరచిపోకూడదు.

ఈ రోజు మనమిక్కడ ఇంతమంది పోలీసులపై, కంపెనీ గూండాలపై పైచేయి సాధించామంటే అందుకు కారణం ఒకే ఒక వ్యక్తి. ఆ వ్యక్తి ఎండమ్మ. మనలో ఇంత కదలిక రావడానికి ఆమె చూపించిన తెగువకూ, ధైర్యానికి నేను ఆమెను మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను.

'సామాన్యులే చరిత్ర సృష్టికర్తలు' అన్న మహానుభావుల మాటలను ఇప్పటివరకూ విన్నాం, చదువుకున్నాం. కానీ ఈ రోజు మన ఎండమ్మ ద్వారా ఆ సత్యాన్ని ప్రత్యక్షంగా అనుభవంలోకి తెచ్చుకున్నాం. ఇది ఏ కొందరికో గాని దొరకని అదృష్టం.

ఏది ఏమైనా పోలీసులు ఇప్పటికి వెనక్కి తగ్గినా ముందు ముందు మన మీద కక్ష కడతారు. పెద్ద ఎత్తున దాడిచేస్తారు. రకరకాల కేసుల్లో మనల్ని ఇరికిస్తారు. మనలో మనకు పార్టీల పేర, కులాల పేర, మతాల పేర కలతలు సృష్టి

స్తారు. ఒకరి మీద ఒకరికి నమ్మకం కోల్పోయేలా చేస్తారు. అందుకే మన మంతా చాలా మెలకువతో నడుచుకోవాల్సి ఉంటుంది" అంటూ అందరినీ హెచ్చరించారు కృష్ణారావు మాష్టారు.

ఆ వెంటనే పోలీసుల దాడిలో కాళ్ళూ చేతులూ విరిగినవాళ్ళనూ, దెబ్బలు తగిలిన వాళ్ళనూ టాటా మ్యాజికుల్లోకి ఎక్కించి గవర్నమెంట్ హాస్పిటల్లో చేర్పించడానికి తీసుకుపోయారు రాజశేఖర్ వాళ్ళు.

ఆ తరువాత...

జరిగిన సంఘటనల మీద ముఖ్యంగా ఎండమ్మ ధైర్యం మీద రకరకాలుగా చర్చించుకుంటూ తూర్పు దిక్కు బీల గ్రామాల జనం మొత్తం పనస తోటల గుండా నల్ల మెట్ట పక్క గోర్జన బడి ఇండ్లకు బయలు దేరారు.

ఇక అటు పడమర దిక్కున ఉన్న విలాసపురం, తిక్కవరం గ్రామస్తులు కూడా మాట్లాడుకుంటూ ఇండ్లకు మళ్ళారు.

బయ్యి బయ్యిన హారన్లు మోగించుకుంటూ వచ్చిన అంబులెన్స్‌లు దెబ్బలు తగిలిన పోలీసులందరినీ ఎక్కించుకుని ఏరియా హాస్పిటల్ కి బయలుదేరి వెళ్ళిపోయాయి.

ఎక్కడివాళ్ళను అక్కడికి పంపించిన స్థానిక ఎస్సై జరిగిపోయిన యుద్ధానికి సాక్షిగా కాలిపోయిన కంపెనీ వాహనాలు, షామియానాల నుండి పొగలింకా వస్తూనే ఉండడంతో వాటిని, తన గాయాలను తిరిగి తిరిగి చూసుకుంటూ పరపర పండ్లు కొరుక్కుంటూ జీపెక్కాడు.

జీప్‌లో పోతూ పోతూ 'నా పి.యస్. పరిధిలో ఇటు నాకు, నా పోలీసులకూ, అటు మాకు అనుకూలురైన కొందరు విలేఖర్లకూ రాష్ట్ర చరిత్రలోనే మునుపెన్నడూ ఎక్కడా జరగనంత పరాభవం ఇక్కడ, ఈ రోజున జరిగింది. రేపు నేను నా బాసుల ముందు తలవంచుకు నిలవాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఇంకొక్క నెలరోజుల్లో సి.ఐ.గా ప్రమోషన్ తీసుకోవాల్సినవాణ్ణి కాస్తా, రివర్షన్ తీసుకోవాల్సి వస్తుందో? లేదంటే అసలు మొత్తానికే జాబ్ నుండి టెర్మినేటే ఔతానో? తెలియదు.

ఏదో ఒక పనిష్మెంట్ తీసుకోక తప్పదు. పనిష్మెంట్ ఎట్లాగూ తప్పనప్పుడు ఏదో ఒకటి చేసి తీసుకున్నా మనసుకు కొంత శాంతన్నా లభిస్తుంది. అందుకేదో ఒకటి చెయ్యాలి. సమయం కూడా అట్టే లేదు. ఏం చెయ్యాలి? ఏం చెయ్యాలి?' తను కూర్చున్న జీప్ కన్నా వేగంగా అతని తలలో ఆలోచనలు పరుగులు తియ్యసాగాయి.

కంపెనీవాడి శంకుస్థాపన ప్రయత్నాన్ని వమ్ముచేసి విజయవంతంగా వెనుదిరిగిన ప్రజలను చూస్తుంటే ఎస్సై కళ్ళల్లో క్రౌర్యం మోదుగు పూలు పూయించింది.

చివరికి అతని ఆలోచనల్లో ఒక నిర్ణయం తీసుకోవడం జరిగిపోయింది. దాంతో అతను 'ఔరా! రాచపీనుగు ఎప్పుడూ ఒంటరిగా పోదన్నట్టు, నేను ఇంటికి పోవడమో లేదా పనిష్మెంట్ తీసుకోవడమో ఖాయమన్నప్పుడు పోతూ

## కొత్తగాలి...



మాట వినపడనివాడు
చెవిటి వాడే
మంచి మాట వినిపించుకోని వాడో
నిజమైన చెవిటి వాడు

– బిక్కునూరి రాజేశ్వర్,
పొన్కల్

పోతూ ఒకరిద్దరినన్నా ఈ లోకం నుంచే పంపించిగానీ పనిష్మెంట్ తీసుకోకూడదు. ఏంచేసినా నాకింత కంటే పోయేదేమి లేదు' ఆ బలహీన క్షణాల్లో ఒక ఆత్మన్యూనతా భావానికి లోనైన ఎస్సై సైకిక్‌గా మారిపోయి పరిపరివిధాల ఆలోచనలు చేసి చేసి, విచక్షణను కోల్పోయాడు. దాంతో ఓ దుర్మార్గమైన నిర్ణయం తీసుకుని, నడుముకున్న పిస్టల్‌ని చేతిలోకి తీసుకుని ముందుకు పరికించి చూశాడు.

అదే సమయంలో విలాసపురం గ్రామస్తుడు జున్ను భీమారావు కనిపించాడు. అతనికి నలభై ఆరేళ్ళు. భార్య ఇద్దరు పిల్లలతో తన పనేమో, తానేమో తప్ప అన్యం ఎరుగని వాడు. ఎవ్వరికీ ఏ అపకారమూ చేయనివాడు. 'అందరితోపాటే నేనూ' అనుకొని వచ్చినవాడు. జరిగిన ఒక్కో సంఘటననూ తలపోసుకుంటూ అందరి కంటే వెనుక మెల్లగా ఇంటికి మరలిన వాడు, 'ఆకలి బాగా అవుతోంది, ఇంటికెళ్లి తినాల' అనుకుంటూ రోడ్డునపడి ఊరు దిక్కు సాగిపోతున్నవాడు, మరు నిమిషంలో ఏమి జరుగనుందో ఎరుగనివాడు. ఆ క్షణంలో దుర్మార్గపు ఆలోచనలో ఉన్న ఎస్సై కంట పడ్డాడు.

తన వెనుక ఏదో వాహనం వస్తున్న శబ్దం విన్పించడంతో ఎందుకైనా మంచిదనుకుని రోడ్డు దిగి ముందుకు నడుస్తూనే ఉన్నాడు. వస్తున్న వాహనంలో నుండి ఏవో మాటలు వినిపిస్తుండడంతో 'ఎవరబ్బా!' అనుకుంటూ వెనుదిరగ బోయేంతలోనే తన దగ్గరకొచ్చిన జీపులో కూర్చున్న ఎస్సై చేతిలోని రివాల్వర్ నిప్పులు చిమ్మింది.

జరుగుతున్నదేంటో అర్థం కాక ముందే రివాల్వర్ నుండి దూసుకొచ్చిన బుల్లెట్ 'టప్'మంటూ కుడిచెవి వెనుకభాగం నుండి తలలోకి దూరిపోవడంతో నిశ్శబ్దంగా కుప్పకూలిపోయాడు భీమారావు.

అట్లా అమానుషంగా భీమారావును పొట్టనబెట్టుకున్న ఎస్సై మరికొంచెం ముందుకెళ్ళి బీల వైపు చూశాడు.

మోకాటిలోతు బీల గడ్డిలో నుండి రోడ్డు ఎక్కుదామని వస్తున్న తిక్కవరం గోగిని రామ్మూర్తి... రివాల్వర్ మోగడం, ఆ వెంటనే ఓ మనిషి కుప్పకూలడం, అది చూసిన కొంతమంది జనం పడిపోయిన మనిషివైపు అరుచుకుంటూ పరుగెత్తుకురావడం గమనించి 'ఏదో జరిగిందిరా బావూ!' అనుకుంటూ మరింత వేగంగా రోడ్డు వైపుకొస్తున్నాడు.

అంతలోనే పోలీసు జీపు తనకు ఎదురుగా వచ్చి ఆగడం చూసిన రామ్మూర్తి 'ఏటిది? పోలీసు జీపు నా దగ్గరకొచ్చి ఆగుతోందేటి?' భయం భయంగా అనుకుంటూ మెల్లగా రోడ్డు దిక్కు అడుగులేస్తుండగానే ఆగిన జీపులోని ఎస్సై చేతిలోని రివాల్వర్ 'ధన్ ధన్' మంటూ రెండుసార్లు నిప్పులు చిమ్మింది. ఆశ్చర్యంగా కళ్ళు విప్పార్చి చూస్తున్న రామ్మూర్తి గుండెల్లో నుండి రెండు రివాల్వర్ గుండ్లు సూటిగా దూసుకుపోయాయి.

తనకు జరిగిందేమిటో అతని మెదడు గ్రహించే లోపుగా మరికొంచెం దూరం ముందుకురికి బీలలోనే బొక్కబోర్లా నేలకొరిగాడు రామ్మూర్తి.

ఆ పాటికే భీమారావు దగ్గరికి పరుగెత్తుకొచ్చిన జనం కళ్ళ ఎదుటే మరో మనిషి కుప్పకూలడం చూసి తట్టుకోలేక పెడబొబ్బలు పెడుతూ పోలీస్ జీపువైపు పరుగులు పెట్టారు.

ఆ జనం జీపు దాకా వస్తే జరిగేదేమిటో తెలిసిన ఎస్సై ఒక్కసారిగా రివాల్వర్‌ను గాలిలోకి తిప్పి కాల్పులు జరిపాడు. రివాల్వర్ మోతతో ఒక్కసారిగా భయభ్రాంతులకు లోనైన జనం పులిని చూసిన మేకల్లా

ఠక్కున ఆగిపోయారు. అదే అదునుగా భావించిన ఎస్సై జీపును ముందుకు దూకించాడు. ఎప్పుడైతే జీపు ముందుకు కదిలిందో అప్పుడు జనంలో మళ్ళీ చైతన్యం వచ్చి కేకలు పెడ్తూ జీపువైపు దూసుకు రాసాగారు.

కానీ, ఆ సరికే జీపు వేగం పుంజుకుంది. చూస్తుండగానే పొగలు చిమ్ముతూ గాలితో పందెం వేస్తున్నట్టుగా దుమ్ము లేపుకుంటూ వెళ్ళిపోయింది.

అంతటితో తాత్కాలికంగా జీపు విష యాన్ని పక్కన పెట్టిన జనం రక్తపు మడు గులో పడి ప్రాణాలు కోల్పోయిన రామ్మూర్తి శవం చుట్టూ మూగారు.




"ఛీ ఛీ ఛీ! పాడు కుక్కలు ఏటిది? పొద్దున్నుండి ఓ అదే పనిగా మోరలు పైకెత్తి ఇంటి ముందర చేరి గుండెలవిసి పోయేలా ఏడుత్తున్నాయ్. తనెప్పుడో పొద్దున్న ఇంత పెరుగన్నం తిని వద్దు, వద్దంటున్నా విన్పించుకోకుండా బీల దగ్గ రికి పారెల్లినాడు. అక్కడేటి జరుగుతు న్నాదో ఏటో?" వీధి కుళాయి నీళ్ళు మోసుకొచ్చి గోలేంలో పోసుకుంటూ భీ మారావు భార్య సుగుణమ్మ తన్లో తనే మాట్లాడుకుంటోంది. ఎంత కొడుతున్నా అటుపోయినట్టే పోయి మళ్ళీ వచ్చి ఇంటి వైపు చూస్తూ ఏడుస్తున్న కుక్కలను చూసి బెదిరిపోతూ భర్త రాకకోసం వీధివంక చూడసాగింది సుగుణమ్మ.

సుగుణమ్మకు నలభై ఏండ్లుంటాయి. చూడ్డానికి మనిషి కొంచెం సన్నగా, ఛాయ తక్కువతో, నుదుటన కాసంత బొట్టుతో, ముక్కుకు బేసరి, కాళ్ళకు వెండి కడి యాలు, చేతుల్నిండుగా తొడుక్కున్న మట్టి గాజులతో వంటి మీద కనకాంబరపు రంగు నేత చీరతో అదే రంగు జాకెట్‌తో పటంలోని అమ్మోరుకి తోడబుట్టిన చెల్లిలా ఉంటుంది.

ఇంతలో గవర్నమెంట్ హైస్కూల్లో పదో తరగతి చదువుతున్న సుగుణమ్మ, కొడుకు సూరిబాబు సైకిలేసుకుని స్కూల్ నుండి ఇంటికొచ్చాడు.

వాణ్ణి చూడ్డంతోటే "ఓరే బావూ! మీ బాపు పొద్దునెప్పుడో బీల దగ్గరికెల్నాడు. అక్కడేటైందో ఏటో తెలకున్నాది. ఇటు సూస్తే ఈధిలోని బేకులన్నీ పిలిచినట్టే వచ్చి ఇంటి ముందున నిలబడి మోరలెత్తి ఏడుస్తున్నాయి. బేకులు ఇంటి ముందు కొచ్చి ఏడ్డం అరిష్టంరా నాయినా! ఏటవు తుందో ఏటో? నాకంతా బయ్యింగు న్నాది. నువ్వా బైస్కిల్ ఏసుకొని బేగెల్లి మీ బాపు యాడున్నాడో పిల్చుకురా, ఫో" అంటూ కొడుకుని పురమాయించింది సుగుణమ్మ.

పుస్తకాలు ఇంట్లో పడేసి సైకిలెక్కిన సూరిబాబు తూనీగ మాదిరిగా రయ్యి మంటూ బీల దిక్కుకేసి సాగిపోయాడు.

కొంతదూరం పోయే సరికి రోడ్డు మీద దూరంగా రెండుచోట్ల జనం గుంపులుగా, గుంపులుగా కన్పించే సరికి 'ఏటో అల్లక్కడ జనమంతా పోగడిపోనారు, ఏటైందో ఏటో?' అనుకుంటూ మరింత వేగంగా సైకిల్ తొక్కసాగాడు సూరిబాబు.

సూరిబాబు మరో ఫర్లాంగు దూరం వెళ్ళేసరికి అటువైపు నుండి ఊరిదిక్కుకు

ఎవరో కొత్తవాళ్ళు కొందరు వస్తూ కన్పిం చడంతో "ఏటక్కడ? ఏటైనాది శానా మంది జనం నిలబడి పోనారేటి?" అంటూ వాళ్లను ప్రశ్నించాడు.

"ఎవులో ఇద్దరు మనుసుల్ని పోలీసులు కాల్చేసి పోనారట. ఆలిద్దరూ స్పాట్లో సచ్చి పోనారు బావూ! అదే సూస్తున్నారు" ఆగ కుండా చెబుతూనే వెళ్ళిపోయారు వాళ్ళు.

ఆకాశంలో సూరిబాబు నెత్తి మీదుగా తీతువు పక్షులు రెండు పడమర దిక్కు నుండి దక్షిణ దిక్కుగా అరుచుకుంటూ సాగిపోయాయి.

'ఓలమ్మో! పోలీసు కాల్పులా?' అను కున్న సూరిబాబు, 'చచ్చిపోయిందెవరో ఏటోపాపం! చూద్దాం' అనుకుంటూ మరింత వేగంగా సైకిల్ తొక్కసాగాడు.

రోడ్డుమీద మొదటి గుంపుకు కాస్త ఎడంగా రోడ్డు పక్కగా సైకిల్ దిగి, తాళ మేసుకొని గబగబా జనం దగ్గరికి నడు స్తున్న సూరిబాబును చూసిన వాళ్ళ పక్కింటి సిరికి నాయుడు ఎదురొచ్చి "మీ కొంప మునిగి పోనాదిరా సూరిబాబూ!" అంటూ పిల్లవాణ్ణి గట్టిగా పట్టుకొని బావు రుమన్నాడు.

ఏదో జరిగిపోయిందని అర్థమవుతుంటే అప్రయత్నంగా సిరికి నాయుణ్ణి కౌగిలించు కుంటూ తనూ పెద్దగా ఏడవసాగాడు సూరిబాబు.

ఏడుస్తున్న వాళ్ళిద్దరి వంకా చూసిన జనం 'కొడుకొచ్చాడు, కొడుకొచ్చాడు' గుస గుసగా అనుకుంటూ పక్కకు తప్పుకొని దారిచ్చారు అక్కడ గుమిగూడిన జనం.

ఛిద్రమైన తండ్రి తలను, రోడ్డు మీద పేరుకుపోయిన రక్తాన్ని చూసే సరికి ఒక్కసారిగా భయపడిపోయిన సూరిబాబు "బావూ!" అంటూ కుప్పకూలిపోయాడు.

అక్కడున్న జనమంతా ఆ దృశ్యాన్ని చూసి వాళ్ళల్లో వాళ్ళే పొగిలి పొగిలి ఏడు స్తుంటే, కొంతమంది సూరిబాబు ముఖం మీద నీళ్ళు చిలకరించి, గాలి తగిలేలా అందరినీ దూరంగా జరిపారు.

ఓ పావుగంట తరువాత మెల్లగా లేచి కూర్చుని మళ్ళీ పెద్దగా ఏడవసాగాడు సూరిబాబు.

జరిగిన విషయం సెల్‌ఫోన్ల ద్వారా బీల గ్రామాలన్నింటిలోనూ తెలిసిపోవ డంతో ఇండ్లకు పోయినవాళ్ళంతా కాళ్ళ మీద నీళ్ళు కూడా చల్లుకోకుండా వెంటనే మళ్ళీ వెనుదిరిగి పరుగెత్తుకొచ్చారు.

హాస్పిటల్ దగ్గరున్న కృష్ణారావు మాష్టారువాళ్ళకు విషయం తెలియగానే హుటాహుటిన సంఘటనా స్థలానికి చేరు కున్నారు.

మాష్టారు కనబడగానే అప్పటిదాకా అణుచుకున్న ఉద్వేగపు ఉద్ధృతికి కట్ట తెగి పోయినట్టుగా జనం మొత్తం ఒక్కసారిగా - 'పోలీసుల హత్యాకాండను నిరసించాలి'

'అమాయకుల ప్రాణాలను బలి తీసు కున్న ఎస్సైని వెంటనే సస్పెండ్ చేయాలి'

'తక్షణమే న్యాయ విచారణ జరిపించి, మృతుల కుటుంబాలను ఆదుకోవాలి' అంటూ పెద్ద పెట్టున నినాదాలు అందుకు న్నారు.

ఈ లోపుగా భీమారావు, రామ్మూర్తి వాళ్ళ కుటుంబ సభ్యులను ఎక్కించుకొని వచ్చిన వాహనాన్ని చూడగానే అక్కడ చేరి ఉన్న ఆడవాళ్ళ ఏడుపులతో బీల బీలంతా హడలిపోయింది.

భీమారావు దగ్గరనుండి రామ్మూర్తి దగ్గ రకు కృష్ణారావు మాష్టారు వెళ్లారు. అక్క డ బొక్క బోర్లాపడి పోయి, రెండు పిడి కిళ్ళ నిండా బురదమట్టిని పట్టుకొని 'ఈ మట్టికోసమే నేను ప్రాణాలు విడుస్తు న్నాను, మీరంతా కలిసి మన బీలను కంపెనీ పాలు కాకుండా చూడండి' అన్న ట్టుగానే అలానే ప్రాణాలు విడిచిన

రామ్మూర్తిని చూశారు. ఎప్పుడూ కన్నీరు పెట్టడం ఎరగని మల్లీశ్వర్ ఆ దృశ్యం చూడగానే పెద్దగా రోదిస్తూ కూలబడిపోయాడు.

రామ్మూర్తికి పెళ్ళి కాలేదు. కారణం అతనికి ముగ్గురు చెల్లెళ్లు. వాళ్ళంతా చిన్న పిల్లలుగా ఉన్నప్పుడే తల్లిదండ్రులిద్దరికీ ఏదో విషజ్వరం వచ్చి పదిరోజుల తేడాతో చనిపోయారు. దాంతో అందరికంటే పెద్ద వాడైన రామ్మూర్తే తోడబుట్టినవాళ్ళకు అమ్మానాన్న అన్నీ తానే అయ్యి బీల మీద ఆధారపడి వాళ్ళందరినీ పెంచి పెద్దచేసి అందరికీ పెళ్ళీ పేరంటాలు జరిపించాడు.

ఆ విధంగా తోడబుట్టిన వాళ్ళకోసం తను పెండ్లి చేసుకోకుండా బ్రహ్మచారిగానే మిగిలిపోయాడు. రామ్మూర్తి బ్రహ్మచారిగానే మిగిలిపోయేటందుకు మరో బలమైన కారణం కూడా ఉంది.

పెద్ద చెల్లెలికి ఇద్దరు పిల్లలు కలిగాక ఒక రోడ్డు ప్రమాదంలో ఆమె భర్త చనిపోయాడు. ఆ చెల్లెలు, తండ్రిలేని పిల్లలను వెంటబెట్టుకుని వచ్చి రామ్మూర్తి దగ్గరే ఉండిపోయింది. దాంతో రామ్మూర్తికి ఇంక తన గురించి ఆలోచించుకునే అవకాశమే దక్కలేదు. చెల్లెలు, ఆమె పిల్లల కోసం తన శేష జీవితాన్ని ధారబోశాడు. అట్టా మొత్తం కుటుంబాన్నంతటినీ ఒక్క తాటి మీదకు నడుపుకొస్తున్నాడు. అటువంటి రామ్మూర్తి అన్యాయంగా పోలీసు తూటాలకు నేలకొరగడంతో ఆ కుటుంబం పరిస్థితి చుక్కాని లేని నావలా తయారైంది.

కాల్పుల విషయం తెలియగానే పొద్దున జరిగిన విషయాన్ని కాసేపు పక్కన పెట్టిన మీడియావాళ్ళంతా మళ్ళీ రెక్కలు కట్టుకొని వాలిపోయారు.

అన్ని న్యూస్ ఛానళ్ళ ఓబి వ్యాన్లు ఆఘమేఘాల మీద వచ్చేసి లైవ్ టెలికాస్ట్ ఇవ్వసాగాయి.

స్వామిపేటలో ఈ సంఘటన జరగడానికి రెండు రోజుల ముందుగానే అక్కడ హైదరాబాద్‌లో అసెంబ్లీ వర్షాకాల సమావేశాలు మొదలయ్యాయి. దాంతో ఆ సమావేశాల్లో ఉన్న నాయకులందరికీ స్వామిపేట కాల్పుల విషయం తెలిసిపోయింది. అప్పటిదాకా స్వామిపేట థర్మల్ వ్యతిరేక పోరాటానికి అడిగినా మద్దతు ఇవ్వని ప్రతిపక్ష రాజకీయ పార్టీల నాయకులంతా కూడబలుక్కున్నట్టుగా.. సభలోనే ఉన్న మంత్రి నిశ్చింతరావుకి, ముఖ్యమంత్రికి వ్యతిరేకంగా నినాదాలు చేశారు.

'వెంటనే సిట్టింగ్ జడ్జీతో న్యాయ విచారణ జరిపించాలి'

## కొత్తగాలి... 

**రాత్రి**
**ఒక బ్లాక్‌బ్యూటీ**
**నక్షత్రాలు**
**ఆమె జడలో పూలు**

– వి. రవి,
నాయుడు పేట

'కాల్పులకు బాధ్యుడైన ఎస్సైని వెంటనే డిస్‌మిస్ చేయాలి'

'నిశ్చింతరావుని వెంటనే మంత్రి పదవి నుండి తప్పించాలి'

'ఏ థర్మల్ స్టేషన్‌కి వ్యతిరేకంగా అమాయకులు ప్రాణాలు అర్పించారో ఆ థర్మల్ స్టేషన్ నిర్మాణాన్ని ఆపేయాలి'

'బాధిత కుటుంబాలకు వెంటనే ఆర్థిక సహాయం ప్రకటించాలి' అంటూ నినదించారు. ప్రభుత్వాన్ని నిలదీశారు. ముఖ్యమంత్రి అసెంబ్లీలో వెంటనే ఓ ప్రకటన చేయాలనీ పట్టుపట్టారు.

ప్రతిపక్షాల అభ్యర్థనకు వెంటనే స్పందిం

చిన ముఖ్యమంత్రి "మొత్తం సమాచారాన్ని తెప్పించుకుని జరిగిందేమిటో తెలుసుకున్న తరువాత రేపు ఉదయం సభలో ఒక ప్రకటన చేస్తాను" అంటూ సభను సమాధానపరిచాడు.

అయినా సభ్యులు శాంతించకపోవడంతో ఇంక చేసేదేంలేక సభాపతి సభను మరుసటి రోజుకి వాయిదా వేసి లేచిపోయాడు. దాంతో మరింతగా రగిలిపోయిన ప్రతిపక్షాలు అసెంబ్లీ సాక్షిగా రోడ్డెక్కాయి.

"ఇంకా ఎక్కువసేపు శవాలు అక్కడే ఉంటే ప్రజల్లో ఉద్రేకాలు పెరిగిపోయి ప్రభుత్వ, ప్రైవేట్ ఆస్తుల విధ్వంసం జరుగవచ్చు. కాబట్టి ఏదో విధంగా ముందు ఆ శవాలను అక్కణ్ణుంచి ప్రభుత్వ ఆస్పత్రికి తరలించే ఏర్పాటు చేయండి" అంటూ హోం మంత్రి జిల్లా కలెక్టర్, ఎస్పీలకు ఫోన్లోనే ఆర్డర్లు జారీచేశాడు.

'తమను చూడగానే జనం ఎంత విపరీతంగా స్పందిస్తారో? ఏం గొడవలు చేస్తారో?' అంటూ భయపడిన కలెక్టర్, ఎస్పీలు ఇక విధిలేని పరిస్థితుల్లో ఒక ఆలోచన ప్రకారం పోలీసులను కూడా వద్దని చెప్పి, ఒంటరిగానే సంఘటనా స్థలానికి చేరుకున్నారు. వాళ్ళు భయపడ్డట్టుగానే, వాళ్ళిద్దరినీ చూస్తూనే జనం మొత్తం కోపంతో రగిలిపోతూ "గోబ్యాక్, గోబ్యాక్ - కలెక్టర్, ఎస్పీ గోబ్యాక్" అంటూ గొంతులు చిరిగిపోయేటంత ఉద్రేకంతో నినాదాలు చేస్తూ వాళ్ళను చుట్టుముట్టారు.

పరిస్థితి అదుపు తప్పేలా ఉందని గ్రహించిన కృష్ణారావు మాష్టారు, మల్లీశ్వర్, రాజశేఖర్ వాళ్ళంతా జనాన్ని నిలువరిస్తూ వెళ్ళి, వాళ్ళకు రక్షణగా నిలబడ్డారు.

"ఏటి మేస్టు బావూ! మీరెందుకు మమ్ముల్ని అడ్డుకుంటున్నారు? తాతల్నాటి నుండి వస్తున్న బీలను ఎవలకో ధారాదత్తం చేసేస్తుంటే మేమంతా ఏట్లై పోవాలనుకుంతున్నారీళ్ళందరూ?" రెండు చేతులతో మెటికలు విరుస్తూ అందో ముసలమ్మ.

"మేం ఓట్లేసి గెలిపించినోల్లు మాకు సాయం జెయ్యకపోగా, మా ప్రాణాలు తీస్తా ఉంటే సూస్తా ఊరుకోవాలేటి?" షార్ట్ వేసుకున్న కుర్రాడొకడు మోగుతున్న సెల్‌ఫోన్ని కట్‌చేస్తూ కలెక్టర్, ఎస్పీల వంక కొరకొరా చూస్తూ అడిగాడు.

"ఆ ఎం.పి. బావూ, మినిస్ట్రి బావులు మీకెంతిస్తామన్నారేటి?" వంటిమీద తెల్లటి మల్లు పంచె కట్టుకొని తలమీద గాంధీ టోపి పెట్టుకొని, చత్వారపు కళ్ళజోడు పెట్టుకొని సన్నగా రివటలా ఉన్న ఎనభై యేండ్ల స్వాతంత్ర్య సమరయోధుడు అట్టాడ బూసినాయుడు తన చేతిలోని దినపత్రికను ఊపుతూ నిర్భయంగా ఉన్నతాధికారులిద్దరినీ నిలేశాడు.

"ఔను తాతా! ఆల్ల దగ్గరి లంచం తినేసినారు కాబట్టే గవర్నమెంట్‌కి అన్నీ దొంగ రిపోర్టులు రాసి పంపించినారు" ఎవరో కాలేజీ అమ్మాయి కాబోలు, కళ్ళనీళ్ళు కారిపోతుంటే బొంగురు గొంతుకతో ఎస్పీ వంక చూస్తూ మాట్లాడింది.

"జనం సచ్చిపోనాక గాని మీరు

## కొత్తగాలి...

**ఇక మన గ్యాస్**
**మనకే!**
**గ్యాసేనా??!**

– *జి.జి.కె. రావు,*
*శ్రీకాకుళం*

రారేటి? " ఎవరో కుర్రాళ్ళిద్దరు కూడబలుక్కున్నట్టుగా ఒకేసారి అడిగారు కలెక్టర్ని చూస్తూ.

"ఇప్పుడు సచ్చిపోయినోల్ల కుటుంబాల గతేటి కావాలి? " విచారంగా కళ్ళు తేల వేస్తూ అన్నాడొక ముసలితాత, అనుభవంతో పండిపోయిన నుదిటి మీది ముడతలు దగ్గరవుతుంటే.

"కలెక్టర్ బావంటే జిల్లాకంతా రాజు కాదేటి? పోలీసోడంటే రాజుకింద పన్జేసే బంటు కాదేటి? అల్లటువంటి బంటుతొత్తు కొడుకు నిలువునా మనుషుల ప్రాణాలు తీస్తంటే సూస్తా ఊరుకుంటే ఏటవుతాది? " తన బతుకంతా సమస్యలతోనే తెల్లవారిపోయిన పెద్దమనిషి ఒకడు గొంతు చించుకుంటూ లా పాయింట్ వేశాడు.

ఆ విధంగా అర్ధగంట, ముప్పావుగంట సేపు ఒక్కొక్కళ్ళొక్కో రకంగా మాట్లాడిన మాటలను సావధానంగా ఆలకించిన కలెక్టర్ ఆఖరికి నోరు విప్పుతూ "మీరన్న ప్రతి మాటలోనూ ఎంతో నిజముంది. నేను కాదనడం లేదు. కానీ, ఎంత కలెక్టర్లమైనా మాకూ కొన్ని పరిమితులుంటాయి కదా? ఆ విషయాన్ని మీరంతా గుర్తు పెట్టుకోవాలి. జరిగిన సంఘటనను అందరూ ఖండించాల్సిందే, మీరంతా అంటున్నట్టు ఆ ఎస్సైని ఆల్రెడీ సస్పెండ్ చేసే ఎస్పీగారు ఇక్కడికొచ్చారు.

ఇక ఎక్స్‌గ్రేషియా విషయానికొస్తే ప్రభుత్వంతో మాట్లాడి తప్పకుండా ఏర్పాటు చేస్తాను. కాకపోతే నా చేతిలో ఉన్న ఆపద్బంధు పథకం కింద యాభై వేలు వెంటనే వచ్చే ఏర్పాటు చేస్తాను. వాళ్ళ వాళ్ళతో అప్లికేషన్స్ పెట్టించండి" అంటూ ఓపిగ్గా ఒక్కో మాటకు బదులిచ్చాడు.

కలెక్టర్ మాటలను ఏమాత్రం పట్టించుకోని జనం "కంపెనీ ఆపేస్తామని హామీ ఇచ్చి, చనిపోయిన వాళ్ళ కుటుంబాలకు నష్ట పరిహారంగా చెరో పది లక్షలు వెంటనే ఇచ్చిందాకా ఇక్కణ్ణుంచి శవాల్ని కదిలించేదే లేదు" అంటూ మరింత ఆందోళనకు దిగారు.

దాంతో ఏం చేయాలో తోచని కలెక్టర్ "చూడండీ! ఈ శవాలను వెంటనే ప్రభుత్వ ఆస్పత్రికి తరలించి పోస్ట్‌మార్టం చేయించడం మంచిది. ఓ పక్క పొద్దుగూకిపోతోంది. ఈ శవాలను తెల్లవార్లూ ఇక్కడే పెట్టుక్కూర్చుంటే జనంలో మరింత ఆవేశకావేశాలు పెరిగిపోతాయి. ఆ ఆవేశంలో వాళ్ళేదన్నా చేస్తే మళ్ళీ అనవసరంగా అరెస్టులు, కేసులు, కోర్టులు.. ఎందుకొచ్చిన గొడవ నా మాట విని చీకటి పడక ముందే శవాలను తీసేస్తే మంచిది. నష్ట పరిహారం ఇప్పించే పూచీ నాది. ఆ పైన మీ ఇష్టం.." అంటూ ఎంతో సహనంతో తన పరిస్థితి ఏంటో వివరించాడు.

కలెక్టర్ చెప్పిందంతా సావధానంగా ఆలకించిన కృష్ణారావు మాష్టారు ఆ తరువాత మల్లీశ్వర్, రాజశేఖర్, సుందరరావు, రమణమూర్తి వాళ్ళందరినీ పక్కకు తీసుకోపోయి "ఏం చేద్దాం? " అంటూ ప్రశ్నించాడు.

"థర్మల్ ప్లాంట్ కట్టబోమనీ, చనిపోయిన కుటుంబాలకు మనం అడిగిన పది లక్షల ఆర్థిక సాయం అందజేస్తామనీ, ప్రభుత్వం దగ్గర్నుండి కచ్చితమైన హామీ ఇచ్చేవరకూ మనం శవాలను ఇక్కడ నుండి కదిలించడం కరెక్ట్ కాదు" తన కున్న లాయర్ బుర్రతో ఆలోచించి చెప్పుకొచ్చాడు రాజశేఖర్.

మిగతావాళ్లు కూడా రాజశేఖర్ చెప్పిందాన్నే సమర్థిస్తూ మాట్లాడారు.

అందరి మాటలను ఆలకించి కృష్ణారావు మాష్టారు "రేపు ఉదయం అసెంబ్లీలో ప్రకటన చేస్తారని ముఖ్యమంత్రి అసెంబ్లీలోనే





హామీ ఇచ్చారు. అదీగాక ప్రతిపక్ష నాయకులంతా ఈ రాత్రికే బయలుదేరి వస్తున్నామని ఫోన్లు కూడా చేశారు.

ఇటువంటి పరిస్థితిలో ఏం చేస్తే ఏం జరుగుతుందో చెప్పలేం. కాకపోతే ఓ పని చేద్దాం" అంటూ మధ్యలోనే ఆపి అందరి ముఖాల్లోకి పరిశీలనగా చూడసాగారు.

'ఏంటో చెప్పండి' అన్నట్టు అందరూ ఆయన వంక చూశారు.

"శవాలను ఇక్కడే ఉంచి వాళ్ళ కుటుంబ సభ్యులను ఏడిపించే బదులు, వాటిని హాస్పిటల్‌కి తరలించి, మనకు ప్రభుత్వం నుండి కచ్చితమైన హామీ వచ్చే దాకా పోస్ట్‌మార్టం చెయ్యకుండా అడ్డుకుందాం" అన్నారు కృష్ణారావు మాష్టారు. ప్రజల్లో రగులుతున్న ఉద్రేకాలను తాత్కాలికంగానైనా తగ్గించకుంటే ఏ క్షణంలో ఏం జరుగుతుందో? ఎవరు ఎలా స్పందిస్తారో? పరిస్థితులు ఎటుపోయి, ఎటు దారితీస్తాయో నన్న ఆందోళనతో దీర్ఘంగా ఆలోచిస్తూ చెప్పుకొచ్చాడు కృష్ణారావు మాష్టారు.

మాష్టారు మాటల వెనుక ఉన్న అనుభవాన్ని, ఆలోచనను అర్థం చేసుకోలేకపోయిన మల్లీశ్వర్‌వాళ్ళు "వద్దు మాష్టారూ! ఒక్కసారి శవాలను ఇక్కణ్ణుంచి కదిలించామా.. ఇంక మనమేం చెయ్యలేం. ఏది చేసినా శవాలను ఇక్కణ్ణుంచి లేపకుండానే



చేయాలి. అంచేత వాటిని లేపే ప్రసక్తే లేదు" అంటూ కచ్చితంగా తేల్చి చెప్పారు.

"నాకు తోచింది నేను చెప్పాను. కానీ మీరంతా ఏది చెబితే నేనూ అదే అంటాను" అంటూ తన పెద్దరికాన్ని నిల బెట్టుకుంటూ మాట్లాడారు కృష్ణారావు.

అందరూ మళ్ళీ కలెక్టర్ దగ్గరకొచ్చి "సార్! ఇప్పుడీ శవాలను తీసుకుపోయినా పోస్ట్‌మార్టం కాదు. ఒకవేళ అయినా, సూర్యాస్తమయం తరువాత శవదహనం చెయ్యకూడదు. ఎలాగు రేపు ఉదయం శాసనసభలో ముఖ్యమంత్రిగారు ప్రకటన చేస్తానన్నారు కదా! ఆ ప్రకటన వచ్చాకే తీద్దాం" అంటూ తమ నిర్ణయాన్ని సున్నితంగా తెలియజేశారు.

వాళ్ళ నిర్ణయంతో ఒక్కసారిగా కోపం తెచ్చుకున్న ఎస్పీ "ఈలోపుగా జరగరానిదే దైనా జరిగితే దానికి మీరే బాధ్యులు" అంటూ తీక్షణంగా మాట్లాడాడు.

"మేమెలాగ బాధ్యులమవుతాం? ప్రభుత్వం పచ్చని భూముల్ని పట్టుకుని ఎందుకూ కొరగాని బంజరు భూము లంటూ కారు చౌకగా, ఉన్నవాళ్ళ ఫ్యాక్టరీ లకు కట్టబెడుతుంది. మీ పోలీసులేమో ఉత్తిపుణ్యానికి మనుషుల్ని పిట్టల్ని కాల్చి నట్టు కాల్చి చంపుతారు. ఇక్కడింత ఘోరం జరిగిపోతే వెంటనే స్పందించాల్సిన ముఖ్యమంత్రి తీరిగ్గా రేపు ప్రకటిస్తా

నంటూ సభలోనుండి వెళ్ళిపోతాడు. కళ్ళ ముందే అన్యాయంగా మనుషులు చచ్చిపోయిన బాధతో కడుపు మండిపోతున్నా, జనం మాత్రం మీ దయా భిక్షకోసం చేతులు చాచుక్కూర్చోవాలి. సహనం చచ్చిపోయిన వాళ్ళేదన్నా చేస్తే మేం బాధ్యత వహించాలి! ఏం సెలవిచ్చారండీ ఎస్పీ గారూ!" అంటూ ఎస్పీతో వాదనకు దిగాడు లాయర్ రాజశేఖర్.

"ఔను ఇక్కడేకాదు, ఈ విషయమై జిల్లా మొత్తంలోనూ జరగరానిదేదన్నా జరిగితే అందుకు బాధ్యులం మేం కాదు, మీరే" అంటూ ఎస్పీతో మరింత ఘాటుగా మాట్లాడాడు సుందరరావు మాష్టారు.

వాళ్ళ వాదనలు విన్న జిల్లా కలెక్టర్ "మీరలా మాట్టాడితే నేనింక మాట్టాడేదేమీ లేదు" అంటూ మౌనంగా వెళ్ళి కారెక్కి కూర్చున్నాడు.

దాంతో ఒక్కసారిగా జనం మొత్తం కలెక్టర్ కారుకి అడ్డంపడి "మేమంతా శవాలను పెట్టుకొని ఇక్కడ ఉంటే మీరెలా వెళతారు? " అంటూ ప్రశ్నించారు.

"ఏం చేద్దాం? " అన్నట్టు నిస్సహాయంగా ఎస్పీ వంక చూశాడు కలెక్టర్.

'ఫోర్స్‌ను పిలిపిద్దాం' అన్నట్టు కళ్ళతోనే బదులిచ్చాడు ఎస్పీ.

'వద్దొద్దు, ఆ పని మాత్రం చేయకండీ!' అంటూ తనూ కళ్ళతోనే వారించాడు కలెక్టర్.

దాంతో ఇక చేసేదేంలేక తనూ కారెక్కి కూర్చున్నాడు ఎస్పీ.

ఇంతలో...

ఉదయం నుండి జరిగిన ఒక్కో సంఘటననూ చూసుకుంటూ వచ్చిన మేఘమాలికల గుండెల్లో పేరుకున్న దుఃఖం ఒక్కసారిగా కట్టలు తెంచుకు ప్రవహించినట్టు అంతలోనే దక్షిణ దిశలోనుండి నల్లని మబ్బులు కొండల్లా పెరిగొచ్చి జలజలామంటూ కుంభవర్షాన్ని కురిపించసాగాయి.

అకస్మాత్తుగా పడుతున్న వర్షానికి ఆశ్చర్యపోయిన జనమంతా ఉట్టిమీద నుండి జారిపడిన కుండపెంకుల్లా శవాల దగ్గర నుండి కకావికలై తలదాచుకోడానికి నలువైపులా పరుగులు తీశారు.




అట్లా మొదలైన వాన గంటన్నరకు పైగానే కురిసింది. ఆకుపచ్చ నేలతల్లి వాన నీటితో నిండి వెండి సంద్రంగా మారిపోయింది. ఎక్కడెక్కడి గెడ్డలూ పొంగిపొర్లాయి. వరదలు పారాయి. వాన వెలిసే సరికి రెండు శవాల దగ్గరా కుటుంబ సభ్యులు, దగ్గరి బంధువులు, ముఖ్య నాయకులు తప్ప జనమంతా ఎటువాళ్లు అటు వెళ్ళిపోయారు.

పరిస్థితిని తిరిగి తన సహచరులతో చర్చించిన కృష్ణారావు మాష్టారు వెంటనే చనిపోయిన వాళ్ళ కుటుంబాల దగ్గరికెళ్ళి "ఈ వర్షంలో, ఈ బురదలో, ఈ తడిసిన బట్టలతో, ఈ నడిరోడ్ల మీద మట్టికొట్టుకుపోయిన ఈ శవాలను పెట్టుకొని బాధపడే దానికన్నా, వాటిని వెంటనే హాస్పిటల్‌కి తరలించి మార్చురీలో ఉంచి, అసలు విషయం తేలిన తరువాతనే పోస్ట్‌మార్టం చెయ్యడానికి ఒప్పుకుందాం. దీనికి మీరు అంగీకరిస్తే వెంటనే కలెక్టర్‌గారితో మాట్లాడుదాం. అతను వెళ్ళిపోయాడంటే మళ్ళీ

దొరుకుతాడో లేదో" అంటూ తన మనసు లోని మాటలను వివరించాడు.

"మీ ఇష్టమే మా ఇష్టం బావూ!" అంటూ వాళ్ళంతా భారాన్ని మాష్టారు మీద వేశారు.

మాష్టారు మళ్ళీ మల్లీశ్వర్‌వాళ్ళతో 'ఏంచేద్దాం' అన్నట్టు చూశాడు.

చుట్టూ కన్ను పొడుచుకున్నా కానరాని కారు చీకటి. రోడ్డుకి రెండు వైపులా కని పించినంత మేర వర్షపు నీరు. వానకు తడి సిపోయిన చిమ్మట్లు అదేపనిగా చేస్తున్న రొద, కప్పల బెకబెకలు, దూరంగా నక్కల ఊళలు, తలలు విరబోసుకున్న దయ్యాల మాదిరిగా నిల్చున్న చెట్లు, తడిసి మట్టి కొట్టుకుపోయిన శవాలు, అంతటా అదో లాంటి నిశ్శబ్ద బీభత్సం.

ఆ స్థితిలో.. ఆ వాతావరణంలో అక్కడ శవ జాగరణ చేసే దాని కన్నా శవాలను ఆస్పత్రికి తరలించడమే మంచిదన్న నిర్ణ యానికొచ్చిన మల్లీశ్వర్, రాజశేఖర్‌వాళ్ళు అదే విషయాన్ని కృష్ణారావు మాష్టారుతో చెప్పేశారు.

దూరంగా వెళ్ళిపోయినవాళ్ళల్లో కొంత మంది వంటి మీది బట్టలు పిండుకుంటూ మళ్ళీ శవాల దగ్గరికి వస్తూ "మనం ఎంతో చేద్దాం అనుకున్నా ప్రకృతి అనుకూ లించనప్పుడు చెయ్యగలిగిందేముంది? " అంటూ సణగసాగారు.

వాన పూర్తిగా వెలవడంతో చూసిచూసీ ఇక బయలుదేరబోతున్న కలెక్టర్, ఎస్పీల దగ్గరకెళ్ళిన కృష్ణారావు మాష్టారు "సార్! మీరు చెప్పినట్టే కానివ్వండి. శవాలనిక్కడే ఉంచి తెల్లవార్లూ ఈ చీకట్లో, వర్షంలో బాధపడే కంటే మార్చురీకి తరలించడమే మంచిదనుకుంటున్నాం" అంటూ తన సంసిద్ధతను వ్యక్తం చేశాడు.

'వర్షం రావటం కూడా ఒకందుకు మంచిదే అయ్యిందే!' మాష్టారు మాటలను విన్న కలెక్టర్ మనసులో అనుకొని, పైకి మాత్రం "సరే మీ ఇష్టం. అలాగే కాని వ్వండి. ఈ మాట నేనెప్పుడో చెప్పాను కదా!? మీరే విన్లేదు. పోన్లే, ఇప్పటికైనా పరిస్థితిని అర్థం చేసుకున్నారు. అంతే చాలు" కార్లో నుండి మళ్ళీ కిందికి దిగుతూ అన్నాడు.

వెళ్ళిపోయినవాళ్ళు పోగా తిరిగొచ్చిన వాళ్ళంతా తడి బట్టలతో గడ గడ వణు క్కుంటూ వచ్చి కలెక్టర్ చుట్టూ వరద నీటిలా చుట్టుముట్టారు.

## సెప్టెంబరు - 2012
### చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ ఐదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. ఆర్. సుశీల
 - ఆటోనగర్, విజయవాడ
2. వి. శ్యామ్‌ప్రసాద్
 - పాండురంగనగర్, గుంటూరు
3. యు. జాన్సీలక్ష్మీ
 - న్యూ పాల్వంచ, ఖమ్మం జిల్లా
4. పి. ప్రభావతి
 - మియాపూర్, హైదరాబాద్
5. ఎం. అరుణరేఖ
 - బెంగళూరు

### సరైన జవాబులు

| | |
|---|---|
| 1. హరీష్ | 6. లెనార్డ్ |
| 2. హరి నారాయణ్ | 7. అగాథా క్రిస్టీ |
| 3. పరంజ్యోతి | 8. మే హెర్న్ |
| 4. మిత్రా | 9. 2005 |
| 5. గీత | 10. జెనరిక్ |

కలెక్టర్ కారు దిగి ఎవరికో ఫోన్ చేసి "వెంటనే ఇక్కడికి రెండు అంబులెన్స్‌లు పంపించండి" అంటూ ఆర్డరేశాడు.

మరో అరగంటలో అంబులెన్స్‌లు వచ్చి శవాలను ఎక్కించుకొని ప్రభుత్వ హాస్పిటల్ వైపు బయలుదేరాయి.

అంబులెన్స్‌ల వెనుక బయలుదేరిన జనానికి హాస్పిటల్ దారిలోనే ఉన్న మంత్రి నిశ్చింతరావు ఇల్లు కనిపించేసరికి కోపంతో తమను తాము మర్చిపోయి ఆ ఇంటి మీద ఉవ్వెత్తున లేచిన ఉప్పెనలా విరుచుకుపడ్డారు.

నిముషాల్లో కిటికీల అద్దాలు భళ్ళు భళ్ళున బద్దలుచేసి రెండు బైక్‌లు, రెండు కార్లతో పాటు ఇంటి ముందు ఉన్న కుర్చీలు, బెంచీలను బైటకు తెచ్చి కుప్ప బోసి నిప్పంటించారు.

మరికొంత ముందుకెళ్ళిం తరువాత ఎదురైన ఎం.పి. గంగాజ్రలావు జీడిపప్పు ఫ్యాక్టరీని, కోళ్ళ ఫారాన్నీ నానా బీభత్సం చేసి అప్పుడు ఆ హాస్పిటల్‌కు చేరారు.

ఏదో ఒక సందర్భంలో జనాగ్రహం అలా సహనపు గట్లను తెంచుకుని ప్రళయ కావేరిలా సాగిపోయేటప్పుడు, ఆ ఉధృతి తగ్గేంతవరకు ఎవరైనా ఊరక చూస్తూ ఉండిపోవాల్సిందే తప్ప చేయగలిగిందేమీ లేదన్నట్టు పోలీసులు జరిగేదంతా చూస్తూ మౌనంగా వెంట నడువసాగారు తప్ప ఎవ్వరినీ అదేమిటని అడ్డుకోలేదు.

ఆ రాత్రి బీల గ్రామాల ప్రజలు హాస్పిటల్ ముందు అప్పటికప్పుడు పోలీసుల దౌర్జన్యం మీద, కుచేలా కంపెనీవాడి డబ్బు మదం మీద, మంత్రి నిశ్చింతరావు, ఎం.పి. గంగాజ్రలావుల వంచన మీద, భీమారావు, రామ్మూర్తిల బలిదానం మీద పాటలు కట్టి తెల్లవార్లూ ఆడుతూ పాడుతూ శవజాగరణ కొనసాగించారు.

తెల్లవారేటప్పటికి హాస్పిటల్ చుట్టూ రెండు మూడు కిలోమీటర్ల పరిధిలో ఇసుక వేసినా రాలనంత జనం పోగయ్యారు. ఎవరి నోట విన్నా మంత్రి నిశ్చింతరావుని, ఎం.పి. గంగాజ్రలావును శాపనార్థాలు పెడుతున్న మాటలే వినిపిస్తున్నాయి.

నిన్న జరిగిన సంఘటనలన్నీ ఫొటోలతో సహా అన్ని వార్తా పత్రికల్లో పతాక శీర్షికల్లో రాగా, అన్ని టి.వి. ఛానల్స్‌లోనూ అవే దృశ్యాలను మళ్ళీ మళ్ళీ చూపిస్తూ మీడియా ఎక్స్‌పర్ట్స్‌తో చర్చలు కొనసాగిస్తూ వస్తున్నారు.

'అసెంబ్లీలో ఏం చర్చ జరగబోతుందో? ముఖ్యమంత్రి ఎలా స్పందించబోతున్నారో?' అంచనా వేస్తూ వాళ్ళంతా రకరకాలుగా వ్యాఖ్యానాలు చేయసాగారు.

హైదరాబాద్ నుండి ప్రత్యేక వాహనాల్లో ప్రతిపక్ష నాయకులు కిందటి సాయంత్రమే స్వామిపేటకు బయలుదేరినట్టుగా తెలిసిన జనం వాళ్ళకోసం ఎదురు చూడసాగారు.

ఇంకో రెండు గంటల్లో వాళ్ళు స్వామిపేట చేరుకోవచ్చని సమాచారం రావడంతో బీల గ్రామాల జనం ఇండ్లకు తాళాలు పెట్టి ఆస్పత్రికి చేరుకోసాగారు.

రకరకాల ఊహాగానాలు, అంచనాల మధ్య ఎవ్వరూ ఊహించని మరో సంచలన వార్తను సరిగ్గా ఉదయం పదకొండున్నర గంటలకు ఛానల్స్ అన్నీ బ్రేకింగ్ న్యూస్‌గా ఇచ్చాయి.

అదేంటంటే... నేషనల్ అప్పిలేట్ అథారిటీవారు, ఇక్కడ శవాలు ఇంకా మార్చురీలో ఉండగానే అక్కడ హైదరాబాద్‌లో స్వామిపేట కుచేలా కంపెనీ పవర్‌ప్లాంట్ మీద తమ తీర్పు వెల్లడిస్తూ 'కుచేలా పవర్‌ప్లాంట్ నిర్మాణం కోసం బీల భూమికి సంబంధించి ఇప్పటి వరకు సమర్పించిన నివేదికలన్నీ తప్పుడు నివేదికలుగా నిర్ధారించినందున తక్షణమే పవర్‌ప్లాంట్

నిర్మాణానికి ఇచ్చిన అనుమతులన్నీ నిలిపి వేయాల్సిందిగా 'పేర్కొంటున్నాం' అంటూ వెలువరించిన తీర్పును వనగిరి మృతవీరులకు నివాళిగా భావించిన జనం వాళ్ళకు జోహార్లు అర్పించారు.

అయితే ఆ తీర్పు వనగిరి ప్రజలకు ఎంత ఊరటనిచ్చిందో, అంతకు మించిన ఆశాభంగాన్ని కార్పొరేట్ రంగంలోని కొందరికి కలిగించి, వారిని కలవరపాటుకు గురి చేసింది.

అప్పిలేట్ తీర్పు మీద జనంలో, మీడియాలో చర్చలు కొనసాగుతుండగానే అసెంబ్లీ ప్రత్యక్ష ప్రసారాల్లో స్వామిపేట కాల్పుల ఘటన మీదనే ప్రభుత్వానికీ, ప్రతిపక్షాలకు మధ్య తీవ్రస్థాయిలో వాదోపవాదాలు జరిగాయి. నిశ్చింతరావుని మంత్రివర్గం నుండి తప్పించడమేకాక క్షతగాత్రులకు, మృతుల కుటుంబాలకు వెంటనే ఎక్స్‌గ్రేషియా ప్రకటించాలంటూ తీర్మానాన్ని ప్రతిపాదించాయి.

ప్రతిపక్షాల వాదనకు సమాధానం ఇస్తూ మంత్రి నిశ్చింతరావు "నా ప్రజలు నన్ను అర్థం చేసుకోవడంలో జరిగిన పొరపాటుకు నేనెంతో చింతిస్తున్నాను. నేనే కాదు, వాళ్ళూ చింతించే సమయం తప్పకుండా వస్తుందని భావిస్తున్నాను. నేనెంతో ముందుచూపుతో నా జిల్లావాసుల అభివృద్ధి కోసం చేస్తున్న ప్రయత్నాలకు ప్రతిపక్ష పార్టీలు, కొన్ని స్వచ్ఛంద సంస్థలు సైంధవుల్లాగా అడ్డుతగులుతున్నాయి.

ప్రపంచీకరణలో భాగంగా మనమూ ఆ విధానాలను భుజాలకెత్తుకుని అభివృద్ధి పథంలో దూసుకుపోవాలన్న లక్ష్యంతో మేము చేపడుతున్న అభివృద్ధి కార్యక్రమాలను అడ్డుకుంటున్న ప్రతిపక్ష పార్టీలను, అలా అడ్డుకోవద్దని సభాముఖంగా చేతులెత్తి ప్రార్థిస్తున్నాను. వాళ్ళు అలా అడ్డుకోవడం వల్ల దేశంలో పెట్టుబడి పెట్టడానికి ముందుకొస్తున్న బహుళజాతి కంపెనీలు పునర్విమర్శ చేసుకొని వెనకడుగు వేసే ప్రమాదం ఉంది. నిజంగా అదే జరిగితే మనం తీవ్రంగా నష్టపోతాం.

కాబట్టి స్వామిపేట బీలలో కుచేలా కంపెనీ వారు నిర్మించ తలపెట్టిన పవర్ ప్లాంట్‌ను నిర్మించనివ్వడమే మా ప్రాంతానికి, మా ప్రజలకు ప్రయోజనాన్ని కలుగ

## 'చతుర'లో మొదటి నవల



### శిరంశెట్టి కాంతారావు

శిరంశెట్టి కాంతారావు పుట్టింది నల్గొండ జిల్లా ఫణిగిరిలో. విద్యాభ్యాసం కృష్ణా జిల్లా జగ్గయ్యపేటలో సాగింది. ప్రస్తుతం ఆయనకు యాభై నాలుగేళ్లు. 2003 నుంచి కథలు రాయడం ప్రారంభించారు. ఇప్పటి వరకూ వివిధ పత్రికల్లో ఆయన రాసిన కథలు దాదాపు ఎనభై వరకూ ప్రచురితమయ్యాయి. వాటిలో పాతిక కథలు రాష్ట్ర స్థాయిలో వివిధ పోటీల్లో బహుమతులు పొందాయి. ఇంత వరకూ 'కంచి మేకలు', 'మట్టితాళ్ల వల', 'జంగ్' అనే మూడు కథా సంపుటాలు వెలుగు చూశాయి. అచ్చులో వస్తున్న ఆయన తొలి నవల 'ఆకుపచ్చ విధ్వంసం' కావడం విశేషం.

**చిరునామా:**
**శిరంశెట్టి కాంతారావు,**
ఇంటి నెం. 1-1-177, 'మమతల కోవెల',
శ్రీనివాసపురం కాలనీ, పాత పాల్వంచ,
ఖమ్మం జిల్లా, పిన్: 507115

జేస్తుందని గట్టిగా బల్లగుద్ది చెబుతున్నా. ప్లాంట్ నిర్మాణానికి రావాల్సిన అన్ని అనుమతులూ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నుండి ఎప్పుడో వచ్చి వున్నాయి. ఉబుసుపోని ప్రతిపక్షాల జిమ్మిక్కులకూ, పనిలేని వాళ్ళ కార్యకర్తలకూ తోడు ఊరక తిని తిరిగే కొందరు ఆకతాయిలు తోడై నిర్వహించే ఆందోళనలకు మీడియా అనవసరమైన ప్రాధాన్యతనిస్తూ మరీ ఎక్కువ చేసి చూపిస్తుండటంతో విషయం ఇంత దూరం వచ్చింది తప్ప వేరే ఏమీలేదు.

కాల్పుల్లో చనిపోయినవారి కుటుంబాలకూ, క్షతగాత్రులకు ఎలాంటి పరిహారం చెల్లించాలో, ఎంత మేరకు చెల్లించాలో మా ప్రభుత్వానికి, మా ముఖ్యమంత్రి గారికీ బాగా తెలుసు. వాళ్లకు సహాయం చేయడంతో పాటు కర్మాగారానికి వ్యతిరేకంగా సాగించే అన్ని రకాల ఆందోళనలనూ నాలుగు రోజుల్లో అదుపులోకి తెస్తాం" అంటూ ఆవేశంతో ఊగిపోతూ సుదీర్ఘంగా సమాధానం ఇచ్చాడు.

పెట్రోల్ పోసి, అగ్గిపుల్ల గీసినట్టున్న మంత్రి సమాధానంతో ప్రతిపక్షాలు మరింతగా ఆందోళనలకు దిగుతూ స్పీకర్ పోడియంలోకి దూసుకుపోయి గొడవ చేశాయి.

స్పీకర్ వెంటనే స్పందిస్తూ "దయచేసి గౌరవ సభ్యులు మీమీ స్థానాల్లో కూర్చుంటే నిన్న ఇచ్చిన హామీ మేరకు గౌరవనీయ ముఖ్యమంత్రిగారు వెంటనే ప్రకటన చేస్తారు" అంటూ సభ్యులను శాంతపరచి ఎవరి స్థానాల్లో వాళ్లను కూర్చుండబెట్టారు.

ఆ తరువాత అయిదు నిముషాలకు ముఖ్యమంత్రి లేచి "స్వామిపేట థర్మల్ స్టేషన్ విషయంలో అప్పిలేట్ అథారిటీ తీర్పును మా ప్రభుత్వం గౌరవిస్తుందని హామీ ఇస్తున్నాను" అంటూ ఇంకా ఏదో చెప్పబోతుండగానే ప్రతిపక్ష పార్టీల వైపు నుండి అరుపులు, కేకలు విన్పించడంతో కొంతసేపు మౌనంగా నిల్చుండిపోయాడు.

అలజడి సద్దుమణిగిన తరువాత మళ్లీ మైక్ అందుకున్న ముఖ్యమంత్రి "చనిపోయినవారి కుటుంబాలకు ఒక్కొక్కరికి ఐదు లక్షలు, క్షతగాత్రులైనవారికి ఒక్కొక్కరికి వైద్యఖర్చులు గాక అదనంగా ముప్పైవేలు ఎక్స్‌గ్రేషియా ప్రకటిస్తున్నాం" అంటూ ప్రకటనను ముగించి కూర్చున్నాడు.

ముఖ్యమంత్రి ప్రకటనకు ఈసారి అధికారపక్షంవారు బల్లలు చరుస్తూ స్వాగతిస్తే, ప్రతిపక్షాలవారు ప్లాంట్ నిర్మాణాన్ని శాశ్వతంగా ఆపు చేస్తామని చెప్పనందుకు, నష్టపరిహారం మరీ తక్కువగా ఉన్నందుకూ సభలో నుండి వాకౌట్ చేశారు.

టీవీల్లో ముఖ్యమంత్రి ప్రకటన చూసిన బీల గ్రామాల్లోని జనంతోపాటు జీవభద్ర శిబిరం దగ్గర ఉన్న జనం కూడా "అమర్ హై, అమర్ హై స్వామిపేట మృతవీరులు- అమర్ హై" అంటూ ఉద్వేగాన్ని నినాదాల ద్వారా వ్యక్తం చేస్తుండగానే కృష్ణారావు మాష్టారువాళ్లకు బంగ్లాకు రమ్మంటూ కలెక్టర్ దగ్గరనుండి పిలుపొచ్చింది.

వెంటనే కృష్ణారావు మాష్టారు, మల్లీశ్వర్, రాజశేఖర్‌వాళ్లంతా కలెక్టర్‌ని కలవడానికి జనంతో సహా బయలుదేరి వెళ్లారు.

వచ్చిన వారందరినీ కూర్చోబెట్టిన కలెక్టర్ "సి.ఎం.గారు ఇప్పుడే ఫోన్ చేసి మాట్లాడారు. అసెంబ్లీలో ప్రకటించినట్టుగానే ఎక్స్‌గ్రేషియా మొత్తానికి చెక్కులు తీసుకుని హోం మినిస్టర్‌గారు బయలుదేరి వస్తున్నారు. కాబట్టి నా మాట మీద విశ్వాసం ఉంచి ఇకనైనా మీరు పోస్ట్‌మార్టమ్‌కి ఒప్పుకుంటే బాగుంటుంది" అంటూ విషయాన్ని సూటిగా వివరించాడు.

'ముఖ్యమంత్రిగారు చెప్పగా మనం టీవీల్లో చూశాం. అదే విషయం ఇప్పుడిక్కడ

కలెక్టర్‌గారూ చెబుతున్నారు. ఆయన చెప్పిన తర్వాతనూ బెట్టు చేయడం మంచి పద్ధతి కాదు. పైగా నిన్నెప్పుడో చచ్చిపో యినవాళ్ల శవాలను ఎంతసేపు ఉంచు కుందాం? ' అన్న నిర్ణయానికొచ్చారు.

నాయకులంతా కలెక్టర్‌తో "సార్! మీమాటపై నమ్మకంతో మేం పోస్ట్‌మార్ట మ్‌కి ఒప్పుకుంటున్నాం. కానీ మీరోసారి బయటికొచ్చి ఇదేమాట అందరి ముందు చెబితే బావుంటుంది. తరువాత ఏ తేడా వచ్చినా మా తప్పు ఉండదు" అంటూ బంతిని ఆయన కోర్టులోకి నెట్టారు.

నాయకుల ఆంతర్యాన్ని అర్థం చేసుకున్న కలెక్టర్ "సరే పదండి" అంటూ వెంటనే బయటికొచ్చి బంగ్లా ముందు గుమిగూడిన జనాన్ని చూసి, ఎందుకో మనసు మార్చు కొని "ఇక్కడ కాదులే. అక్కడికే వచ్చి వాళ్ల కుటుంబ సభ్యులకే చెబుతాను, పదండి" అంటూ కారెక్కి హాస్పిటల్‌కి బయలుదే రాడు.

ఆయన వెనుకనే బయలుదేరిన కృష్ణా రావు మాస్టారువాళ్లంతా హాస్పిటల్‌కి చేరు కుని చనిపోయిన వారి కుటుంబ సభ్యు లను కలెక్టర్ ముందుకు తీసుకొచ్చారు.

వాళ్లంతా కలెక్టర్‌ని చూస్తూనే బోరుమంటూ ఏడవసాగారు.

వాళ్లను సముదాయించిన కలెక్టర్ "సాయంత్రంకల్లా హోం మినిస్టరుగారే స్వయంగా మీ ఇళ్లకొచ్చి చెక్కులు అందజే స్తారు. అందుకు నాది హామీ" అంటూ పరిస్థితిని వివరించాడు.

కలెక్టర్ హామీ ఇచ్చిన మీదట కుటుంబ సభ్యులు కూడా పోస్ట్‌మార్టం చెయ్యడానికి ఒప్పుకున్నారు.

దాంతో హాస్పిటల్ డాక్టర్ వంక చూసిన కలెక్టర్ "ఇక మీ పని మీరు పూ ర్తిచేసి శవాలను వాళ్లకు అప్పజెప్పండి. ఆ తరువాత వాళ్ల కార్యక్రమాలు వాళ్లు చేసు కుంటారు" అంటూ తిరిగి కారెక్కి వెళ్లిపో

## ప్రమాదకరమైన తోట!




ఇంగ్లండ్ దేశంలోని నార్త్ అంబర్ లాండ్ ప్రాంతానికి చెందిన ఆల్‌విక్ అనే ఊళ్లో ఓ కోట పక్కన గల తోట అత్యంత ప్రమాద కరమైంది. ఓ దొరసాని 1750లో సృష్టిం చిన ఈ తోటలోకి అప్పట్లో ఎవరికీ ప్రవేశం ఉండేదికాదు. దీని పేరే 'పాయిజన్ గార్డెన్'. ఇందులో పెరిగే మొక్కలన్నీ అత్యంత ప్రమాదకరమైనవి, విషపూరితమై




నవి. ముట్టుకున్నా, వాసన చూసినా చంపే శక్తి గల వందరకాల విషపు మొక్కలను ఈ తోటలో పెంచారు. మార్జువానా, ఇతర మాదక ద్రవ్యాలు తయారుచేసే మొక్కలని కూడ ఇక్కడ చూడవచ్చు. 1950దాకా ఈతోటలో ఇటాలియన్ ఆర్నమెంటల్ మొక్కలు ఉండేవి. 1995లో డ్యూక్‌ఆఫ్ నార్త్ అంబర్‌లాండ్ భార్య డచెస్ జేన్‌పెర్సీ తిరిగి ఆ విషపు మొక్కలను సేకరించి పునరుద్ధరించింది. గైడ్స్‌తో మాత్రమే దీన్ని చూడడానికి అనుమతి లభిస్తుంది. చిన్నపి ల్లలు గోడదూకి వెళ్ళకుండా ఎత్తయిన కంచె ఉంది. ఈ మొక్కలను మందుల తయారీలో వాడడానికి ఉపయోగిస్తు న్నారు. నల్లటి గేట్ల వెనక గల ఈ వంద మొక్కలలో అట్రోపా బెలడోనా, ట్రైక్నోస్ నక్స్‌వామికా, కోనియం మకులడమ్ అనేవి అత్యంత ప్రమాదకరమైనవి. కాబట్టి ఈ మొక్కల చుట్టూ ఇనపకంచె ఏర్పాటు చేసారు. అలాగే మాదకద్రవ్యాల మొక్కల ఆకులు కోసుకెళ్లకుండా కూడా వాటిచుట్టూ కంచె ఉంటుంది.

# చతుర ప్రవేశిక

## అక్టోబరు చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాయగలరేమో చూడండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. ఎండమ్మది ఏ ఊరు?
జ.
2. దేవుడి పెళ్లికి ముప్పైవేలు ఇచ్చింది?
జ.
3. ఉద్యమాలకు మద్దతు ఇచ్చే సామాజికవేత్త?
జ.
4. ఉద్యమంలో న్యాయవ్యవహారాలు చూసేదెవరు?
జ.
5. ఎవరి ఇంట్లో బాంబు పేలింది?
జ.
6. భీమారావు కొడుకు?
జ.
7. సుగుణమ్మ భర్త ఎవరు?
జ.
8. మరుగునపడ్డ అమెరికా చిహ్నమేది?
జ.
9. పాయిజన్ గార్డెన్ ఏ దేశంలో ఉంది?
జ.
10. రవీంద్ర కేల్కర్ ఏ భాషకు సేవ చేశారు?

---

పంపినవారి పేరు: ----------------

------------------వయసు (   )

చిరునామా: ------------------

------------------------

------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

చివరి తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.

యేందుకు సిద్ధమయ్యాడు.

"అలాగే సార్!" అంటూ కలెక్టర్‌ను పంపించిన డాక్టర్ ఆ తరువాత లోపలికెళ్లి తలకు క్యాప్, ముక్కుకు గుడ్డ, చేతులకు గ్లౌస్‌లు తొడుక్కొని తెల్ల కాగితాలున్న ప్యాడ్, పెన్ను తీసుకొని, ఓ ఇద్దరు మార్చురీ రూమ్ స్టాఫ్‌ను వెంటబెట్టుకుని మార్చురీ గదివైపు బయలుదేరాడు.

గంట గంటన్నర కల్లా రెండు శవాలకు పోస్ట్‌మార్టం పూర్తిచేసిన డాక్టర్ ఆ మృత దేహాలను బంధువులకు అప్పగించాడు.

లోపల పోస్ట్‌మార్టం జరుగుతుండగానే బయట మల్లీశ్వర్‌వాళ్లు రెండు మినీ లారీలను తెప్పించి, వాటి మీద బల్లలు వేయించి, శవయాత్రకు కావాల్సిన ఏర్పాట్లు చేయించారు.

అంతిమయాత్రలో పాల్గొనడానికి బీల గ్రామాల ప్రజలు తండోపతండాలుగా ప్రభుత్వ ఆస్పత్రికి తరలివచ్చారు.

మేళతాళాలతో, నినాదాల హోరుతో, పాటలతో, టపాసుల మోతలతో శవ యాత్ర ప్రారంభమై సాగిపోయింది.

నిన్నటి నుండి వేలాది మందితో కిటకిటలాడిన హాస్పిటల్ ప్రాంగణమంతా ఒక్కసారిగా శ్మశాన నిశ్శబ్దంగా మారిపోయింది. డ్యూటీ డాక్టర్‌తోపాటు పడకల మీద ఉన్న క్షతగాత్రులు, రోగులు తప్ప ఒక్క పురుగు లేకుండా అంతా కదలివెళ్ళారు. సరిగ్గా అదేసమయంలో చప్పుడు లేకుండా దూసుకొచ్చిన నాలుగు కార్లు హాస్పిటల్ ముందు ఆగాయి.

కార్లలో నుండి ఎస్పీ, కలెక్టర్‌లతోపాటు హోం మినిస్టర్ కూడా దిగేసరికి డ్యూటీ డాక్టర్, స్టాఫ్‌తో సహా రోగులు, క్షతగాత్రులూ కూడా ఒక్కసారిగా ఆశ్చర్యపోయి చూడసాగారు.

కారు దిగిన హోం మినిస్టర్ గబగబా క్షతగ్రాతుల దగ్గరకెళ్ళి ఒక్కొక్కళ్ళను పరామర్శించి, ముఖ్యమంత్రి ప్రకటించినట్టుగా

చెక్కులు అందించాడు. వస్తూ వస్తూ ఫొటో[గ్రాఫర్‌ను తీసుకొచ్చిన మంత్రి చెక్కులు ఇస్తూ పత్రికలకోసం ఫొటోలు దిగాడు.

పట్టుమని పది నిమిషాలు కూడా క్షత గాత్రులతో మాట్లాడకుండా వచ్చినంత నిశ్శబ్దంగానే కార్లో ఎక్కి ఎటో వెళ్ళిపోయాడు హోం మంత్రి.

హాస్పిటల్లో ఉన్న క్షతగాత్రులను పరామర్శించి చెక్కులు ఇవ్వడానికి హోం మినిస్టర్ వచ్చాడని తెలియడంతో శవయాత్రలో పాల్గొంటున్న జనమంతా పొలోమంటూ తిరిగి హాస్పిటల్ వైపు ఒక్కసారిగా పరుగులు తీశారు.

అయితే జనమంతా అక్కడికి చేరేసరికి హోం మినిస్టర్ అప్పటికే క్షతగాత్రులందరినీ పరామర్శించి, చెక్కులు పంచిపెట్టి వెళ్ళిపోయాడని తెలియడంతో జనమంతా ఒక్కసారిగా తీవ్రంగా నిర్ఘాంతపోయారు.

'ఇంతలోనే ఎటు వెళ్ళిపోయాడబ్బా!' అనుకుంటూ వెనుదిరిగారు జనం.

అలా జనం వెనుదిరిగి వెళ్ళిపోయిన తర్వాత ఎవ్వరికీ తెలియకుండా ఆ పక్క వీధిలోనే ఉన్న ఓ రాజకీయ నాయకుడి ఇంట్లో ఉన్న హోంమంత్రిని వేరేదారి గుండా మృతుల ఊళ్లకు తీసుకువెళ్లారు అధికారులు.

హోంమంత్రిని చూడడంతోనే శోకంతో కదిలిపోతూ భీమారావు భార్య "మా బీలను మాకు కాకుండా చేసి, మా బతుకుల్లో నిప్పులు పోసి, మనుషుల ప్రాణాలు పొట్టన బెట్టుకున్నది సాలక, వాటికి రేటు గట్టి డబ్బులిచ్చి పోడానికొచ్చారా? మేం ఓట్లేసి గెలిపించిన మా మంత్రిని, ఎంపీని ఎందుకు తీసుకురాలేదు?

అయినా నా పెనిమిటే పోయినంక నాకీ డబ్బులెందుకు? ఆయన ఏ ఉద్దేశంతోటి పోయినాడో, ఆ ఉద్దేశం నెరవేరి, కంపెనీవోడు ఈణ్ణించి తోక ముడుచుకుని పోయేదాక మాకే డబ్బులు వద్దు బావూ! అప్పటిదాకా మేం ఇల్లాగే పోరాటం సేత్తాం.. సేత్తానే ఉంటాం. ఇలగ ఎంత మందిని సంపుతారు? ఎన్ని లచ్చలు పంచుతారు? మాగ్గావల్సింది మా బీల గాని, ఈ ముష్టి డబ్బులు గాదు" అంటూ పైడితల్లి అమ్మవారిలా తీవ్రంగా చెలరేగిపోయింది.

హోంమంత్రి వచ్చిన విషయం సెల్ ఫోన్ల ద్వారా తెలుసుకుని జనం నుండి మెల్లగా పక్కకు తప్పుకొని వచ్చిన కృష్ణారావు, రాజశేఖర్‌వాళ్ళు భీమారావు భార్య ఆయనపై చెరుగుతున్న మాటల నిప్పులకు విస్తుబోతూ దూరంగానే చూస్తూ నిల్చుండిపోయారు.

అయితే వచ్చిన హోంమంత్రేమన్నా ఆషామాషీ మనిషా? ఇలాంటి సందర్భాలను ఎన్నింటినో ఎదుర్కొని రాటుదేలినవాడు. గతంలో ప్రభుత్వానికి ఇంతకన్నా సంక్లిష్ట పరిస్థితులు ఎదురైనప్పుడు ముఖ్యమంత్రి దూతగా, పోలీసులు సైతం జనం ముందుకు పోలేని సందర్భాల్లో కూడా ధైర్యంగా ప్రజల్లోకి చొచ్చుకుపోయి వాళ్ళ దూషణ, భూషణ, తిరస్కారాలను చిరునవ్వుతో ఓపిగ్గా సహించి తమకు కావాల్సిన విధంగా పని చక్కబెట్టుకొచ్చిన ఘనుడు.

ఇంతలో...

భీమారావువాళ్ళ ఇంటికే హోంమంత్రి వచ్చాడన్న విషయం తెలుసుకున్న జనం మొత్తం కదలి వచ్చారు.

వచ్చిన వాళ్ళంతా.. "మా ఎం.పి., ఎమ్మెల్యేలు ఏమయ్యారో ముందు మాకు చూపించండి!"

"కంపెనీ కట్టొద్దు - మా బతుకులు కూల్చొద్దు"

"మా ప్రాణాలు తీయొద్దు- మా పిల్లల్ని

అనాథల్ని చేయొద్దు" అంటూ పెద్ద ఎత్తున నినాదాలు చేస్తూ హోంమంత్రిని చుట్టుముట్టారు. అలా అరగంటసేపు నిల బెట్టారు. సమయం గడుస్తున్నకొద్దీ జనం రావడం కూడా ఎక్కువైంది.

హోంమంత్రికి ఎస్కార్ట్‌గా వచ్చిన ఎస్పీ ముందుకొచ్చి కృష్ణారావు మాష్టారుతో "మీరన్నా కలుగజేసుకొని చెక్కు తీసుకో మని ఆవిడతో చెప్పండి. పెద్ద మనిషిని అలా ఎంతసేపు నిలబెడతారు? ఇంతటితో అయిపోలేదు కదా? విషయం ఏదన్నా ఉంటే తరువాత మాట్లాడు కుందాం గాని వెంటనే మంత్రిగారిని పంపించే ఏర్పాట్లు చూడండీ" అంటూ ప్రా ధేయపడ్డాడు.

'అదీ నిజమే' అనుకున్న మాష్టారు 'ఏం చేద్దాం' అన్నట్టు రాజశేఖర్, మల్లీశ్వర్ వాళ్ల వంక చూశాడు.

వాళ్ళూ వెంటనే స్పందిస్తూ "ఎస్పీగార న్నట్టు ఆమెను చెక్కైతే తీసుకోమని చెప్పండి. ఆ తరువాత ఏం చేయాలో ఆలోచిద్దాం గానీ..." అంటూ శాంతంగా సమాధానం ఇచ్చారు.

"సరే! పదండీ!" అంటూ అందరూ కలిసి భీమారావు భార్యాపిల్లల్ని ఇంట్లోకి తీసుకెళ్ళి "చూడమ్మా! భర్తను పోగొట్టు కున్న నీ బాధేంటో మేం అర్థం చేసుకోగలం. మేం నీ భర్తను తెచ్చివ్వలేం గాని, ఇకనుండి మీ కుటుంబానికి సంబం ధించిన ప్రతి విషయంలోనూ అండగా మేముంటాం. కనుక మీరేమాత్రం భయ పడొద్దు.

ఎక్కడా, ఎన్నడూ జరగని విధంగా ప్రభుత్వం తరపున హైదరాబాద్ నుండి మీ కోసమే పనిగట్టుకొని వచ్చిన పెద్దమ నిషిని అలా నిలబెట్టి ఉంచడం బావో లేదు. చెక్కు తీసుకో. తీసుకున్నంత మాత్రాన మనమేదో గవర్నమెంట్‌కి లొంగిపోయినట్టు కాదు. అన్నింటికంటే ముఖ్యంగా నీ భర్త ప్రాణానికి రేటు కట్టి ఇస్తున్నారని అనుకోవద్దు. ఎస్సై చేసిన దుర్మార్గానికి ప్రభుత్వం చెల్లించుకుంటున్న ప్రాయశ్చిత్తం అనుకో. దేనికైనా పట్టు విడుపులు ఉండాలి. అలా ఉంటేనే ముందుకు పోగలం" అంటూ ఆమెకు అర్థ మయ్యేలా వివరించి చెప్పారు.

ఆఖరికి వాళ్ళ మాట మీద గౌరవం తోనూ, ముందు ముందు తమ కుటుంబా నికి ఏది జరిగినా ఆదుకుంటారన్న నమ్మ కంతోనూ "మీ ఇష్టం ఎలాగుంటే అలాక్కానీయండి" అంటూ నెమ్మదిగా బయటికొచ్చి, హోంమంత్రిగారి దగ్గర్నుండి చెక్కు అందుకుంది భీమారావు భార్య.

ఊరు జనమంతా గమ్మునుండిపో యారు.

విలాసపురం నుండి రామ్మూర్తి వాళ్ళ ఊరు తిక్కవరానికి వెంటనే బయలుదేరి వెళ్ళాడు హోం మినిస్టర్.

మరికొన్ని వందలమంది జనం మంత్రి కోసం అటు ఉరుకులు పెట్టి, ఇటు ఉరు కుటు పెట్టి, ఎక్కడా అతణ్ణి పట్టుకోలేక చివరికి అక్కడికి వస్తాడనే నమ్మకంతో, హోంమంత్రి తిక్కవరం చేరేసరికి అక్కడికి వచ్చి ఉన్నారు.

మంత్రి కారు చూడడంతోటే అక్కడ గుమిగూడిన జనమంతా...

"సాధిస్తాం... సాధిస్తాం... భీమారావు, రామ్మూర్తీల ఆశయాలను సాధిస్తాం"

"ప్రాణాలైనా అర్పిస్తాం - పవర్ ప్లాంట్‌ను అడ్డుకుంటాం"

"ఎస్సైని వెంటనే కఠినంగా శిక్షించాలి" అంటూ దిక్కులు దద్దరిల్లిపోయేలా నినా దాలు అందుకున్నారు.

ఆ నినాదాల హోరు మధ్యే రామ్మూర్తి తోడబుట్టినవాళ్ళను పరామర్శించి, చెక్కు అందించిన వెంటనే వెనుదిరిగి కారు ఎక్క

బోతున్న హోంమంత్రిని అడ్డుకున్న జనం "అవతల శవయాత్ర ముగింపు దశకొచ్చింది. మీరు స్వయంగా అక్కడికొచ్చి శవాలను చూసి వెళ్ళాల్సిందే" అంటూ అడ్డుకున్నారు.

"ఈ పరిస్థితిలో జనంతో వాదన పెట్టుకొని అక్కడికి వెళ్లకుండా ఉండటంకన్నా వెళ్ళి చూసిపోవడమే మంచిది" అనుకున్న హోం మంత్రి సరేనంటూ కారును శవ యాత్ర దిశగా మళ్ళించాడు.

ఆయన కారు వెనుక బైక్‌లు, స్కూటర్ల మీద జనం తరలివచ్చారు.

ఏ బీల కోసం భీమారావు, రామ్మూర్తి ప్రాణాలు విడిచారో, ఏ బీలలోనైతే పోలీసు తూటాలకు తమ వెచ్చని రక్తాన్ని ధారబోశారో, ఆ బీలలోనే వాళ్ళిద్దరికీ చితులను ఏర్పాటు చేశారు.

వనగిరిలోని జనం మొత్తం సుశిక్షితులైన సైనికుల మాదిరిగా వరుసల్లో నడుస్తూ మృతులకు జోహార్లు అర్పిస్తూ చివరి మజిలీకి శవాలను తీసుకొచ్చారు.

సరిగ్గా ఆ సమయానికే అక్కడికి చేరుకున్న హోంమంత్రి గబగబా కారు దిగి పోలీసులు అందించిన రెండు పూల దండలను శవాల మీద వేసి నమస్కరించి, ఆ పరిస్థితిలో ఇంకా ఎక్కువసేపు అక్కడ ఉండడం మంచిది కాదన్న ఉద్దేశంతో జనాన్ని ఉద్దేశించి "మీ ఆందోళనను ఓ వ్యక్తిగా నేను అర్థం చేసుకోగలను. మీ అభ్యంతరాలను ప్రభుత్వానికి తెలియజేస్తాను" అంటూ నాలుగు సానునయ వాక్యాలు మాట్లాడి వెంటనే కారెక్కి వెళ్ళిపోయాడు.

వాళ్ళూ వాళ్ళూ ముందే ఫోన్లలో సంప్రదించుకుని ఉన్నట్టుగా మంత్రి కారు అటు వెళ్లిన ఐదు నిమిషాలకు, ఇటువైపు నుండి ప్రతిపక్ష నాయకుల కార్లు నాలుగు బీలలో ఏర్పాటు చేసిన చితుల దగ్గరికి రయ్యిమంటూ దూసుకొచ్చాయి. కార్లు దిగి వస్తున్న ప్రతిపక్ష నాయకులను చూడగానే జనం వెర్రి ఆనందంతో వాళ్ళకు ఎదురేగి శవాల దగ్గరికి తీసుకెళ్ళారు.

వాళ్ళంతా శవాలకు దండలు వేసి "ఇంత పచ్చటి బీలను బంజరు భూమిగా చూపించి మీ మంత్రి, ఎంపీలు బినామీ పేర్లమీద పవర్‌ప్లాంట్ కట్టడానికి పూనుకోవడం నిజంగా శోచనీయం. మీరు పవర్ ప్లాంట్ నిర్మాణానికి వ్యతిరేకంగా ఇదే విధంగా ఆఖరిదాకా పోరాటం చేయండి. మీ వెనుక మేమున్నాం. అంతిమ విజయం ప్రజలదే.. ప్రజా ఉద్యమాలదే" అంటూ పడికట్టు పదాలతో క్లుప్తంగా ప్రసంగించారు. వాళ్ళ ప్రసంగాలు అయిపోగానే చితులకు నిప్పంటించారు.

> ## కొత్తగాలి...
>
> **టీవీ కెదురుగా**
> **మావాడి మీల్స్**
> **మసాలా వార్తలు**
> **నంజుకుంటూ!**
>
> *- కందేపి రాణీప్రసాద్*

చూస్తుండగానే కాళిక నాలుకల్లా సాగిన మంటలు క్రమంగా చితులను ఆక్రమించాయి.

పశ్చిమాకాశాన వడి తగ్గి క్రమంగా తేజస్సును కోల్పోతున్న సూర్యుడు తన కిరణాలతో ఆకుపచ్చ నేల మీద సింధూర వర్ణాన్ని చిందిస్తున్నాడు.

వచ్చిన జనం విషణ్ణ వదనాలతో ఒక్కొక్కరే వెనుదిరిగి పోయారు.

'రెండు నిండు ప్రాణాలను బలితీసుకొనే దాకా వచ్చిన ఆ ఉద్యమాన్ని ముందు

ముందు ఏం చేయాలి? ఏ పద్ధతుల్లో నిర్వహించాలి? ' అన్న ఆలోచనల్లో కూరుకుపోయిన, కృష్ణారావు మాష్టారుని కొంత సేపు ఒంటరిగా వదిలిపెట్టి నిశ్శబ్దంగా చితిమంటల వంక చూడసాగారు మల్లీశ్వర్, రాజశేఖర్‌వాళ్ళంతా.




సమయం రాత్రి తొమ్మిది గంటలు.

దశమి చంద్రుడు వెన్నెల తరగలను నిశ్శబ్దంగా పుడమి మీదకు విరజిమ్ముతున్నాడు.

బీల గ్రామాల్లో పవర్ ప్లాంట్‌కి వ్యతిరేకంగా ఏర్పాటు చేసుకున్న గ్రామ కమిటీ సభ్యులంతా ఆడామగా అన్న విచక్షణ లేకుండా కొందరు కాలినడకన, కొందరు సైకిళ్ళమీద, కొందరు స్కూటర్ల మీద, మరి కొందరు ఆటోల మీద, ఎక్కువమంది కాలినడకన ఎవరి వీలును బట్టి వాళ్ళు వచ్చి స్వామిపేటలోని కృష్ణారావు మాష్టారి ఇంటిముందు వేపచెట్టు కింద కూర్చుని మెల్లగా మాట్లాడుకోసాగారు.

వచ్చిన వాళ్ళందరినీ పది గంటలవేళ పరికించి చూసిన రమణమూర్తి చివరికి "అందరూ వచ్చినట్టేనా? " అన్నాడు ఇంకా ఏదో ఆలోచిస్తూ.

"వచ్చినట్టే" అన్నట్టుగా అందరూ తలలు ఊపారు.

దాంతో "ఇక మొదలెట్టండి మాష్టారూ? " అంటూ మాష్టారు వంక చూశారు సుందరరావు.

సుందరరావు మాటలు విన్న మాష్టారు 'ముందుగా నువ్వు మాట్లాడు' అన్నట్టు మల్లీశ్వర్ వంక చూశాడు.

"ఇప్పుడు మాట్లాడాల్సింది మేం గాదు మాష్టారు! మీరే.. మీరు మాట్లాడిన తరువాత ఇంకేదైనా మిగిలిపోతే అప్పుడు మేం మాట్లాడతాం" అంటూ నిష్కర్షగా చెప్పాడు మల్లీశ్వర్.

'అంతే.. అంతే' అన్నట్టు చూశారు వచ్చినవాళ్ళంతా ఏకవాక్య తీర్మానంలా.

అందరితోపాటూ తనూ కిందనే పట్టా మీద కూర్చున్న కృష్ణారావు మాష్టారు ఒక్కసారి అక్కడ కూర్చున్న వాళ్ళందరి వంకా తేరిపార చూసి "ఈ మధ్యకాలంలో మన రాష్ట్రంలో జరిగిన విద్యుత్ ఉద్యమంలో బషీర్‌బాగ్ కాల్పుల తరువాత, ఇండ్లస్థలాల కోసం జరిగిన భూ పోరాటంలో ముదిగొండ కాల్పుల తరువాత, మహబూబ్ నగర్లో గిట్టుబాటు ధరల కోసం ఉద్యమించిన రైతులమీద కాల్పుల తరువాత, కృష్ణపట్నంలో బతుకుతెరువు పోతుందంటూ ప్రైవేట్ పోర్ట్ నిర్మాణాన్ని అడ్డుకొన్న జాలరుల మీద జరిగిన కాల్పుల తరువాత... అప్పటిదాకా మహోద్ధృతంగా కొనసాగిన ఆ ఉద్యమాలు కారణాలు ఏవైనా కానివ్వండి... కానీ, పోలీసుల కాల్పుల్లో ఉద్యమకారులు అమరులైపోయిన వెంటనే పాల పొంగు మీద నీళ్ళు చిలకరించినట్టుగా చప్పున చల్లారిపోయాయి.

ఇప్పుడు మన ఉద్యమం కూడా భీమారావు, రామ్మూర్తుల బలిదానాల తరువాత అలాగే చల్లారిపోతుందేమోనన్న ఒక భయం నా మనసును ప్రతిక్షణం వేరుపురుగు తొలిచినట్టు తొలుస్తోంది" అంటూ మొన్నటి నుండి తనలో చెలరేగుతున్న సందేహాల కార్చిచ్చును కార్యకర్తల ముందు

బహిరంగ పర్చాడు.

"లేదు మాష్టారు.. లేదు. మన ఉద్యమం అలగవ్వడానికి వీల్లేదు. ఈ ఉద్యమం మన భీమారావు, రామ్మూర్తుల చావును స్ఫూర్తిగా తీసుకొని ఇంకా ఉవ్వెత్తున ఎగిసిపడాలి తప్ప వరిగడ్డి మంటలా చప్పున చల్లారిపోకూడదు!" తనలో రగులుతున్న ఆవేదనను తూటాలవంటి మాటలతో వ్యక్తపరచడంలో అంత అనుభవం లేదన్న సంశయంతోనే తాను చెప్పదలచుకున్న నాలుగు మాటలను అందరికన్నా ముందుగా చెప్పారు సుందరరావు.

"ఔను గదా! అల్లానాడు కోరన్న, మంగన్నలు పోలీసుల కాల్పుల్లో నేలకొరిగిపోగానే ఉద్దెమం ఆగిందేటి? నిజానికి ఆల్లు అమరులైపోనాకే గదా.. అప్పటి పోరాటం పురుడోసుకుంది. అదిగదు మన సెరిత్ర. అల్లటువంటి సెరిత్రకు మనం వారసులం గదూ!

అల్లాగే యిప్పుడు గూడా మన భీమారావు, రాంమూర్తి ఇద్దరే అమరులైపోనారు. ఆ ఇద్దరి సావుతో మరో పోరాటం పుట్టుకు రావాల. పానాలు పోయినా భేత్తరేగాని ఆ పవర్‌ప్లాంట్‌ను మాత్రం కట్టనియ్యకూడదు" బురదపాలెం నుండి వచ్చిన గ్రామ కమిటి సభ్యుడు, అక్కడ చేరిన వారిలో అందరికన్నా పెద్దవాడు, సాయుధ పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొన్న బాదిశ ముత్తన్న అలనాటి సంఘటనలు కళ్ళ ముందు కదలాడుతున్నవాడిలా అర మోడ్పు కళ్ళతో సుదూర దిగంతాల్లోకి చూస్తూ ఉద్వేగంగా చెప్పుకొచ్చాడు.

అప్పటికింకా కునికిపాట్లు పడుతూ అందరికంటే వెనుక ఓ మూలకు ఒదిగి కూర్చున్న ఎండమ్మ బాడిశ ముత్తన్న మాటలతో మత్తు వదిలిపోయినట్టు ఒక్కసారిగా కలుగజేసుకుంటూ "మేం ఆడోల్లం తలుసుకున్నమంటే ఆ కంపెనీవాడే గాదు వాడి బాబైనా తోకముడిసీల్సిందే.

నా సిన్నప్పుడు మా అమ్మమ్మ సెబుతుండేది. ఆ నాడు గరుడభద్ర భూస్వామి దగ్గిర్నుండి భూమిని ఇముక్తం చేసి, పేదోల్లకు పంచేదానికి మా ఆడోల్లు ఎంత పోరాటం జేసిరో, ఎంత చరిత్ర సృష్టించీరో మీలాటి సదుకున్న బావులందరికీ తెలిసిందే గదా! అవసరమైతే ఇప్పుడు గూడా మా డ్రాక్రా సభ్యులందరం కూడినమంటే అంతకంటే ఎక్కువే పోరాటం సేస్తా మేటనుకుంతున్నారో? " తనలో ఎంత ఆవేశం ఉందో, ఎంత నాయకత్వపు పటిమ దాగి ఉందో మరోసారి అప్రయత్నంగా వ్యక్తపరుస్తూ వడిసెలతో రాళ్ళు రువ్వినట్టు మాటలు రువ్వింది.

ఆనాడు ఉద్యమంలో భాగంగా గరుడభద్ర భూస్వామి భూములను పేదవాళ్ళు ఆక్రమించుకున్న సందర్భంలో గరుడభద్ర తదితర గ్రామాల నుండి దాదాపు వంద మంది మహిళలను అరెస్ట్ చేసి తీసుకుపోయిన పోలీసులు వాళ్ళమీద రకరకాల కేసులు బనాయించి సంవత్సరం పాటు జైలుకు పంపించారు.

ఆ ఆడవాళ్ళు అందుకు ఏమాత్రం భయపడకుండా, ఇల్లు వాకిళ్ళను, పిల్లాపాపలను, సంసారాలను వదిలిపెట్టి జైళ్ళ కెళ్ళారు.

## కొత్తగాలి...

**బొగ్గు లేక**
**పవరు కోత**
**పవరు లేక**
**బొగ్గు కొరత**

– తల్లాప్రగడ మధుసూదనరావు,
బెంగళూరు

మరుసటి సంవత్సరం సంక్రాంతికి ముందు ప్రభుత్వం వాళ్ళను విడుదల చేసినప్పుడు ఆ వీర నారీమణులకు గ్రామ గ్రామాన ఘనస్వాగతం పలుకుతూ జనం నీరాజనాలు పట్టిన దృశ్యం అక్కడ కూర్చున్న వయసు మళ్ళినవాళ్ళ కళ్ళ ముందు మరోసారి సాక్షాత్కరించి వంటి మీది రోమాలు నిక్కబొడుస్తుంటే అలా అలా ఊహించుకుంటూ గతస్మృతులలోకి వెళ్ళిపోయారు.

ఎక్కడైనా, ఎప్పుడైనా గత ఉద్యమాల పోరాట పునాదుల మీద ప్రస్తుత ఉద్యమాలు నిర్మిస్తే తప్ప అమరులైన ఆ ప్రజా నాయకులను స్ఫూర్తిగా తీసుకుని ఒక్కో అడుగూ ముందుకు వేస్తే తప్ప భవిష్యత్తు తరాలకు మనుగడ ఉండదు. అలాంటి పోరాటాలు మనం కూడా ఈ రోజున చేయకపోతే ఈ తరం నాయకులు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో శ్రమజీవుల శ్రమను మాత్రమే కాదు, వారి జీవితాలనూ కార్పొరేట్ పెట్టుబడిదారులతో కలిసి ఏనుగులు వెలగపండ్లు మింగినట్లు మింగేస్తారు.

కృష్ణారావు మాష్టారు దగ్గర్నుండి ఎండమ్మదాకా ఎవరి స్థానంలో వారు, ఎవరి స్థాయిలో వారు ఎన్నిరకాలుగా ఆలోచించినా అందరిలోనూ అంతిమంగా ఒకటే ఆలోచన. అది...

ఆందోళన ఇంకా ఉధృతంగా కొనసాగించాల్సిందే. అందుకు జీవభద్ర దీక్షా శిబిరాన్ని 'పవర్‌ప్లాంట్‌ను శాశ్వతంగా ఉపసంహరించుకుంటున్నాం' అంటూ కంపెనీ వాడు స్పష్టంగా ప్రకటించేంతవరకూ కొనసాగించవల్సిందే.

ఒకపక్క వీధుల్లో ప్రజా ఉద్యమం జరుగుతుంటే, మరోపక్క అసెంబ్లీలో రాజకీయ యుద్ధం రగులుకోవడంతో అనివార్యంగానైనా అన్ని రాజకీయపక్షాలూ ఉద్యమం పట్ల సానుకూలంగా స్పందించి ప్రజాపోరాటంలోకి కలిసిరాక తప్పని పరిస్థితులు నెలకొన్నాయి.

ఇంకోపక్క సంఘటన జరిగిన రోజే అప్పిలేట్ అథారిటీ తీర్పు ప్రజానుకూలంగా రావడంతో ఒక్కసారిగా అనేక అంశాలు ఉద్యమానికి సానుకూలంగా కలిసి వచ్చాయి. ఇదంతా యాదృచ్ఛికమే అయినా అదో అనివార్య పరిణామం అనుకున్నారు మాష్టారువాళ్ళు.

ఇన్ని అనుకూల అంశాల మధ్య కొనసాగుతున్న ప్రజా ఉద్యమానికి తలవంచిన రాష్ట్ర ప్రభుత్వం "పవర్‌ప్లాంట్ నిర్మాణాన్ని తాత్కాలికంగా నిలిపివేస్తున్నాం" అంటూ అసెంబ్లీ సాక్షిగా తాత్కాలిక ఉపశమన ప్రకటన చేసింది. కానీ శాశ్వతంగా దానిని ఆపుతున్నట్లు మాత్రం ప్రకటించలేదు.

జరిగిన ఒక్కో సంఘటనను సమగ్రంగా తనచుట్టూ కూర్చుని ఉన్న జనానికి అప్పటిదాకా వివరించిన కృష్ణారావు మాష్టారు తన మాటలను వాళ్ళు ఎలా స్వీకరిస్తున్నారో పరిశీలించడానికన్నట్టు ఒక్కసారిగా మాట్లాడడం ఆపేశారు.

"అవును, నిజమే. ఇంత జరిగినా ముఖ్యమంత్రి విషయాన్ని పూర్తిగా తెగ్గొట్టకుండా కేంద్రంతో మాట్లాడాలి అంటూ నిప్పుల మీద నీళ్ళు జల్లినట్టు సమస్యను తాత్కాలికంగా చల్లబర్చాడంతే!" అక్కడ కూడిన వాళ్ళంతా అదేమాట చెప్పసాగారు.

"అసలే నరమాంసానికి అలవాటుపడ్డ పులి. అందులోనూ దెబ్బతిన్న పులి. ఇంకెన్ని రకాలుగా మనిషిని వేటాడడానికి వ్యూహం పన్నుతుందో? ఏ రూపంలో దెబ్బ తీస్తుందో? ఎవరూ చెప్పలేరు. ఎప్పుడన్నా పులి తాత్కాలికంగా వెనుకడుగు వేసినట్టు కనిపించినా ఇంతకుముందుకన్నా బలంగా ప్రత్యర్థి మీదికి దాడికి తెగబడుతుంది.

మన శత్రువుకి, ఆ పులికీ ఎందులోనూ తేడాలేదు. అందుకే మనం ఇంతకు ముందుకన్నా సమిష్టిగానూ, ధైర్యంగానూ నిలబడి పనిచేయాల్సి ఉంటుంది" అంటూ వివరించారు కృష్ణారావు మాష్టారు.

ఒక బలమైన శత్రువును అంతే బలంగా ఢీకొనాలి. అందుకు ఐక్యత ఒక్కటే అసలైన ఆయుధం అన్న ఉద్దేశాన్ని వ్యక్తపరిచారు మాష్టారు.

"మాటేసి ఓపిగ్గా కూర్చుంటే ఎంతటి పెద్దపులైనా పడిపోవాల్సిందే. అన్నట్టు మన ఉద్యమానికి ముఖ్యంగా కావాల్సింది ఓర్పే. ఓర్పును అలవర్చుకుంటూ మన పనిని మనం చేసుకుపోదాం. అప్పుడు చచ్చినట్టు గెలుపు మన ముంగిట్లోకొచ్చి వాలుతుంది" అక్కడున్న వాళ్ళ గుండెల నిండా నమ్మకాన్ని నింపాలన్న ఆలోచనతో జనం వంక ఆశావహంగా చూస్తూ తన మనసులోని మాటను బైటికి వ్యక్తపరుస్తూ మాట్లాడాడు లాయర్ రాజశేఖర్.

"మీరంతా చెప్పినట్టే జీవభద్ర శిబిరాన్ని నడుపుతూ కొద్దిరోజులపాటు అటు గవర్నమెంట్, ఇటు కంపెనీవాళ్ళూ ఏం చేస్తారో వేచి చూద్దాం. వాళ్ళ స్పందననుబట్టి మన ప్రతిస్పందనను చూపిద్దాం" రాజశేఖర్ చెప్పిందాన్ని బలపరుస్తూ సుందరరావు మాష్టారు కూడా స్థిరంగా మాట్లాడారు.

"నేను ప్రతిసారీ చెబుతున్నదే మళ్ళీ చెబుతున్నా. ఉద్యమంలో పాల్గొంటున్న చురుకైన ప్రతీ కార్యకర్త మీదా ఇటు మంత్రిగారి, ఎంపీగారి మనుషులతోపాటు అటు కంపెనీవారు కూడా నిఘా పెంచుతారు. కళ్ళముందు కరెన్సీ నోట్ల కట్టలను ఆడిస్తారు. పదవులు, కాంట్రాక్టుల వలలు విసురుతారు. ఉద్యోగాల ఎరలు వేస్తారు. మనకు తెలియకుండానే మన ఆడవాళ్ళ ద్వారా, మన పిల్లల ద్వారా కూడా సమాచారం రాబట్టుకుంటారు. కాబట్టి మనమంతా జాగ్రత్తగా మసలుకోవాలి" అంటూ కృష్ణారావు మాష్టారు మళ్ళోసారి అక్కడ చేరిన ప్రతి ఒక్కరి హృదయాలను తాకేలా అనేక జాగ్రత్తలు నూరిపోశారు.

"గవర్నమెంట్ నుండిగాని, కంపెనీ వాడి దగ్గర్నుండిగాని వచ్చే ఎలాంటి ఒత్తిడినైనా తట్టుకుంటాం.. ఎటువంటి బలహీనతలకు, బహుమతులకూ లొంగబోం" అంటూ అక్కడ చేరిన వాళ్లందరూ చనిపోయిన వారి మీద ప్రమాణాలు కూడా చేశారు.

అప్పటికే రాత్రి రెండు గంటలు కావస్తోంది.

చంద్రుడు పశ్చిమానికి వాలిపోతున్నాడు.

ఉండి ఉండి దూరంగా ఎక్కడో కుక్కలు మొరుగుతున్నాయి.

ఉద్యమ స్ఫూర్తిని గుండెల నిండుగా నింపుకున్న ప్రతి కార్యకర్తా సమావేశాన్ని ముగించుకొని ఎవరి ఇండ్లకు వాళ్ళు బయలుదేరారు.

★ ★ ★

స్వామిపేటలో కృష్ణారావు మాష్టారు ఇంట్లో బీల గ్రామాల జనం ఉద్యమ తీరుతెన్నుల మీద చర్చించుకుంటున్న సమయంలోనే అక్కడ హైదరాబాదులోని ఓ ఖరీదైన హోటల్‌లో వారికి వ్యతిరేక వర్గం కూడా పావులు కదిపేందుకు సమావేశమై తీవ్ర చర్చల్లో మునిగిపోయింది.

"ఇంత విపరీత పరిణామాలు చోటు చేసుకుంటాయని మేమెన్నడూ కలలోనైనా ఊహించలేదు"

"జనంలో ముఖ్యంగా మా ప్రాంతపు జనంలో పర్యావరణం మీద, బీల భూముల మీద ఇంత కదలిక వస్తుందనేది మా అంచనాలకు అందని అంశం"

హోటల్‌లో సమావేశమైన విదేశీ ప్రతినిధులతోనూ, కుచేలా కంపెనీ ఛైర్మన్

## బానిస బతుకులపై పుస్తకం!

చతుర ప్రపంచం

లలిత టాడెమి అనే నల్లజాతి అమెరికన్ యువతికి చిన్నప్పటి నుంచి ఆమె నాయనమ్మ ఎమిలీ, తన నాయనమ్మ గురించి కథలుగా చెప్పేది. లలిత పెద్దయ్యేసరికి ఎమిలీ నాయనమ్మ బానిసగా ఎక్కడి నుంచి వచ్చిందో, ఎవరి దగ్గర ఉండిందో తెలుసుకోవాలనుకుంది. ఆవిడ పెరిగిన లూజియానా రాష్ట్రంలోని కేన్‌రివర్‌కు నల్లజాతి వారిని ఆఫ్రికా నుంచి బానిసలుగా తెచ్చారని తెలుసుకుంది లలిత. దాంతో ఆమె తన నాయనమ్మ వివరాలు తెలుసుకోవాలని ఉబలాటపడింది. అయితే ఆవిడ పేరుగానీ, నిజంగా కేన్‌రివర్ దగ్గరకి ఆవిడను తెచ్చారా లేదా అనికాని లలితకి తెలియవు. అప్పటికే ఆమె స్వేచ్ఛ పొందిందా లేదా బానిసగానే వచ్చిందా అనేది తెలీదు. అయినప్పటికీ ఓ జీనియాలజిస్ట్(వంశావళి శాస్త్రవేత్త)ను తన ఎమిలీ నాయనమ్మ వివరాలు కనుక్కోమని కోరింది. అతను గంటకింత చొప్పున తీసుకుని పనిచేసాడు. క్రియోల్ ఫ్రెంచ్ భాషలో ఆనాటి బానిసల రికార్డ్స్ ఒక చోట లభ్యమయ్యాయి. దాదాపు పదివేల లోకల్ రికార్డులను పద్దెనిమిది నెలలపాటు చదివి ఆ జీనియాలజిస్ట్ ఎమిలీ నాయనమ్మ పేరు ఎలీసాబెత్ అని, 1850లో ఎనిమిది వందల డాలర్లకు ఆమెను బానిసగా కొనుక్కుని తెచ్చారని కనుగొన్నాడు. ఆ అమ్మకం తాలూకు బిల్లును లలిత చూసింది. బహుశా ఎలీసాబెత్ తన మనవరాలి మనవరాలు దాన్ని చూస్తుందని ఊహించివుండదు.




లలిత టాడెమీ 1800-1900 మధ్య బానిసల బతుకులపై 'కేన్ రివర్' అనే చారిత్రక నవల రాసింది. వార్నర్ బుక్స్ దాన్ని ప్రచురించింది కూడా. నవల వెలువడ్డ మూడు నెలలకే అమెరికాలోనే అత్యధిక ప్రజాదరణ పొందిన టాక్ షో 'ఓప్రా విన్‌ఫ్రే'లో పాల్గొనేందుకు లలితకు ఆహ్వానం వచ్చింది. వరుసగా పదిహేడు వారాలు 'కేన్ రివర్' నవల బెస్ట్ సెల్లర్‌గా నిలిచింది.

తోనూ చెప్పుకొచ్చారు ఎం.పి. గంగాజరావు, మంత్రి నిశ్చింతరావు, ఒక విధమైన నిరాశా నిస్పృహలను వ్యక్తంచేస్తూ.

గంగాజరావు, నిశ్చింతరావుల వాలకాన్ని గమనించిన విదేశీ ప్రతినిధులు చిరునవ్వుతో "ఇంత మాత్రానికే స్థైర్యం కోల్పోకూడదు. ముఖ్యంగా మీలాంటి రాజకీయనాయకులకు ఇది అస్సలు పనికిరాదు. మేము ప్రపంచవ్యాప్తంగా అభివృద్ధి చెందుతున్న ఎన్నో దేశాల్లో పవర్ సెక్టార్ని అభివృద్ధి చేయడంకోసం ఎన్నో ప్రణాళికలతో వెళుతుంటాం. వెళ్ళిన ప్రతిచోటా ఇంతకంటే దారుణమైన సంఘటనలనెన్నింటినో ఎదుర్కొన్నాం. ఇవన్నీ మాకు మామూలు విషయాలే.

కచ్చితంగా ఇప్పుడే మనం జాగ్రత్తగా ప్లాన్ చెయ్యాలి. మీరు చెప్పిన ప్రకారం ఎంతో వెనుకబడి ఉన్న మీ ప్రాంత సామాన్య జనంలో ఇంత కదలిక రావడానికి మూలకారణం ఎవరు? వాళ్ళ వెనుక ఉన్న రాజకీయ బలం ఏమిటి? తదితర విషయాలను తెలుసుకుంటే అప్పుడు వాళ్ళను లొంగదీసుకోవడానికి లేదా కొనెయ్యడానికి మనమేం చెయ్యొచ్చో ఆలోచించుకుందాం. అప్పుడు మనకు తప్పకుండా ఏదో ఒక దారి దొరుకుతుంది" అంటూ

ఎంతో ఆత్మీయంగానూ, నమ్మకంతోనూ సముదాయించారు.

వాళ్ళు చెప్పిందంతా విన్న నాయకులిద్దరూ వెంటనే కల్పించుకుంటూ "ఈ మొత్తం ఆందోళనకు ప్రధాన కారకుడు ఇంకో ఏడాదిన్నర కాలంలో రిటైర్ కాబోతున్న ఓ స్కూల్ టీచర్. ఆయన పేరు కృష్ణారావు" అంటూ మాష్టారు మీది కోపాన్ని తమ మాటల్లో కసిగా వెళ్ళబోసుకుంటూ అతణ్ణి గురించి ఉన్నవీ లేనివీ చెప్పుకొచ్చారు.

"ఔన్నిజమే. అతను అక్కడే పుట్టి, అక్కడే పెరిగిన సాధారణ ఉపాధ్యాయుడే కాదు, అతను వామపక్ష భావజాలం నూటికి నూరు పాళ్ళు వంట బట్టించుకున్న అభ్యుదయవాది" నాయకులు చెప్పిందానికి తాము సేకరించిన సమాచారం మరికొంత జోడించి వివరించారు కుచేలా కంపెనీ ఛైర్మన్.

"అంతే కాదు, అతను డబ్బుకు లొంగే మనిషి కాదు. దాదాపుగా ఈ బీల గ్రామాలన్నింటిలో ఉపాధ్యాయుడిగా పనిచేసిన వాడు. తన సొంత ఖర్చులతో ఎంతో మంది పేద విద్యార్థులను పైకి తీసుకొచ్చినవాడు. అందుకే అతని మాటంటే ఆ బీల గ్రామాల్లోని ప్రజలకు విపరీతమైన గురి, గౌరవం" మరిన్ని వివరాలను అందజేశారు గంగాజగ్రావు, మంత్రి నిశ్చింతరావు లిద్దరూ.

నాయకుల మాటలను విన్న విదేశీ ప్రతినిధుల్లో టీమ్ లీడర్ అయిన ఉల్ఫ్ విన్సెంట్ కల్పించుకుంటూ "మీరు చెప్పేదంతా నిజమా?! ఒక మామూలు స్కూల్ టీచర్ మన ప్రాజెక్టుకు వ్యతిరేకంగా ఇంతపెద్ద మూవ్‌మెంట్ తీసుకొచ్చాడంటే నమ్మలేకపోతున్నాను. అయితే మీరెన్నైనా చెప్పండి వింటాను. కానీ, ఈ ప్రపంచంలో డబ్బుకు లొంగని మనిషున్నాడంటే మాత్రం నేను చచ్చినా నమ్మను. ప్రతి మనిషికీ ఒక రేట్ ఉంటుంది. ఎవరైనా ఆ రేంజ్, ఆ రేట్‌కి వెళ్ళి.. వాళ్ళను మీట గలిగితే చాలు, ఈజీగా పడిపోతారు. అతని రేంజ్ ఎంత? యాభై లక్షలా? కోటి రూపాయలా? ఎంత కావాలంటే అంతా విసిరిపారేద్దాం" తన ప్రతి మాటలోనూ బహుళజాతి కంపెనీల డబ్బు గబ్బు పొంగులు వారుతుండగా, నాయకులిద్దరి వంకా చులకనగా చూస్తూ గర్వంగా మాట్లాడాడు.

"మీరు చెప్పినట్టు మా ప్రయత్నాలు మేం చేస్తాం. కానీ ఆ కృష్ణారావు మాష్టారుతోపాటు మరో నాలుగు మొండి ఘటాలున్నాయి. నిప్పుకు గాలి తోడైనట్టు అతనికి వాళ్ళు జత కలిశారు. ఆ నలుగురూ మాష్టారు మంటల్లో దూకమంటే... 'ఎందుకు? ఏమిటి?' అని కూడా అడక్కుండానే దూకేస్తారు. కాబట్టి ముందా నలుగురినీ దెబ్బకొడితే తప్ప అతణ్ణి ఏం చెయ్యలేం" ఎవరి సహాయ సహకారాలతో ఎన్నికల్లో గెలిచి మంత్రి అయ్యాడో ఆ వ్యక్తులనే లక్ష్యంగా చేసుకుని పావులు కదపాలంటూ దుర్మార్గంగా మాట్లాడాడు మంత్రి నిశ్చింతరావు.

ఆ విధంగా ఆ హోటల్ గదిలో బీల భూముల ఉద్యమంలో పాల్గొంటున్నవారిని ఎవరెవరిని ఏ విధంగా డీల్ చేయాలో ఒక పథకం రూపుదిద్దుకుంది.

"ఒకవేళ మనం అనుకున్నట్టుగా వాళ్ళెవ్వరూ డబ్బుకు లొంగకపోతే?" అంతా విన్న తరువాత మళ్ళీ తన సందేహాన్ని బయటపెట్టాడు కుచేలా కంపెనీ ఛైర్మన్.

"ఏముంది? ఒక్కొక్కణ్ణీ లేపెయ్యడమే" కోపంగా అన్నాడు ఎంపీ.

"అలాగే చేశామనుకుందాం. ఆ తరువాత పర్యావరణ శాఖ, కోర్టులు అంగీకరించకపోతే?" మరో సందేహాన్ని మెల్లిగా

బయటపెట్టాడు కుచేలా కంపెనీ ఛైర్మన్.

"మంచి ప్రశ్న. నిజంగానే మీ దేశ న్యాయస్థానాలు, కొన్ని సంస్థలు మిగతా దేశాలకంటే కొంత ప్రజాస్వామికంగానే పనిచేస్తుంటాయి. సంచలనాత్మక తీర్పులిస్తుంటాయి. మీరన్నట్టు కోర్టు తీర్పులు మనకు వ్యతిరేకంగా వచ్చినా రావచ్చు. అప్పుడు మనం మరోచోట సముద్రానికి దగ్గర్లోనే స్థలం వెతుక్కోవాల్సి ఉంటుంది. ఈ పనులు చూస్తూనే మీరంతా అటువైపు కూడా దృష్టి పెట్టాల్సి ఉంటుంది" అంటూ సూచించాడు ఉల్ఫ్ విన్సెంట్.

"నాకు తెల్సి సముద్రానికి దగ్గరగా ఉండే మరెన్నో గ్రామాల్లో చాలా ప్రభుత్వ బంజరు భూములున్నాయి" అంటూ వాటి వివరాలు చెప్పుకొచ్చాడు నిశ్చింతరావు.

"బావుంది, మీరా పనిమీదే ఉండండి" ఎలుగుబంటిలా ఆవులిస్తూ మంత్రినెంతో ప్రశంసించాడు ఉల్ఫ్ విన్సెంట్.

ఆఖరున "ఎం.పి.కి, మినిస్టర్‌కు నాదో చిన్న విన్నపం" నాయకులిద్దరి వంకా చూస్తూ అన్నాడు కుచేలా కంపెనీ ఛైర్మన్.

"చెప్పండేవిటో? " ఒకేసారన్నారు నాయకులిద్దరూ.

"ఏం లేదు. ప్రభుత్వం తరపు నుండి మీరు ఎస్సైకి ఏ శిక్షా పడకుండా చూడాలి. ఎందుకంటే అటువంటి పోలీస్ అధికారులుండబట్టే మన్లాంటి వాళ్ళం పనులు చక్కబెట్టుకోగల్గుతున్నాం" నిలువునా ఇద్దరు అమాయకుల ప్రాణాలను బలిదీసుకున్న రాకాసి పోలీస్ అధికారిని కాపాడాలంటూ కుచేలా కంపెనీ ఛైర్మన్ ప్రాధేయపడ్డాడు నాయకులతో.

బయట పత్రికల ముందు, టీవీ ఛానళ్ళ ముందు మాట్లాడినదానికి పూర్తి భిన్నంగా హామీ ఇచ్చాడు మంత్రి నిశ్చింతరావు.

"ఓ ఆ విషయం మాకొదిలేయండి! మేం చూసుకుంటాం" అన్నాడు.

"అలాంటి పోలీసులు మీకంటే మాకే ఎక్కువ అవసరం. బయట ప్రతిపక్షాలు, పత్రికలు, ప్రజల నోళ్ళు మూయించడానికి ముందు అతణ్ణి సస్పెండ్ చేయించాం, అంతే. ఏడాదిలోపు ప్రమోషన్‌తో ఇంత కంటే మంచి చోట పోస్టింగ్ వేయిస్తాం, సరేనా!" అంటూ అభయమిచ్చాడు గంగాజల్రావు.

"ఆ రోజు జరిగిన సంఘటనతో విధులు నిర్వహిస్తున్న పోలీసుల మీద, ప్రెస్‌మీద దాడిచేసి కొట్టినందుకు, వాళ్ళ విధులను అడ్డుకున్నందుకూ ఆ కృష్ణారావు మాస్టారుతో సహా ముఖ్యమైన కార్యకర్తలందరి మీదా కేసులు బుక్‌చేసి లోపల తోయిస్తాం. అప్పుడుగాని మిగతా జనం బెంబేలెత్తిపోరు" పాము తన పిల్లల్ని తానే చంపుకున్నట్టు తన జిల్లా ప్రజల మీదనే కత్తి కట్టి ప్రతీకారం తీర్చుకోవాలంటూ ఇంకా ఏదేదో మాట్లాడాడు మంత్రి నిశ్చింతరావు.

"మనల్ని, మన పథకాల్నీ వాళ్ళెంత చికాకు చేశారో, అంతకు రెట్టింపు చికాకు వాళ్ళకు చెయ్యకపోతే మనమెందుకు? " కుచేలా కంపెనీ ఛైర్మన్ కోపంతో ఊగిపోతూ అన్నాడు.

"అంతే అంతే" అని ముక్తకంఠంతో అన్నారంతా.

## కొత్తగాలి...

**అబద్ధం**
**తెలియని**
**అమాయకురాలు**
**అద్దం!**

*– డి. నితీష్ చంద్రశేఖర్,*
కర్నూలు

★ ★ ★

ఉప్పెన ముందటి సంద్రంలా వారం, పది రోజులుగా బీల గ్రామాలంతటా ప్రశాంతంగానే ఉంది.

నివురు గప్పిన నిప్పులా ఎవరి పనులు వారు చేసుకుపోతున్నారు.

ఊళ్ళల్లోకి కొత్త మనుషులెవరొచ్చినా, కొత్త వాహనాలేవొచ్చినా గ్రామస్తులంతా నిలవేసి, 'మీరెవరు? ఎందుకొచ్చారు? ఎవరింటికొచ్చారు?' అంటూ వివరాలు తెలుసుకొని గాని వదలట్లేదు.

ఇంతలో... ఓ రోజు హఠాత్తుగా బీల గ్రామాల ప్రజలు, ముఖ్యనాయకుల ఇండ్ల మీదికి వచ్చిపడ్డ పోలీసులు "డ్యూటీలో ఉన్న పోలీసులను, ప్రెస్ వాళ్ళను అడ్డుకొని కొట్టించినందుకు మిమ్మల్ని అరెస్టు చేస్తున్నాం" అంటూ మాస్టారుతో మొదలు పెట్టి ఎంతోమంది నాయకులను, గ్రామస్తులను బలవంతంగా వ్యానుల్లో, లారీల్లో ఎక్కించుకుపోయి విశాఖపట్టణం జిల్లా జైల్లో పెట్టేశారు.

దాంతో జీవభద్ర శిబిరం దగ్గర రోజువారీ కార్యక్రమం నిర్వహించేవాళ్ళు లేకుండా అయిపోవడంతో ముందుకొచ్చిన ఎండమ్మ "ఆ పోలీసోల్లేటనుకుంతన్నారో ఏటో!? ఊళ్ళో మొగోల్లు లేకుంటే దీక్ష ఆగిపోద్దనుకున్నారేటో? ఆల్లు నేకపోతే నేటి ఆడంగులం మనం లేమేటి? మనమే ముందుండి మనోల్లొచ్చిందాకా శిబిరం నడిపిద్దాం... బేగొచ్చేయండి!" అంటూ తన తోటి ఆడవాళ్లకు ధైర్యం నూరిపోసి అందరినీ పోగేసి శిబిరం నిరాటంకంగా నడిపించసాగింది.

ఆడవాళ్ళకు తోడుగా హైస్కూల్, కాలేజీ విద్యార్థులు, చిన్న పిల్లలు కూడా రామదండులా ముందుకొచ్చి సాయం చేయసాగారు. ఆ విధంగా శిబిరానికి సంబంధించి ఒక ముఖ్యమైన సమస్య ఎండమ్మ చొరవతో ఇట్టే తీరిపోయింది.

జిల్లా న్యాయవాదుల సంఘం వాళ్ళు తమంతట తామే ముందుకొచ్చి జైల్లో ఉన్న వాళ్ళందరికీ తమ సొంత ఖర్చులతో బెయిల్ కోసం తీవ్రంగా ప్రయత్నించినప్పటికీ కోర్టు శెలవుల మూలంగా వారం రోజుల దాకా బెయిల్ దొరకలేదు.

ఇలా నాయకులు, ముఖ్య కార్యకర్తలు జైల్లో ఉండడం, మిగతా వాళ్ళను బైటకు తీసుకొచ్చే పనుల్లో తలమునకలైపోవడంతో బీల గ్రామాలన్నింటా ఒక భయంకరమైన నిశ్శబ్ద వాతావరణం అలుముకొంది. దీంతో హఠాత్తుగా ఏదో జరగబోతోందన్న ఓ ఆలోచన జనంలో మెల్లమెల్లగా వ్యాపించసాగింది.

జనం భయపడ్డట్లుగానే అదే అదునుగా భావించిన కుచేలా కంపెనీ యాజమాన్యం ఓ రోజు పొద్దున్నే కార్లల్లో, జీపుల్లో రెవెన్యూ అధికారులనూ, పోలీసులను ఎక్కించుకుని వచ్చి పగడపుపాతూరు మండలంలోని మధ్యపాడు, కొత్తూరు, కొడుమూరు తదితర గ్రామాల్లో ఒకేసారి ప్రభుత్వ భూములను సర్వే చేయించడం మొదలుపెట్టింది.

రోజుకు ఒక ఊళ్ళో సర్వే చేస్తే, అది చూసి మిగతా ఊళ్ళవాళ్ళు మేలుకుని సర్వేను అడ్డుకుంటారేమోనన్న ఆలోచనతో

**కొత్తగాలి...** 

**ఒకప్పుడు**
**పార్టీలకు సిద్ధాంతాలు**
**ఇప్పుడన్నీ**
**కూడికలు.. తీసివేతలే**

- బొండా శ్రీనివాసరావు,
అద్దంపల్లి, తూ. గో. జిల్లా

గ్రామస్తులను అయోమయంలోకి తోసేసి సర్వే పూర్తి చేయించాలన్న ముందు జాగ్రత్తతో ఆ విధంగా అన్ని ఊళ్లల్లోనూ ఒకే సారి సర్వే మొదలు పెట్టించారు.

అయితే కంపెనీ వాళ్ళ అంచనా సరిగ్గా అక్కడే దెబ్బతిని పోయింది. స్వామిపేట ఘటనతో బీల గ్రామాల్లోని ప్రజల్లో ఎంత అవగాహన పెరిగిందో, ఎంత ప్రతిఘటనను వాళ్ళు అలవర్చుకున్నారో, వాళ్లెంత చైతన్యవంతులయ్యారో అప్పటిదాకా కంపెనీ వారికి, అధికారులకు తెలిసిరాలేదు.

కంపెనీవాళ్ళు మందీ మార్బలంతో సర్వేకు దిగిన ప్రతి గ్రామంలో ముఖ్య నాయకులు లేనప్పటికీ ఊళ్ళో ఉన్న ఆడ, మగ, పిల్లాజెల్లా, ముసలీముతకా అందరూ వయసు తేడాల్లేకుండా స్వచ్ఛందంగా ముందుకొచ్చి పోలీసులు, లాఠీలు, తూటాలన్న భయం లేకుండా ప్రతిఘటించారు. 'మా భూములు సర్వే చేయడానికి వీల్లేదు' అంటూ ఒక్కపెట్టున నినదించారు.

అప్పటికే కంపెనీవాళ్ల మూలంగా పీకల్లోతు ఇబ్బందుల్లో కూరుకుపోయిన పోలీసులు, రెవెన్యూ సిబ్బంది 'ఎటుబోతే ఏం ముంచుకొస్తుందో? మనకెందుకొచ్చిన గొడవలే!' అని అంటీ ముట్టనట్టున్నారు.

దాంతో కంపెనీవాళ్ళు తట్టాబుట్టా సర్దుకొని, వచ్చిన దారిన చక్కా వెళ్ళిపోయారు.

అనుకోకుండా ఆ సంఘటన జరిగిన మూడో రోజుకల్లా జైల్లో ఉన్న వాళ్ళందరికీ బెయిల్ దొరికింది.

బయటికొచ్చిన వాళ్ళందరినీ లారీల్లో

ఎక్కించి జిల్లాకేంద్రం నుండి జీవభద్ర శిబిరం దాకా అడుగడుగునా నీరాజనాలు పడుతూ మేళతాళాలతో తీసుకొచ్చారు.

★ ★ ★

"ఆ కృష్ణారావు మాష్టారు రోజురోజుకూ జనం దృష్టిలో తిరుగులేని నాయకుడిగా ఎదిగి పోతున్నాడు. అతణ్ణి ఏదోవిధంగా అడ్డుకొని ఉద్యమానికి దూరం చేయకపోతే మున్ముందు రాజకీయంగా కూడా మనకు కంటిలో నలుసులా తయారైనా ఆశ్చర్యప డనవసరంలేదు. అందుకే ఏం చేయాలో ఆలోచిచండి!" ఓ రోజు రాత్రి ఢిల్లీలో ఉన్న ఎం.పి. గంగాజ్ర్రావుకి ఫోన్ చేశాడు మంత్రి నిశ్చింతరావు.

"నిజమే, నేనూ అదే అనుకుంటున్నా. ఇంతకుముందే కుచేలా కంపెనీ ఛైర్మన్ నా దగ్గరకొచ్చి వెళ్ళాడు. ఏదో ఒకటి చెయ్యకుంటే మేము ప్రాజెక్ట్ నుండి తప్పు కుంటామంటూ నాకు గట్టి డోస్ ఇచ్చి వెళ్ళాడు. నేనే నీకు ఫోన్ చేద్దామనుకుం టుంటే ఇంతలో నువ్వే చేశావు" అంటూ జరిగింది వివరించాడు ఎం.పి. గంగాజ ్ర్రావు.

అలా ఎంపీతో మాట్లాడి ఫోన్ పెట్టేసిన తరువాత...

తన మనసులో ఓ దుష్ట ఆలోచన రూపుదిద్దుకోవడంతో వెంటనే ఎవరికో ఫోన్ చేసి మాట్లాడుతూ మంత్రి నిశ్చిం తరావు. "రాష్ట్రంలో ఉవ్వెత్తున ఎగిసిన ఎన్నో ఉద్యమాలను తిరిగి తలెత్తకుండా మాడు పగులగొట్టి పాడె ఎక్కించిన మేము ఈ పవర్ ప్రాజెక్ట్ విషయంలో చీమల్లాంటి సాధారణ జనం చేతుల్లో ఓటమి ఒప్పుకొని మూలన కూర్చోవ డమా!? ఏమో పరిస్థితులు చూస్తే అల్లాగే కన్పిస్తున్నాయి. ఏది ఏమైనా ఆ కృష్ణా రావు మాష్టార్ని మళ్ళీ లేవకుండా దెబ్బకొ ట్టాలి. ఆ పని గంగాజ్ర్రావు వల్ల కాక పోతే, నేనే పూర్తిస్థాయిలో రంగంలోకి దిగి అతని సంగతేంటో అమీ తుమీ తేల్చుకో వాలి" అన్నాడు, టేబుల్ మీద ఉన్న ఫుల్ బాటిల్ ఖాళీ చేస్తూ. చాలారోజుల తర్వా త తన మనసుకి హాయిగా అన్పించడంతో ఆ రాత్రి కంటి నిండా నిద్రపోయాడు మంత్రి నిశ్చింతరావు.

అదే సమయంలో కుచేలా కంపెనీ ఛైర్మ న్‌కి ఫోన్ చేసిన ఎం.పి. గంగాజ్ర్రావు "చేతిలో బహుళజాతి కంపెనీని, కావాల్సి నంత రాజకీయ పలుకుబడి ఉండి కూడా పైసాకు కొరగాని ఓ మామూలు బడిపం తులు ముందు ఎందుకూ కొరగాని వాళ్ళుగా మిగిలిపోతున్నాం" అంటూ వాపోయాడు.

ఎం.పి. చెప్పిందంతా ఓపిగ్గా విన్న ఛైర్మ న్ "మీరు పడుతున్న బాధకు రెట్టింపు బాధ నేనూ పడుతున్నా. మన దగ్గర పలుకుబడి, డబ్బు, అధికారం, అంగబలం ఎన్ని ఉన్నా కాలం మన పక్షాన లేన ట్టుంది. అది లేనప్పుడు మిగతా ఎన్ని బలాలు ఉన్నా లాభం లేదు. అయినా నా వంతు కర్తవ్యంగా ఒక్కసారి ఆ మాష్టారికి నా మనుషులతో ఒక ఆఫర్ పంపిస్తాను. ఒప్పుకున్నాడా బతికిపోతాడు. లేదంటే ఈ భూమ్మీదే లేకుండా పోతాడు. ఇంక మీరు నిశ్చింతంగా నిద్రపోండి" అన్నాడు గట్టి భరోసా ఇస్తూ.

"మామూలు స్కూల్ మాష్టారే కదా అని అతణ్ణి తక్కువ అంచనా వేయకండి. డెబ్బై నాలుగేండ్ల ఓ ముసలివాడు అవినీ తికి వ్యతిరేకంగా మొత్తం దేశాన్నే ఒక్క తాటి మీదికి తెచ్చి కేంద్ర ప్రభుత్వాన్నే ముప్పుతిప్పలు పెడుతున్నాడు తెలుసు గదా!" అంటూ అన్నా హజారే గురించి ప్రస్తావించి, ఫోన్ పెట్టేసిన అతను టైమ్ చూసుకున్నాడు. అప్పటికే రాత్రి రెండు గంటలు దాటింది.

ఛైర్మన్ మాటలతో మందు తాగినంత హాయిగా అన్పించడంతో అప్పుడు ముసుగు పెట్టిన ఎంపీ తెల్లవారి పది గంటల దాకా నిద్ర లేవలేదు.

ఆ రాత్రంతా కుచేలా కంపెనీ ఛైర్మన్‌కు కంటిమీద కునుకు లేదు.




'ట్రింగ్, ట్రింగ్, ట్రింగ్' మంటూ కృష్ణారావు మాష్టారు ఇంట్లో ల్యాండ్ ఫోన్ యముడి దున్నపోతు మెడలో గంట మోగినట్టు భయంకరంగా మోగింది.

ఫోన్ మోతతో లేచి కూర్చున్న మాష్టారు కళ్ళు అప్రయత్నంగా గోడ గడియారం వంక పరికించి చూశాయి.

"ఈ తెల్లవారుజామున నాలుగు గంటలకు ఫోన్ చేస్తున్నవారెవరబ్బా?" అనుకుంటూ ఫోన్ ఎత్తాడు మాష్టారు.

"చూడండీ! మీరు ఉద్యమం నుండి తప్పుకుంటే మాకు మేముగా కోటి రూపాయలు ఆఫర్ ఇద్దామనుకుంటున్నాం. లేదు, మీకెంత కావాలో మీరే అడగండి. ఆ డబ్బులే కాక ఓ సంవత్సరంపాటు మీ భార్యాభర్తలిద్దరినీ ప్రపంచం మొత్తం తిప్పి చూపించే ఏర్పాట్లు చేస్తాం.

ఒకవేళ మీరీ ఆఫర్నీ కాదంటే మాత్రం తరువాత జరగబోయే పరిణామాలు చాలా దారుణంగా ఉంటాయి. జాగ్రత్తగా ఆలోచించుకోండి. మళ్ళీ ఎల్లుండి ఇదే సమయానికి ఫోన్ చేస్తాం" ఎన్నిసార్లు అడిగినా ఊరు, పేరు చెప్పకుండా ఫోన్ పెట్టేశాడు అవతలి వ్యక్తి ఎవరోగాని.

తెల్లవారి ఈ విషయం ఎవ్వరికీ చెప్పకుండా దాచిన మాష్టారు మళ్ళీ రాబోయే ఫోన్ కోసం వళ్ళంతా కళ్ళు చేసుకుని ఎదురు చూడసాగాడు.

చెప్పిన సమయానికి చెప్పినట్టుగానే మాష్టారికి మళ్ళీ ఫోనొచ్చింది.

ఫోనెత్తిన మాష్టారుతో "ఏమాలోచించుకున్నారు?" సూటిగా అడిగాడు ఫోన్లో నుండి ఆవలి వ్యక్తి.

"చెప్పక తప్పదా?" అవతలి వాడి దృష్టిలో చేప వలలో పడబోతుందన్నంత కవ్వింపుగా అన్నారు మాష్టారు.

"ఆ ఆ చెప్పండి! చెప్పండి! అవతలి స్వరం ఉత్సాహంగా విన్పించింది మాష్టారు గారికి.

"మీరు నన్ను డబ్బుతోనో, ఇతరత్రా ప్రలోభాలతోనో కొనగలమనుకుంటే అది మీ భ్రమ. మరోసారి ఇటువంటి ఫోన్ చేసారంటే నేను చేయాల్సిన పని చేస్తాను జాగ్రత్త" నొప్పి తెలియకుండా గాయం చేసే చురకత్తుల లాంటి మాటలు విసిరారు కృష్ణారావు మాష్టారు.

వలలోకి వస్తుందనుకున్న చేప కాస్తా వలను తెంపుకొని మరీ బయటకు పోయినప్పుడు ఆ వేటగాడి గొంతులో విన్పించేటంతటి నైరాశ్యం అవతలివైపు గొంతులో నుండి తన్నుకొస్తుంటే, దాన్ని బలవంతంగా అదిమిపెడుతూ "ఇదే మీ ఆఖరి నిర్ణయమైతే దాని ఫలితం ఎంత దారుణంగా ఉంటుందో మీరు త్వరలోనే రుచి చూస్తారు!" అంటూ ఫోన్ కట్ చేసింది.

'ఈ పరిణామాలన్నీ చివరికి ఎక్కడికి దారి తీస్తాయో' అనుకుంటూ తీవ్ర ఆలోచనల్లో మునిగిపోయిన మాష్టారికి మళ్ళీ నిద్రపట్టలేదు.

★ ★ ★

ముందుగా అనుకున్న ప్రకారం బీల గ్రామాల కమిటీ సభ్యులంతా జీవభద్ర శిబిరం దగ్గరకి చేరుకున్నారు.

ఆ రోజు దీక్షలో కూర్చోబెట్టవలసిన వాళ్లను కూర్చోబెట్టిన తరువాత శిబిరాన్ని ఉద్దేశించి మాట్లాడుతూ "ఈ మధ్య రెండు, మూడుసార్లు అర్ధరాత్రి ఎవరో ఫోన్లు చేసి నీకు యాభై లక్షలిస్తాం ఉద్యమం నుండి తప్పుకో.. మేం చెప్పినట్లు ఒప్పుకోకపోతే ఫలితం అనుభవిస్తావంటూ నన్ను బెదిరిస్తున్నారు" గత వారం రోజులుగా జరిగిన సంఘటనలను ఒక్కొక్కటిగా వివరించాడు మల్లీశ్వర్.

"నాకూ అలాంటి ఫోనే వచ్చింది" అన్నాడు రమణమూర్తి

"నాకూ వచ్చింది" అన్నాడు రాజశేఖర్.

"నాకూ వచ్చింది" అన్నారు సుందరరావు.

ఒక్కొక్కరూ బయటపడి చెబుతుంటే విస్తుపోతూ విన్న కృష్ణారావు మాష్టారు మాత్రం తనకూ ఫోనొచ్చిన విషయం బయటపెట్టకుండా "ఇలాంటి ఫోన్లకే భయపడి ఉద్యమం నుండి పారిపోయే వాళ్లమే అయితే అసలు ఇంత దూరం వచ్చేవాళ్ళమే కాదు కదా? అయినా వాళ్ళు ఇంతమందిని ఏం చేస్తారో అదీ చూద్దాం.. కానివ్వండీ" అంటూ కార్యకర్తల్లో భయాందోళనలు కలుగకుండా, ఆ విషయానికి అంత ప్రాముఖ్యం ఇవ్వనవసరం లేదన్నట్లుగా మాట్లాడుకొచ్చారు.

"సరే! కాస్సేపు ఆ ఫోన్ల గొడవ పక్కన బెట్టి అసలు విషయానికొద్దాం" ఆ రోజు అసలక్కడికెందుకొచ్చారో ఆ విషయం గురించి మాట్లాడాలన్నదాన్ని అన్యాపదేశంగా సభ్యుల ముందుకు తెచ్చారు లాయర్ రాజశేఖర్.

"నువ్వు చెప్పు" అన్నట్లు మల్లీశ్వర్ వంక చూశారు కృష్ణారావు మాష్టారు.

సరేనన్నట్టు మైక్ అందుకున్న మల్లీశ్వర్ "సోదరులారా! ఆ రోజున తాతారావు మొట్టమొదటిసారిగా మన బీల గ్రామాల్లో కొచ్చి చేపల చెరువుల కోసమంటూ మన్ని మోసం చేసి దాదాపు వెయ్యెకరాల దాకా కంపెనీ కోసమే భూముల్ని కొన్నాడు. చివరికా మోసం కాస్తా బయట పడ్డంతో మనం ఉద్యమం బాట పట్టాం. ఇప్పుడొకవేళ కంపెనీవాడు కావాలనే ముందుకొచ్చి 'మా డబ్బులు మాకివ్వండి, మీ భూములు మీకిస్తాం' అన్నాడనుకోండి అప్పుడేటి మన పరిస్థితి? డబ్బులు తీసుకున్న వాళ్ళంతా వాటిని తిరిగి ఇచ్చి ఎవరి భూములు వాళ్ళు తీసుకోగలరా? " అంటూ ఓ ప్రశ్నను జనం మధ్యలోకి సూటిగా సంధించాడు.

ఆ ప్రశ్నలోని అంతరార్థాన్ని గ్రహించిన భూములమ్మిన గ్రామస్తులు నెత్తిన ఏదో చలిపిడుగు పడ్డట్టే ఉలిక్కిపడ్డారు.

ఎందుకంటే వాళ్ళంతా ఎకరం, రెండెకరాల నుండి ఐదెకరాలలోపు వాళ్ళే. పైగా ఆదాయం తక్కువ, అవసరాలు ఎక్కువగా ఉండే చిన్న, సన్నకారు రైతులే. భూములు అమ్మగా వచ్చిన డబ్బులు చాలా అవసరాలకు అప్పటికే ఖర్చుపెట్టుకున్నారు. 'నిజంగా డబ్బులు వాపస్ ఇవ్వాల్సి వస్తే? ' అనేది వాళ్ళకు ఆలోచించడానికే మనసొప్పని అంశం!

అక్కడ చేరిన వాళ్ళందరిలోనూ గొప్ప అలజడిని, అశాంతిని, కలుగజేస్తుంటే "నిజంగానే కంపెనీవోడు అలగంటే మన మేటిసేద్దాం? ఏటి సేద్దాం? " అనుకుంటూ ఒకరి మొకాలొకరు చూసుకోసాగారు.

ఎంత ప్రశ్నించుకున్నా ఏం చేయాలో తోచని జనం ఆఖరికి "మాకేటి తెలట్లేదన్నా? ఏటి సెయ్యాలో మీరే సెప్పండి. మీరేటి సెయ్యమంటే మేం అల్లదేసేస్తాం"

అంటూ ఆ భారాన్ని కూడా నాయకుల మీదనే పెట్టారు.

"అవసరానికి భూములమ్ముకున్న మన వాళ్ళెవరి దగ్గరా డబ్బులుండవని మాకూ తెల్సు, మీకూ తెల్సు. అందుకే మనమో పన్జేద్దాం" జనం ప్రతిస్పందన కోసం మాట్లాడ్డం ఆపేసి వాళ్ళ వంకనే చూడసాగాడు మల్లీశ్వర్.

"అదేటో సెప్పన్నా! మద్దెలో ఆపేసినావేటి? " భయం భయంగా అన్నారు గ్రామస్తులంతా.

"చెప్పడానికేముంది? మనమంతా ఒక్క మాట మీద నిలబడి మా దగ్గర డబ్బుల్లెవ్వు.. కాబట్టి ప్రభుత్వమే కంపెనీ వోడికి డబ్బులు కట్టి, ఆల్లా భూములను స్వోధీనం సేసుకోవాల.

ఆళ్ళట్టా స్వాధీనం చేసుకున్న భూమిని అస్సలు భూమిలేని పేదోల్లకు సగం, సొంత భూమి వోళ్లకు సగం పంచి పెట్టాలంటూ ప్రభుత్వం మీద ఒత్తిడి తెద్దాం" అంటూ మల్లీశ్వర్ ఇంకేదో చెప్పబోతుండగానే ఒక్కసారిగా ఆనందంతో ముందుకొచ్చి మాష్టారినీ, మల్లీశ్వర్నీ రాజశేఖర్‌తో సహా ముఖ్య నాయకులందరినీ భుజాలకెత్తుకుని ఆనందంతో చిందులెయ్యసాగారు ఆ జనం.

కొంతసేపటి తరువాత ఉత్సాహపు పొంగు తగ్గిపోయిన జనాన్ని ఉద్దేశించి చూస్తూ గొంతు సవరించుకున్న కృష్ణారావు మాష్టారు "ఇప్పుడు మన మల్లీశ్వర్ చెప్పిందంతా వెంటనే జరిగిపోతుందనుకుంటే అంతకన్నా తెలివి తక్కువతనం మరొకటి ఉండదు. అలాగ అనుకుని ఎవరైనా భ్రమపడితే కచ్చితంగా దెబ్బతింటాం. ఇప్పుడు మనం చేసిన ఆలోచన నిజంగా జరగాలంటే మనం ఇప్పుడు చేస్తున్న ఉద్యమం కాదు, ఇంకా ఇంతకన్నా పెద్ద యుద్ధమే చెయ్యాల్సి ఉంటుంది. ఎందుకంటే అది చాలా పెద్ద విషయం అన్న సంగతి గుర్తుపెట్టుకోండి" వింటున్న వాళ్ళ మెదళ్లలో ఆలోచనల అగ్గిని రగిలిస్తూ మాట్లాడుకొచ్చారు.

మాష్టారు చెప్పిన ప్రతిమాటనూ పొల్లుపోకుండా శ్రద్ధగా విన్న జనం "మరిప్పుడు మేమేటి సెయ్యాల బావూ? నిజంగా మా భూమి మాకు వత్తాదంటే ఆ భీమారావు, రామ్మూర్తీల మాదిరిగా పానాలియ్యడానిగ్గూడ సిద్ధమే బావూ!" అంటూ కృష్ణారావు మాష్టారును చుట్టు ముట్టారు జనం.

"ఎల్లుండి ఉదయం పదిగంటలకల్లా మీరంతా ఇక్కడికొస్తే మనమంతా కలిసి ఊరేగింపుగా బయలుదేరి సోంపేట ఆర్డీఓ గారికి ఇదే విషయం మీద ఒక అర్జీ సమర్పిద్దాం. ఆ రాత కోతల విషయం అంతా లాయర్ రాజశేఖర్ చూసుకుంటాడు" అంటూ ఆనాటి సమావేశం యొక్క ఉద్దేశ్యాన్ని కూలంకషంగా వివరించారు మాష్టారు.

ఒక సరికొత్త ఆలోచనకు కొత్త ఉత్సాహంతో, భూమికోసం పోరు సాగించేందుకు ఒక సంపూర్ణ నిశ్చయంతో ప్రజలంతా జట్లు జట్లుగా తమలో తామే చర్చించుకుంటూ ఇండ్లకు మళ్ళారు.

అనుకున్న ప్రకారం జీవభద్ర శిబిరం దగ్గర్నుండి కనీవినీ ఎరుగని విధంగా బీల గ్రామాల్లోని ప్రజలంతా స్వామిపేట ఆర్డీవో ఆఫీస్‌కి ప్రదర్శనగా బయల్దేరారు.

వచ్చిన జనమంతా ఎంతో క్రమశిక్షణతో ఆడవాళ్ళు ఒక వరుసగా, మగవాళ్ళు మరో వరుసగా రైలు పట్టాల మాదిరిగా సమాంతరంగా నడుస్తూ జండాలు చేత పట్టుకుని కదులుతుంటే కృష్ణారావు మాష్టారు, మల్లీశ్వర్‌వాళ్లు మగవాళ్ల వరుసలో, ఎండమ్మ, ఢిల్లెమ్మ, పునివాసినిలాంటివాళ్ళు ఆడవాళ్ళ వరుసలో రైలు ఇంజన్ మాదిరి ముందు భాగాన నడుస్తూ ఆ ప్రదర్శనను కొనసా

గించారు.

"పవర్ ప్రాజెక్టును శాశ్వతంగా ఆపేస్తు న్నట్టు ప్రభుత్వం వెంటనే ప్రకటించాలి"

"కంపెనీ వాడు కొన్న బీల భూములను ప్రభుత్వం వెంటనే స్వాధీనం చేసుకుని, భూమి లేని పేదలకు పంచాలి" అంటూ దిక్కులు మారుమోగేలా దారి పొడవునా నినాదాలు చేయసాగారు. హైస్కూల్, రామాలయం, చర్చిసెంటర్, హాస్పిటల్ రోడ్డు మీదుగా సాగిన ఆ ప్రదర్శన ఆర్డీవో ఆఫీసుకి చేరేసరికి అక్కడో పెద్ద జనసం ద్రమైపోయింది.

దారి పొడవునా ఛానళ్ల వాళ్ళు ప్రదర్శ నను కవరేజి చేయసాగారు.

ఆర్డీవో ఆఫీస్ చుట్టూ సేఫ్‌గార్డులు, లాఠీలు పట్టుకున్న పోలీసులు వలయంగా ఏర్పడి నిల్చున్నారు.

ఎక్కడచూసినా విలేఖర్లంతా ఫొటోలు, వీడియోలు తీస్తూ హడావిడిగా ఉరుకులు, పరుగులు పెడుతున్నారు.

పోలీసు కాల్పుల తరువాత కనబడ కుండా పోయిన బొర్రయ్య, కన్న దాసువాళ్ళు మొదటిసారిగా జనం ముందు కొచ్చి కన్పించడంతో, ఆ దారి పొడవునా ఉన్న జనం, వారివంక అనుమానంగా చూస్తూ, కోపంతో రగిలిపోతూ "కంపెనీ వాడి చెప్పులు నాకే కుక్కలు ఇక్కడికెందు కొచ్చాయి? వెంటనే వెళ్ళిపోవాలి" అంటూ బిగ్గరగా అరుస్తూ వాళ్ళవైపు దూసుకె ళ్లారు.

జనాన్ని అడ్డుకున్న పోలీసులు బొర్ర య్యను, కన్నదాసును అక్కణ్ణుంచి వెళ్ళిపో మ్మంటూ ఆదేశించారు.

అయితే వాళ్ళు మాత్రం "మేం చేసింది తప్పే. మీరంతా కలిసి తిట్టినా, చంపినా ఇక నుండి మీ అందరితోనే మేమూ" అంటూ తన్నులు తినడానికి కూడా సిద్ధమ య్యారు.

అప్పుడు ముందుకొచ్చిన మాష్టారు "తప్పు చేసినవాళ్ళు ఎవరైనా, ఆ తప్పును ఒప్పుకుని మనతో కలిసిపోతామని ప్రాధే యపడుతుంటే కాదనడం తప్పు. కలిసొస్తా మన్న వాళ్ళందరినీ కలుపుకుపోవడం మన ధర్మం. కాబట్టి వాళ్లనేమీ అనొద్దు" అంటూ జనాన్ని శాంతింపచేశారు.

రెండు గంటల సేపు ఆర్డీవో ఆఫీసును దిగ్బంధనం చేసిన తరువాత "ముఖ్య నాయకులు పదిమంది లోపలికొచ్చి మెమో రాండం ఇచ్చి వెళ్ళండి" అంటూ ఆర్డీవో నుండి పిలుపొచ్చింది.

దానికి "లేదే లేదు. ఆర్డీవోగారే బయట కొచ్చి ప్రజల్ని ఉద్దేశించి మాట్లాడి ప్రజల సమక్షంలోనే మా మెమోరాండం అందుకో

> **కొత్తగాలి...**
>
> **నేటి**
> **సినీనటులే**
> **రేపటి**
> **రాజకీయ నాయకులు**
>
> - శైలశ్రీ,
> పెద్దచెల్మెడ, మెదక్ జిల్లా

వాలి" అంటూ నాయకులు తాము మాత్రమే లోపలికి వెళ్ళడానికి ససేమిరా ఒప్పుకోలేదు.

కబురు తెచ్చిన సిబ్బంది, నాయకుల వార్తను మోసుకుని లోపలికెళ్ళి గంట గడి చినా లోపలి నుండి ఏ సమాచారమూ రాకపోవడంతో అలాగే కంజరలు కొట్టు కుంటూ పాటలు పాడుకుంటూ మధ్య మధ్య నినాదాలు ఇచ్చుకుంటూ గడిపి విసి గిపోయిన జనం ఒక్కసారిగా గేట్లు తోసు కుంటూ లోపలికి దూసుకుపోవడానికి ప్రయత్నించారు. అప్పటిదాకా మౌనంగా

చూస్తూ నిలుచున్న పోలీసులు ఒక్కసారిగా లాఠీలు ఝుళిపిస్తూ నాయకులు, కార్యకర్తలు, ఆడామగ అన్న విచక్షణ లేకుండా వారిపై లాఠీ ఛార్జికి పూనుకున్నారు.

లాఠీఛార్జితో ఒక్కసారిగా అక్కడో పెద్ద తోపులాట జరిగిపోయింది. అరుపులు, కేకలు, ఏడుపులతో ఆర్డీవో ఆఫీసు ప్రాంగణమంతా మారు మోగసాగింది.

ఆ తొక్కిడిలో, ఆ తోపులాటలో కృష్ణారావు మాష్టారు కింద పడిపోయారు. పెద్ద మనిషి కింద పడిపోయారన్న కనికరం కూడా లేకుండా ముగ్గురు పోలీసులు ఆయన్ని చుట్టుముట్టి లాఠీలతో ఇష్టం వచ్చినట్టు కొట్టసాగారు.

మాష్టారు బాధతో విలవిల్లాడుతూ లాఠీ దెబ్బలకు చేతులు అడ్డుపెడుతూ గట్టిగా అరవసాగారు.

అంతే!

"ఓలమ్మో! ఓలమ్మో! సూస్తారేటేలమ్మ! మాస్టు బావును పోలీసులు సంపేత్తున్నారు గదే!" అంటూ అందరి కన్నా ముందుగా ఎండమ్మ అటువైపు పరుగందుకుంది.

ఆమె వెనుకే ఆడసైన్యం కదిలింది.

ఆ ముగ్గురు పోలీసులు తమను చుట్టుముట్టిన ఆడవాళ్ళను గమనించి ఒక్క క్షణం ఆలోచిస్తూ నిల్చున్నారు.

అంతే!

మరు నిముషంలో వాళ్ళ చేతుల్లోని లాఠీలు ఎటో ఎగిరిపోయాయి. వాళ్ళ శరీరాలు పిడికిలి పోట్లతో కంతులు దేరసాగాయి.

దూరం నుండి ఇదంతా గమనించిన మగవాళ్ళంతా సింహాల మాదిరిగా గర్జనలు చేస్తూ పోలీసుల వైపు దూసుకు వస్తుండడంతో తన కారణంగా మళ్ళీ జరిగిపోయిన సంఘటన పునరావృతమవుతుందేమోనన్న భయం వెన్నులో వణుకు

పుట్టిస్తుంటే గబ గబా లేచి జనానికి అడ్డం వెళ్లారు కృష్ణారావు మాష్టారు. "ఆగండీ! ఆగండీ!" అంటూ రెండు చేతులెత్తి ఊపుతూ ఊపుతూనే కాలు మడతబడి "అబ్బా!" అంటూ కూలబడిపోయారు.

మాష్టారు బాధగా అరుస్తూ కూలబడి పోవడంతో పోలీసుల మీదికి పోదామను కున్న జనం అంతా ఆయన్ని చుట్టుముట్టి "ఏటైంది బావూ! ఏటైంది?" అన్నారు కంగారు కంగారుగా.

ఆయన ఎడమచెయ్యి మణికట్టు పైన విరిగినట్టు అర్థమైన మల్లీశ్వర్ వెంటనే పక్కనున్న సుందరరావు వంక చూస్తూ "తువ్వాలొకటి తడుపుకు రావాలి" అన్నాడు.

పోలీసుల లాఠీ దెబ్బలకు మాష్టారు చెయ్యి విరిగిందన్న వార్త కార్చిచ్చులా జనాల్లో వ్యాపించింది.

మరో అరగంటలో 'స్వామిపేట ఆర్డీవో ఆఫీస్ ప్రాంగణంలో ధర్నా చేస్తున్న థర్మల్ ప్రాజెక్ట్ వ్యతిరేక పోరాట సంఘం వారిపై పోలీసులు జరిపిన లాఠీఛార్జిలో ముఖ్యనాయకులు కృష్ణారావు మాష్టారి చెయ్యి విరిగింది' అన్న వార్త అన్ని ఛాన ల్స్‌లో బ్రేకింగ్ న్యూస్‌గా వచ్చేసింది.

ఇంత జరిగిన తరువాత గాని ఆర్. డి.ఓ. బయటికి రాలేదు.

ఆ చెయ్యి నొప్పితోనే మెమోరాండం అందించిన మాష్టారు ప్రజల ఆకాంక్ష ఏమిటో కూడా వివరించారు.

మాష్టారు చెప్పిందంతా విన్న ఆర్డీవో "మీరు అడుగుతున్న డిమాండ్ చాలా జటి లమైంది. అది నా పరిధిలో సాధ్యమయ్యే సమస్య కాదు. అయినా నావంతు ధర్మంగా మీ డిమాండ్ ఏమిటో ప్రభుత్వా నికి రాస్తాను. ఆ తరువాత ప్రభుత్వం ఏం చేయమంటుందో, ఏం చేస్తుందో చూద్దాం గాని ముందుగా మీరు హాస్పిటల్‌కి వెళ్ళండి" అంటూ, తన జీపునే తీసుకుపొ మ్మన్నాడు.

"మీ జీపు మాకవసరం లేదు" అంటూ వేరే కార్లో కూర్చోబెట్టుకొని మాష్టారుతో బాటు జనమంతా హాస్పిటల్ వైపు పరు గులు తీశారు.

'హమ్మయ్య!' అనుకున్న పోలీసులు ఒక పెద్ద ప్రమాదం తప్పిపోయినట్టు గట్టిగా ఊపిరి పీల్చుకున్నారు.

## 14

జీవభద్ర శిబిరం అవిచ్ఛిన్నంగా కొన సాగుతూనే ఉంది.

బీల గ్రామాల జనానికి అదో పవిత్ర యాత్రా స్థలం మాదిరిగా మారిపోయింది. దేశ, విదేశాల మీడియాకు అదో డాక్యుమెం టరీ ఫిలిం స్టూడియో అయింది. మొత్తం మీద జీవభద్ర దీక్షా శిబిరం బహుళజాతి కంపెనీలను ఎదుర్కోవాలనుకునే సామా న్యుల చేతి పాశుపతాస్త్రంగా వెలుగులోకొ చ్చింది. దేశంలోని ప్రగతిశీల భావాలు ఉన్న వ్యక్తులకు అదో అధ్యయన కేంద్రమ యింది.

దేశం నలుమూలల నుండి ఎందరెం దరో పర్యావరణవేత్తలూ, సామాజిక ఉద్య మనేతలు, కవులు, రచయితలు, గాయ కులు తరలివచ్చి ఉద్యమానికి తమ సంఘీ భావాన్ని ప్రకటించసాగారు...

వచ్చిన కవులు, గాయకులు శిబిరం దగ్గర అప్పటికప్పుడు పద్యాలు, పాటలు అల్లి, వరుసలు కట్టి పాటలు పాడసా గారు.

ఆ పాటల్లో తమను తాము చూసుకున్న ఆయా గ్రామాల జనం తమ బాధలు, గాథలు పంచుకోవడానికి ఎక్కడెక్కడి నుండో ఇంతమంది కవులు, కళాకారులు కదిలి వస్తున్నారన్న తలంపుతో ఎప్పటిక

ప్పుడు పునరుత్తేజం పొందుతున్నారు. ఇది మరింత ధైర్యంగా పోరాడటానికి పునరంకి తమయ్యేలా వారిని చేస్తోంది. దాంతో కొత్త కొత్త పోరాట మార్గాలను అన్వేషించ సాగారు.

స్వామిపేట పర్యటన అనుభవాలను, పోరాట స్వభావాన్ని, వ్యాసాలుగా, కవిత లుగా, కథలుగా మలచిన రచయితలంతా వాటిని ప్రచురించసాగారు.

తమను పరామర్శించి, పోరాటానికి సంఘీభావం తెలపడానికి వచ్చిన సుదూర ప్రాంతాల వారందరికీ స్థానిక జనం గ్రామాలవారీగా వంతులు వేసుకొని స్వయంగా తమ ఇండ్లల్లో ఆశ్రయం కల్పిస్తూ వండి, వడ్డించసాగారు.

కృష్ణారావు మాష్టారు చెయ్యికట్టుతోనే తిరుగుతుండడంతో బొర్రయ్య, మాష్టారిని నీడలా అంటిపెట్టుకొని విరిగిన చెయ్యికి మారుగా తనే ఓ చెయ్యిగా మారిపొయ్యి అన్ని విషయాల్లో ఆయనకు సేవ చేయసా గాడు. ఇరవై నాలుగ్గంటలూ మాష్టారునే అంటిపెట్టుకొని తోడబుట్టిన వాడికన్నా ఎక్కువగా అతను ఆయనకు సేవలు చేయడం గమనించిన జనం మొత్తం 'అబ్బా! బొర్రయ్యలో ఎంత మార్పొ చ్చిందీ!? తన తప్పును తాను తెలుసుకొని దానికి ప్రాయశ్చిత్తంగా ఇంత సేవచేయడం నిజంగా గొప్ప విషయం' అనుకుంటూ అబ్బురపడసాగారు.

అవన్నీ ఏమీ పట్టించుకోని బొర్రయ్య తన పని తాను చేసుకుపోసాగాడు. కానీ, కన్నదాసు మాత్రం 'హైదరాబాద్‌లో మా తమ్ముడికి బాగోలేదు' అంటూ ఈ మధ్యనే అయిపు లేకుండా వెళ్ళిపోయాడు.

ఉద్యమానికి ప్రత్యక్షంగానూ, పరోక్షం గానూ సహకరిస్తున్నారన్న కుంటిసాకుతో స్వామిపేట మండలంతోపాటు విలాస, శి వపురం తదితర మండలాల్లో కూడా ఎంతోమంది ఉపాధ్యాయులను, ఇతర ఉద్యోగులను మంత్రి, ఎంపీలు దగ్గరుండి కావాలని దూర దూర ప్రాంతాలకు ట్రాన్స్ ఫర్లు చేయించడంతోపాటు మరి కొంత మందిని సస్పెండ్ కూడా చేయించసా గారు.

అయినా వాళ్లు ఏమాత్రం భయపడ కుండా మునుపటికన్నా చురుగ్గా ఉద్య మంలో పాలు పంచుకుంటూ తమ అక్రమ సస్పెన్షన్లకు, బదిలీలకు వ్యతిరే కంగా న్యాయస్థానాల్లో కేసులు వేసి, స్టేలు తెచ్చుకొని మరీ ఉద్యమంలో పాల్గొనసా గారు.

గ్రామాల్లో రాజకీయ పార్టీల మధ్య, వాటి కార్యకర్తల మధ్య స్పర్థలు అంతరిం చిపోయాయి. ఇప్పుడు అందరిదీ ఒకటే పార్టీ. అది పవర్‌ప్లాంట్ నిర్మాణాన్ని అడ్డు కునే పార్టీ. అందరిదీ ఒకటే జండా. అది ఉద్యమ జండా. అందరిదీ ఒకే ఎజెండా. అది కుచేలా కంపెనీ వాణ్ణి శాశ్వతంగా వెళ్ళగొట్టే ఎజెండా. మంత్రికి, ఎం.పి.కి రాజకీయ సమాధి కట్టే ఎజెండా.

ఎంతో పకడ్బందీగా ఉద్యమం నడిచిపో తున్న వేళ ఊహించని సంఘటన ఒకటి వేగంగా జరిగిపోయింది.

ఆ రోజు రాత్రి మాష్టారు ఇంట్లో పద కొండు గంటలదాకా ముఖ్య కార్యకర్తలు కొందరు రెండు మూడు రోజుల్లో ఢిల్లీ వెళ్ళి, కేంద్ర పర్యావరణ శాఖా మంత్రికి ఓ మెమోరాండం ఇచ్చి రావాలనే విషయం మీద చాలా సుదీర్ఘమైన చర్చ కొనసాగిం చారు.

ఆఖర్న చర్చ ముగించి, ఢిల్లీకి ఎవరెవరె ళ్ళాలో తీర్మానం చేసుకున్న తరువాత ఇక అందరినీ ఇళ్ళకు పంపించడానికని, వచ్చిన వాళ్ళతోపాటు కృష్ణారావు మాష్టారు కూడా ఇంట్లో నుండి బయటకొచ్చి మాట్లాడుతూ మాట్లాడుతూ వీధి చివరిదాకా వెళ్ళారు.

సరిగ్గా ఆ సమయంలోనే...

'ఢాం' అంటూ పెద్దమోత, కండ్లు మూతలు పడిపోయే వెలుగూ ఒక్కసారిగా ఆ పరిసరాల్లో సంభవించడంతో ఎక్కడ, ఏం జరిగిందో అర్థంగాక, ఎక్కడి వాళ్ళక్కడే అయోమయంతోనూ, భయంతోనూ కకావికలైపోయారు.

చిన్నచిన్నరాళ్ళు, కర్ర ముక్కలు, బుల్లెట్ల మాదిరిగా గాలిలో దూసుకొచ్చి తగలడంతో శరీరాలన్నీ గాయాలై రక్తాలు చిందుతున్నా ఆ షాక్‌లో నొప్పి తెలియక అలా పరుగులు పెట్టసాగారు జనాలంతా.

పావుగంట తరువాత మొదలైన క్షతగాత్రుల రోదనలతో ఊరంతా వణికిపోయింది. కృష్ణారావు మాష్టారు ఇల్లు రాళ్ళదిబ్బగా మారిపోయి ఉంది.

మాష్టారి ఇల్లు బాంబు పేలుళ్లతో కుప్పకూలిపోయిందన్న వార్త ఒక్కసారిగా అన్ని గ్రామాలను సుడిగాలిలా చుట్టేసింది.

విషయం తెలిసి ఆ రాత్రే ఇరవై ఎనిమిది బీల గ్రామాల జనం పరుగులు తీసుకుంటూ వచ్చి కృష్ణారావు మాష్టారు ఇంటి దగ్గర చేరారు.

దెబ్బలు తగిలిన వాళ్ళందరినీ వెంటనే ప్రభుత్వ ఆస్పత్రికి తరలించారు.

"ఓలమ్మో! ఓలమ్మో! మన నాయకులందర్నీ ఒకేసారి మట్టుబెట్టాలనే ఇంతపని చేశార్రా బావో!"

"ఇదంతా ఆ కంపెనీ వాడు మన వేలుతో మన కంట్లోనే పొడిచినట్టుగా ఎవరితోనోగాని మనవాళ్లతోనే ఈ పని చేయించి ఉంటాడు"

"ఔను, మేస్త్రి బావు ఇంట్లో బాగా తిరిగేవాళ్ళతోనే చేయించి ఉంటారు"

"నిజివే. ఇంత పనికి తెగబడ్డారంటే కంపెనీవోడు వాళ్ళకెన్ని డబ్బులు ముట్టజెప్పాడో? ఏటో?"

"వాళ్ళెవలోగాని దొరికితేనా, నిలువునా నరికేద్దుము" అంటూ జనమంతా రక రకాలుగా మాట్లాడసాగారు.

అందరి మాటలను ఆలకించిన కృష్ణారావు మాష్టారు చివరికి నోరు విప్పుతూ "నా ఇల్లు నాశనమైనందుకు కాదు నేను భయపడుతోంది, వచ్చిన వాళ్ళంతా ఇంకొక్క ఐదు నిముషాలు మా ఇంట్లోనే ఉన్నట్టయితే ఏమై ఉండేదో తలుచుకుంటేనే నా గుండె భయంతో జలదరించి పోతోంది" అంటూ తన మనసులో రగులుతున్న ఆవేదనంతా అక్కడివారితో పంచుకోసాగాడు.

"ఏముంది మాష్టారూ! మనం కంపెనీ వాడి డబ్బుకు, అధికారానికీ లొంగకపోవడంతో మనందర్నీ ఒక్కమాటే లేపెయ్యడానికి వాడే చివరికీవిధంగా చేయించుంటాడు" వళ్ళు తెలియని కోపంతోనూ, ఆవేదనతోనూ గొంతు బొంగురు పోతుంటే అందరూ చెప్పినట్టే తన అభిప్రాయాన్ని వెల్లడించాడు మల్లీశ్వర్.

ఇంతలో...

"గణ గణ మంటూ గంటలు మోగించుకుంటూ స్వామిపేట నుండి ఫైరింజన్, దాని వెనుకనే నూట ఎనిమిది అంబులెన్స్, వాటి వెనుక పోలీసు వాహనం దూసుకొచ్చి అసలే అయోమయంగా ఉన్న పరిస్థితిని మరింత గందరగోళంగా మార్చివేశాయి.

"వీళ్ళందరికీ ఎవరు చెప్పారబ్బా!" పోలీసులను చూడ్డంతోనే కోపంగా అన్నాడు రమణమూర్తి.

"మనోల్లే ఎవలో ఒకలు చేసుంటార్లే. ప్రమాదం ఎక్కడ జరిగినా, ఎలా జరిగినా విషయం తెలీగానే వీళ్ళంతా వస్తూనే ఉంటారు. దాన్ని కూడా మనం అనుమానిస్తే ఎలా? అనవసరంగా వాళ్ళతో ఇప్పుడు గొడవెందుకూ? వదిలెయ్" అంటూ రమణమూర్తిని వారించాడు రాజ

శేఖర్.

ఇంతలోనే...

"ఎండమ్మెందుకో బొర్రయ్యను చావ చితక్కొడుతుంటే అతగాడేమో 'నాకేటి తెల్దు, నాకేటి తెల్దు' అంటూ ఆ దెబ్బలకు ఓర్చుకోలేక ఆ పక్కనే ఉన్న పైడితల్లమ్మోరి గుడి బావిలోన దూకీశాడు" అంటూ దూరంగా పైడితల్లి గుడి దగ్గర్నుండి పరుగెత్తుకొచ్చిన ఒక వ్యక్తి మాష్టారు వాళ్ళకి చెప్పాడు.

ఆ మాటలు వినడంతోనే 'ఎండమ్మ బొర్రయ్యని కొట్టడమేంటి? అతను బావిలో దూకడమేమిటి? ' అన్న ఆశ్చర్యానికి గురైన మాష్టారువాళ్ళు వెంటనే పైడితల్లి గుడి దగ్గరికి పరుగులు తీశారు.

వాళ్ళ వెనుకనే ఫైరింజన్, అంబులెన్సులు కూడా బావి దగ్గరికి చేరుకున్నాయి.

బావిలో దూకిన బొర్రయ్య నీళ్ళు తాగి అడుగు పట్టకముందే సురక్షితంగా బయటకు తీసుకొచ్చేసరికి- హిస్టీరియా రోగిలా మనిషి మొత్తం గజ గజ వణుకుతూ "బావూ! మేష్త్ర బావూ! నిన్ను నమ్మించి నేను శానా ద్రోహం చేసినాను బావూ!" అంటూ పెద్దగా ఏడుస్తూ మాష్టారి కాళ్ళ మీద పడ్డాడు.

అతనంటున్నదేంటో మాష్టారుతో సహా అక్కడున్న వాళ్ళెవరికీ అర్థంగాక ఒకరి ముఖాలు ఒకరు చూసుకోసాగారు.

వెంటనే బొర్రయ్యను కొంతమంది అంబులెన్సులో ఎక్కించుకొని హాస్పిటల్ కు తీసుకుపోయారు.

హాస్పిటల్ లో డ్యూటీ డాక్టర్ వెంటనే ఏవో రెండు ఇంజక్షన్ లు ఇచ్చి కొంతసేపు వంటిగా ఉంచిన తరువాత గాని మామూలు మనిషి కాలేదు.

"నువ్వు ఏం తప్పు చేశావు!? ఎండమ్మ నిన్నెందుకలా చితగ్గొట్టింది? " అతని చుట్టూ చేరిన వాళ్ళంతా మెల్లిగా బొర్రయ్యను కదిలించారు.

ఆ మాటలను విన్న బొర్రయ్య "సేసిన పాపం సెప్పుకుంటే తీరుద్దంటారు బావూ! కానీ, నన్నేటి సెప్పమంటారు బావూ! ఏమని సెప్పమంటారు! నేను సేసిన ఎదవ పనేంటో ఎండమ్మ కనిపెట్టేసినాది. అందుకే నన్ను సావసితక్కొట్టింది. ఇంత బతుకూ బతికి ఆడకూతురు సేతిలోన సావుదెబ్బలు తిన్నాను. దేవుడులాటి మేస్త్రి బావుకి అన్నాయం చేసినాను. అందుకు నాకీ సిచ్చ పడాల్సిందే. ఇంక నేను బతికి ఎవలకూ ముఖం సూపించలేను. దాని కంటే సావే మంచిది. నన్ను సచ్చిపోనీండి బావూ!" అంటూ వల వలా ఏడవసాగాడు బొర్రయ్య.

"అరే బావూ! అసలు ఇసయమేటో సెప్పకుండా, అంతా ఏటో డొంక తిరుగుడుగా సెబుతావేటి? " అంటూ విసుక్కున్నారు రాజశేఖర్ వాళ్ళు.

అప్పటికే 'ఆ బాంబు పేలుడుకు, ఈ బొర్రయ్యకు ఏదో సంబంధం ఉంది' అన్న నిర్ణయానికొచ్చిన కృష్ణారావు మాష్టారు 'అతణ్ణింకేమీ అడక్కండీ!' అన్నట్టు అక్కడున్న వాళ్ళందరికీ కళ్ళతోనే సైగ చేశాడు.

'అసలు విషయమేంటో ఎండమ్మ నడిగితే తెల్సిపోతుంది కదా!' అనుకున్న వాళ్ళంతా "ఎండమ్మేది? ఎండమ్మేది? " అంటూ అక్కడంతా ఎంత వెతికినా, ఆమె ఎక్కడా కనబడలేదు.

'ఇప్పుడిదాకా ఇక్కడున్న మనిసి ఇంతలోనే ఎటు మాయమైంది? ' అన్న సందేహం, సంశయం, ఆందోళన అందరి గుండెల్లోనూ కొండలను కమ్ముకొచ్చే మేఘాల్లా అంతకంతకూ పెరిగిపోతూంటే ఆమెకోసం నలువైపులా వెదుకసాగారు.

జనం హడావిడి గమనించిన బొర్రయ్య "ఏటి! ఎండమ్మ కన్పించడం లేదా? ఓలమ్మో! అయితే ఎండమ్మను ఆల్లే ఎత్తు

# ప్రమాదాల నివారణలో ముందడుగు!




బ్లాక్‌బాక్స్ గురించి విమానాలు కూలినప్పుడల్లా వింటుంటాం. విమాన శిథిలాలలో ఉండే బ్లాక్‌బాక్స్‌లోని సమాచారం ఆ విమానం ఎలా కూలిందో పరిశోధించడానికి ఉపకరిస్తుంది. దానివల్ల భవిష్యత్తులో అలాంటిప్రమాదాలు జరగకుండా జాగ్రత్తలు తీసుకోవచ్చు.

జూన్ 1, 2009న ఎయిర్ ఫ్రాన్స్ విమానం అట్లాంటిక్ మహాసముద్రంలో కూలిపోయి 216 మంది ప్రయాణీకులు, పన్నెండు మంది సిబ్బంది మరణించారు. దాని బ్లాక్‌బాక్స్ దొరకనేలేదు. ఇప్పుడు బ్లాక్ బాక్స్‌లో నమోదు చేసే బదులు ఆ సమాచారాన్ని 'గ్లాస్‌బాక్స్' లో నమోదు చేసే ప్రయత్నాలు జరుగుతున్నాయి. గ్లాస్‌బాక్స్ అంటే అనేక సర్వర్స్‌గల డేటాబేస్. ప్రతి విమానంలో ప్రైవేట్ సంభాషణ, విమానం కూలడానికి కారణం తెలుసుకునే ఇతర సమాచారాన్ని వైర్‌లెస్ ద్వారా ఈ గ్లాస్‌బాక్స్ రిసీవ్ చేసుకుని పొందుపరుస్తుంది. బ్లాక్‌బాక్స్‌లో ఆఖరి 180 నిమిషాల సమాచారం మాత్రమే నమోదవుతుంది. గ్లాస్‌బాక్స్‌లో ఇంకా ఎక్కువ గంటల సమాచారం నమోదుచేయవచ్చు. విమానం బయలుదేరినప్పటి నుంచి ల్యాండయ్యేదాకా జరిగినదంతా రికార్డు అవుతుంది. సముద్రంలో విమానం కూలిపోయినప్పుడు బ్లాక్‌బాక్స్ కోసం వెదకాల్సిన అవసరం ఉండదు. ఈ సర్వర్ల నుంచి తక్షణం ఆ సమాచారాన్ని తీసి విశ్లేషించవచ్చు.



కుపోయుంటారు బావో!" అంటూ భయంతో వణికిపోసాగాడు.

"ఎండమ్మనెవరో ఎత్తుకుపోవడమేంటి!? అసలేం జరిగిందో వెంటనే చెప్పు" ఇల్లు మొత్తం శిథిలమైపోయినా కోపం తెచ్చుకోని కృష్ణారావు మాష్టారు ఎండమ్మకేదో జరిగిందనేసరికి ఆందోళన నిండిన మనస్సుతో బొర్రయ్యతో కటువుగా మాట్లాడారు.

ఎన్నడూ కోపంరాని వ్యక్తికి ఏదైనా సందర్భంలో కోపం వస్తే దాని పరిణామాలు ఎంత తీవ్రంగా ఉంటాయోనన్న అనుభవం ఉన్న బొర్రయ్య గజ గజా వణుక్కుంటూ అప్పటిదాకా జరిగింది ఒక్కొక్కటీ బయటకు కక్కేసాడు.

★ ★ ★

ఆ పూట స్వామిపేట సంతలో చేపలమ్ముకుని ఇంటికి కావల్సిన వెచ్చాలు కొనుక్కొని మసక మసక చీకటవుతుండగా ఏదో ఆలోచిస్తూ ఇంటిదారి పట్టింది ఎండమ్మ.

స్వామిపేట, జీవభద్ర రెండూళ్ళ నడిమయానికి వచ్చిన ఎండమ్మను దాటుకొని తెల్ల జీప్ ఒకటి ముందుకు వెళ్ళి రోడ్డు మలుపులో మాయమైపోయింది. రోడ్డు పొడవునా ఎటుచూసినా ఒక్క పురుగూ కనిపించడంలేదు.

మసక చీకటి మరికాస్త చిక్కబడింది.

మరికాసేపట్లో అక్కడేదో దారుణం జరగబోతోంది.. చూడాలన్నట్టుగా మింటిన చుక్కలు కన్నులు తెరిచి మరీ చూడసాగాయి.

రోడ్డుపక్కన కాలువల్లో కప్పలెందుకో అదే పనిగా అరవసాగాయి.

అప్రయత్నంగా ఆలోచనల్లో నుండి బయటికొచ్చిన ఎండమ్మ 'ఓలమ్మో! ఈ పక్షులేటిలగ నా తల మీదే ఎగురుతూ ఇలాగరుస్తున్నాయి' అనుకుంటూ అకారణంగా ఇదీ అని ఎరగని భయమేదో గుండెల్లో జొరబడి రంపు పెడుతుండడంతో భయం భయంగా ముందుకు అడుగులు వెయ్యసాగింది.

అంతలోనే ఆమె భయాన్ని నిజం చేస్తూ రోడ్డు మలుపున పొదల పక్కన ఆగివున్న జీప్పీ పక్కనుండి ఎవరో నలుగురు మనుషులు హఠాత్తుగా ముందుకొచ్చారు. వారు ఎండమ్మను చుట్టుముడుతూ "నీకోసమే చూస్తున్నాం" అని ఒక్కసారిగా అన్నారు.

"ఎవులు బావూ మీరు? నాకోసం సూడ్డమేటి? " ఓ పక్క కడుపులో భయం సుడులు తిరుగుతూ లేస్తున్నా పైకి మాత్రం బింకంగానే మాట్లాడింది. వాళ్ళను దాటుకొని వెళ్ళాలని ముందుకడుగులెయ్యసాగింది ఎండమ్మ.

"మేం ఎవరిమో తరువాత చెబుతాం గాని, ముందు మేం చెప్పేది విను" అంటూ ఆ నలుగురిలో ఒకడు బుస బుసమని నాగుపాములా బుసలు కొడుతూ అన్నాడు.

"ఏటి సెపుతారు? అసలు మీరెవురంటే సెప్పరేటి? " ధైర్యాన్ని కూడదీసుకుంటూ గట్టిగా ప్రశ్నించింది ఎండమ్మ.

"మాటాడకుండా మేం సెప్పేదినమంటే ఏటో కబుర్లు చెబుతున్నావేటి? " అప్పటిదాకా అందరికన్నా వెనగ్గా ఉన్న ఓ లావాటి పొట్టివాడు దున్నపోతు రంకె వేస్తున్నట్టుగా అరుస్తూ ముందుకొచ్చి ఎండమ్మ మెడమీద తన ఎడమ చెయ్యి వేసి విసురుగా ముందుకు తోశాడు.

ఆ పరిణామాన్ని ఏ మాత్రం ఊహించని ఎండమ్మ కొంతదూరం ముందుకురికి

రోడ్డుమీద బొక్కబోర్లా పడిపోయింది. ఆమె తలమీది చేపలబుట్ట, తక్కెడ కింద పడిపోయాయి. భయంతో వణికిపోతూ బిగ్గరగా అరుస్తున్న ఎండమ్మ అరుపులు గాలిలో కల్సిపోతున్నాయే తప్ప వినిపించు కునే మనిషే లేకుండా పోయాడు.

అరిచీ అరిచీ గొంతు చీరుకుపోయి మాట బయటకు రాక నిస్సత్తువుగా కళ్ళు మూస్తూ స్పృహ తప్పబోతున్న ఎండమ్మ నోటికి నీళ్ళసీసా అందించారు వాళ్ళు.

ఏ మాత్రం సంకోచం లేకుండా గటా గటా సీసాడు నీళ్ళు తాగేసిన ఎండమ్మ కాస్త స్థిమితపడి ఆ రోడ్డుమీదనే సర్దుకు కూర్చుంది.

"మేం జేప్పేది జాగరతగా విను. ఇదుగో నువ్విది ఎట్లా తీసుకుపోతావో? యేమో మాకు తెలియదు గాని, ఈ స్టీలు డబ్బా మాత్రం తీసుకుపోయి ఎవ్వరూ చూడకుండా ఆ కృష్ణారావు మాష్టారు ఇంట్లో పెట్టు, చాలు"

"నువ్వు గనక మేం చెప్పిన పని చేస్తే నీకు పది లక్షలిస్తాం. లేదా మేం ఏం చేస్తామో మాకే తెలియదు" అంటూ అప్ప టి దాకా జీప్సీలో దాచి ఉంచిన చిన్న స్టీలు డబ్బాను బైటికి తీసి చూపించాడు బక్కప ల్చటి పాము బుసలవాడు.

"ఏంటుందందులోన? " నీళ్ళు తాగేట ప్పుడు సీసాలోని నీళ్ళు ముఖం మీద పడ డంతో చీరకొంగుతో తుడ్చుకుంటూ అడి గింది ఎండమ్మ మొండి ధైర్యంతో.

"అది కృష్ణారావు మాష్టారు ఇల్లు పేల్చే యడానికి తెచ్చిన బాంబు" ఏదో పిచ్చిక గూడు కూల్చేయడానికి అన్నంత తేలిగ్గా చెప్పాడొకడు, పర పరమని గుట్కా నము లుతూ.

"నేను సచ్చినా ఆ పని సెయ్యలేను" ఒక్క క్షణం కూడా ఆలస్యం చేయకుండా బదులిచ్చింది ఎండమ్మ, వీరి బారినుండి ఎలా తప్పించుకోవాలా అని ఓ పక్క ఆలో చిస్తూనే.

ఎండమ్మ సమాధానంతో బుస్సున కోపం వచ్చిన పొట్టివాడు చెయ్యెత్తి తన బలం కొద్దీ ఎండమ్మ దవడలు రెండూ అదిరిపోయేటట్టు ఛెళ్లు ఛెళ్లున కొట్టాడు.

"నువ్వు చచ్చినా చెయ్యకపోవడం కాదు, చచ్చినట్టు చేస్తాననేలా ముందే ఏర్పాట్లు మేం చేసుకున్నాం" అంటూ కళ్ళవెంట నిప్పులు రాల్చాడు.

'ఏటది!? ఈ ఎదవ ఏటేటో వాగుతు న్నాడేటి? ' ఓ వంక ఏడుస్తూనే మరోవంక మనసులో ఆలోచించసాగింది ఎండమ్మ.

అప్పటిదాకా ఏదీ పట్టించుకోకుండా సిగ రెట్ తాగుతూ కూర్చున్న సన్నటోడు గబు క్కున ఎండమ్మ మీది కొంగి మొరటుగా ఆమె ఎద మీద కొంగును పక్కకు గుంజి పడేసి, జాకెట్టును హుక్స్ దగ్గర పట్టి ముందుకు గుంజి చటుక్కున ఓ సెల్‌ఫోన్ని లోపలికి జార విడిచాడు.

వాడి చర్యలకు ఒక్కసారిగా బిక్కచచ్చి పోయిన ఎండమ్మ, నోటెమ్మటి మాటలు రాని మూగదానిలా చేష్టలుడిగి అవమానం తోనూ, సిగ్గుతోనూ, చితికిపోతూ అత్తిప త్తిలా ముడుచుకుపోయింది.

మరొకడు బాంబున్న స్టీలు డబ్బాను ఆమె వళ్ళోకి విసిరేసి "మేం చెప్పినట్టు రెండు రోజుల్లో ఈ డబ్బాను ఎవ్వరికంటా పడకుండా మాష్టారు ఇంట్లో ఎక్కడోచోట పెట్టకపోతే ఆ తరువాత నీ పాట్లు కుక్క పాట్లే" అంటూ ఇంకా ఏదో అనబోతుం డగా ఫోను మోగింది. ఆ వెంటనే వాళ్ళు బిల బిలమంటూ వ్యాన్ ఎక్కి ఎండమ్మను హెచ్చరిస్తూ వ్యాన్‌ని వెనక్కి తిప్పుకుని వెళ్ళిపోయారు.

ఎదమీద నల్లతాచులా సెల్‌ఫోన్, చేతిలో మృత్యు కలశంలా స్టీలు డబ్బాతో నడిరోడ్డు మీద మిగిలిపోయిన ఎండమ్మకు

కాస్సేపటిదాకా తన పరిస్థితి ఏమిటో అర్థం కాలేదు.

ఓ పరాయి మగవాడు తన జాకెట్ గుంజి రొమ్ములు తాకుతూ లోపల జార విడిచిన సెల్‌ఫోన్, బలవంతంగా చేతిలో పెట్టి వెళ్ళిన బాంబు బాక్స్ రెండూ రెండు మిన్నాగుల్లా తనను భయపెడుతుంటే ఒక్కక్షణం 'వీటినిక్కడే వదిలేసి ఎలిపోతే ఏటవుతాది?' అనుకుంది ఎండమ్మ.

కానీ అంతలోనే ఆమె చెవుల్లో 'ఈ విషయం వేరే ఎవరితోనన్నా చెప్పినా, లేదూ వీటినెక్కడన్నా వదిలేసినా ముందు నీ పిల్లల్ని కిడ్నాప్ చేసి ఎత్తుకుపోయి చంపేస్తాం, జాగ్రత్త' అన్న వాళ్ళ మాటలు గింగురుమంటూ విన్పించాయి.

దాంతో ఒక్కసారిగా వళ్ళంతా నీరసం కమ్ముకొస్తుంటే 'ఆళ్ళు మనుషులు కారు, రాక్షసులు. ఆళ్ళు సెప్పినట్టు వినకపోతే అన్నంత పనీ సేసేస్తారు. మరిప్పుడు నేనేటి సెయ్యాల్రో దేవుడా!' అనుకుంటూ ఊరి వైపు భారంగా అడుగులు వేసింది ఎండమ్మ.

ఎట్టి పరిస్థితుల్లోనూ రోజూ సాయంత్రం ఆరుగంటలకల్లా ఇంటికొచ్చే తల్లి, రాత్రి తొమ్మిది గంటలవుతున్నా రాకపోవడంతో కాలేజీకి వెళ్ళొచ్చిన ఎండమ్మ చిన్నకూతురూ, స్కూల్‌కి వెళ్ళొచ్చిన కొడుకూ ఆందోళనతో ఎదురు చూడసాగారు.

ఆఖరికి పదిగంటలు కావస్తుండగా గుండెల మీది సెల్‌ఫోన్‌ను, చేపల బుట్టలో ఉన్న బాంబు బాక్స్‌నూ అగ్నిగోళాల్లా మోస్తూ...

ఏడ్చి ఏడ్చీ ఎర్రబారిన కళ్ళతోనూ, వేళ్ళ గుర్తులు తట్టుదేరిన చెంపలతోనూ ఒక్కరోజులో పది సంవత్సరాల వయసు మీదపడిన దానిలా కుంగిపోయిన ఎండమ్మ శూన్యంలోకి చూస్తూ నిస్తేజంగా ఇల్లు చేరింది.

ఆ స్థితిలో ఇల్లు చేరిన తల్లిని చూసిన పిల్లలిద్దరూ "ఏటమ్మా! ఏట్టైంది? అలగున్నావేటి? ఇంత రేత్రైనాదేటి?" ఒక్కసారిగా గొల్లుమంటూ ఆమెను అల్లుకుపోయారు.

పిల్లల ఏడుపులు విన్న చుట్టుపక్కల వాళ్ళంతా "ఏటేటి?" అంటూ లేచి గబగబా ఉరికొచ్చారు.

"ఏట్లేదు, ఈ రోజు సేపలమ్ముడు పోయేప్పటికి పొద్దోయింది. సీకట్ల ఇంటికి బేగి పారొస్తుంటే, ఎవలో తాగుబోతెదవలు బైకు మీదొచ్చి ఎనక నుంచి గుద్దీసినారు. దాంతో నేను బాలెన్స్ ఆపుకోలేక బిల్లబీటున కిందపడిపోనాను" అంటూ అప్పటికప్పుడు ఏదో నోటికి వచ్చిన కట్టు కథ అల్లి చెప్పింది ఎండమ్మ.

"అందుకేనేటి ఇంతలేటైపోనాది?"

"మరా బైకుబావులేటైపోనారు?"

"ఇంకా నయిమే గట్టి దెబ్బలేటి తగలేదు" అంటూ ఇరుగు పొరుగు వాళ్ళంతా ఎవరికి తోచింది వాళ్ళు కొంతసేపు సానుభూతిగా మాట్లాడి, నిద్రొస్తుందంటూ ఒక్కక్కళ్ళే మెల్ల మెల్లగా ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు.

అందరూ వెళ్ళిపోయిన తరువాత పిల్లలిద్దరికీ అన్నంపెట్టి, తనూ ఇంత తిని మంచాలేసింది ఎండమ్మ.

అప్పటిదాకా తల్లి రాలేదన్న ఆందోళనలో మునిగిపోయిన పిల్లలిద్దరూ పడుకున్న వెంటనే నిద్రపోయారు.

పిల్లలిద్దరూ నిద్రపోయారని నిర్ధారించుకున్న ఎండమ్మ బాంబు ఉన్న బాక్సును, సెల్‌ఫోన్‌ను తీసుకుపోయి జాగ్రత్తగా అటకమీద పెట్టివచ్చి మంచం మీద అలసటగా వాలిపోయింది. కానీ ఎంత కొట్టుకున్నా నిద్రపట్టక పోవడంతో లేచి కూర్చుని 'ఆళ్ళు సెప్పినట్టు మాష్టు బావు ఇంట్లోన బాంబెట్టకుంటే ఏటిసేస్తారు?

# ఇక్కడ చావు నిషేధం

పుట్టుకలా మరణం కూడా సహజమైంది, తప్పనిసరి. దాన్ని నిషేధించడం అసంబద్ధమైన చర్య. అయినప్పటికీ ప్రపంచంలోని నాలుగు చోట్ల ఆశ్చర్యకరంగా మరణాన్ని నిషేధించారు. గ్రీక్ ద్వీపం డెలోస్‌లో క్రీస్తు పూర్వం అయిదో




శతాబ్దం నుంచి మతపరంగా మరణం నిషిద్ధం. నార్వేలోని లాంగీ ఇయర్ బయన్ అనేచోట కూడా మరణాన్ని నిషేధించారు. డెబ్బై ఏళ్ళ నుంచి ఇక్కడి స్మశానంలో కొత్త శవాలని ఖననం చేయడానికి అంగీకరించడం లేదు. కారణం అక్కడ ఖననం చేసిన శవాలు కుళ్లిపోకపోవడం వారు గమనించారు. అక్కడ అంతటా చలి! అందువల్ల మరణోన్ముఖులను ఇక్కడి నుంచి నార్వేలోని మరోచోటికి పంపించేస్తుంటారు.

ఇటలీలోని ఫాల్సియానో డెల్ మసీకో అనే చోట మతమో, పర్యావరణ పరిస్థితులో మరణాన్ని నిషేధించడానికి కారణాలు కావు. మరణించిన వారి శవాలని పాతిపెట్టడానికి అక్కడ ఎంతమాత్రం చోటు లేకపోయింది. అందువల్ల 1964 నుంచి ఆ ఊళ్ళో మరణించే వారిని మరో ప్రదేశానికి తీసుకెళ్ళాలని మేయర్ శాసనం చేసాడు.

మరణాన్ని నిషేధించిన మరోప్రాంతం ఫ్రాన్స్‌లోని సర్‌పారెంక్స్. ఇక్కడ కూడా శ్మశానాన్ని పెంచడానికి అవకాశం లేకపోవడంతో మేయర్ ఆ ఊళ్ళో చావడాన్ని నిషేధించాడు. చివరగా జపాన్‌లో ఇట్స్ కుషిమా ద్వీపంలో షింటో మత విశ్వాసం ప్రకారం ఆ ద్వీపాన్ని పవిత్రంగా ఉంచాల్సివుంటుంది. కాబట్టి 1878 నుంచి అక్కడ చావు పుట్టుకలు నిషేధం. గర్భవతులను, ప్రాణాంతక వ్యాధులుగల వృద్ధులను మరోచోటికి పంపించేస్తారు.




# వేశ్య వెల ఎంత?

ఇటీవల ఫ్లోరిడాలోని పోలీసులు వేశ్యలని పట్టుకునే ఓ ప్రత్యేక ఆపరేషన్ నిర్వహించారు. ఆ రాష్ట్రంలోని అంతర్జాతీయ పర్యాటక కేంద్రమైన ఆర్లండోలో అండర్‌కవర్ డిటెక్టివ్‌లు విటుల్లా నటిస్తూ వేశ్యలను కనిపెట్టే ప్రయత్నం చేసారు. ఓ డిటెక్టివ్, వేశ్యలా కనిపించే ఓ నలభైఏడేళ్ళ మహిళ పక్కన తన కారు ఆపాడు. ఎక్కడ దింపమంటే, అక్కడ దింపుతానని చెప్తే, ఆమె కారెక్కింది. దారిలో ఆమెని అతను సెక్స్ కోరి, అందుకు ఎంత తీసుకుంటావని అడిగాడు. బదులుగా ఆమె చెప్పింది విని ఆశ్చర్యపోయాడు. మేక్‌డొనాల్డ్స్ రెస్టారెంట్‌లో రెండు డబుల్ ఛీజ్ బర్గర్లు, ఓ కోకోకోలా కొనిపెడ్తే చాలని ఆమె చెప్పింది. వాటి ధర కేవలం నలభై ఆరు డాలర్ల లోపే. గత మూడురోజులుగా విటులు లేక తనకు భోజనం కూడా లేదని చెప్పింది. ఈ మొత్తం సంభాషణ పోలీస్ హెడ్ క్వార్టర్స్‌లో వైర్లెస్ ద్వారా రికార్డయింది. దాంతో క్రిస్టినీ బేకర్ అనే ఆ వేశ్యను వ్యభిచార నేరం కింద అరెస్ట్ చేసారు.



ఆ స్టింగ్ ఆపరేషన్‌లో పాల్గొన్న పోలీసు ఆమెమీద జాలిపడి ఆమెకు తన దగ్గరున్న అరవై డాలర్లు ఉచితంగా ఇచ్చాడు.

పెడితే మాష్టుబావు ఇల్లు ఏటై పోతుంది? ఏటైతుంది? దిబ్బైపోతుంది. అల్ల మాట లిని అంత పనిచేస్తే దేవునిలాంటి మేష్త బావు క్షమించినా, ఆ దేవుడు నన్ను క్షమిం చడు' అన్న ఆలోచనల మధ్య కోడినిద్ర పోయింది ఎండమ్మ.

వీధిలో అందరికన్నా ముందుగానే లేచి పాచిపనులు చేసుకునే ఎండమ్మ ఏడవు తున్నా వళ్ళు నొప్పులతో, కళ్ళు ఎర్రబడి మంటలు పుడుతుంటే లేవలేక అలాగే మంచంలో పడి ఉండిపోయింది.

పిల్లలే లేచి చెరో పని చేసి ఆ పూటకు ఇంత అన్నం వండి పచ్చడి వేసుకుతిని, మరికొంత అన్నం బాక్సుల్లో పెట్టుకొ న్నారు. తల్లితో "లేచి ముఖం కడుక్కొని అన్నం తినమ్మా" అంటూ చెప్పి స్కూల్, కాలేజీలకు వెళ్ళిపోయారు.

అలా మూడురోజులు గడిచిపోయాయి.

ఆ మూడు రోజులూ ఎండమ్మ ఇంట్లో నుండి కాలు బయట పెట్టలేదు.

'ఏ క్షణంలో ఫోన్ మోగుతుందో, ఏ వార్త వినాల్సి వస్తుందో' అన్న భయంతో వణికిపోసాగింది.

'అర్జెంటుగా ఒక్కసారొచ్చిపో' అంటూ కృష్ణారావు మాష్టారి దగ్గరినుండి కబురు వచ్చింది. కానీ వెళ్ళడానికి మనసొప్పక వెళ్ళలేదు ఎండమ్మ.

నాలుగవరోజు ఉదయం పిల్లలు చదువు లకు వెళ్ళిపోయిన తరువాత ఇంట్లో కూర్చుని ఆలోచిస్తున్న ఎండమ్మ చెవులకు పిడుగుల వానలా అటకమీద నుండి సెల్ ఫోన్ చప్పుడు వళ్ళు ఝల్లుమనేలా విని పించింది.

గబ గబా ఫోన్ అందుకున్న ఎండ మ్మకు "మేం నీకిచ్చిన టైమ్ దాటి రెండు రోజులు అవుతున్నా చెప్పిన పని చెయ్య లేదు గదా! ఇహ చూసుకో ఏటి జరగబో తుందో?" అంటూ ఎండమ్మకు సమా ధానం చెప్పే అవకాశం కూడా ఇవ్వకుండా ఫోన్ కట్ చేశారు అవతలివాళ్ళు.

విషయాన్ని ఎవ్వరికీ చెప్పుకోలేక, కడు పులో దాచుకోనూలేక గట్టిగా ఏడిస్తే నలు గురికీ అసలు విషయం తెలిసిపోతుందే మోనన్న భయంతో కుళ్ళి కుళ్ళి ఏడ్చింది ఎండమ్మ. ఓ రెండు గంటల తరువాత 'ఏటైతే అదే ఔతుంది. ఎళ్ళి మొత్తం విషయం మాస్టుబావువాళ్ళకు చెబితే అన్నీ అల్లే సూసుకుంతాల్లే' అనుకొని గబ గబా లేచి బట్టలు మార్చుకుని, ఫోన్ తీసుకుని ఇంటికి తాళం వేసి స్వామిపేట బయలు దేరింది ఎండమ్మ.

ఊరుదాటి రెండు ఫర్లాంగులు నడి చిందో లేదో మళ్ళీ ఫోన్ మోగింది.

ఉలిక్కిపడుతూ ఫోనెత్తిన ఎండమ్మ గుండెలు బీటలు వారేలా "అమ్మా! ఈల్లె వల్లో బస్సుదిగి కాలేజికి నడిచిపోతుంటే నన్ను బలవంతంగా కార్లో ఎక్కించి ఎటో తీసుకుపోతున్నారే. నిన్నేటో పని సెయ్య మని సెప్పినారట కదా! నువ్వది సేసిం దాకా నన్ను వదిలి పెట్టరట. ఈళ్ళను సూస్తుంటే నాకు శానా బయమేస్తోందే" అంటూ ఏడుస్తున్న కూతురి మాటలు వి నబడ్డాయి ఆమెకు. ఇంకా ఏదో చెప్పబో తుండగానే ఫోన్ కట్టయ్యింది.

ఫోన్ కట్టవ్వగానే ఒక్కసారిగా తాను నడుస్తున్న రోడ్డుపక్కనే ఉన్న కానుగ చెట్టుకింద నిస్త్రాణంగా కూలబడి మళ్ళీ ఏదన్నా ఫోనొస్తుందేమోనని కంటికి కడివె డుగా ఏడుస్తూ కూర్చుంది.

తను ఎదురు చూస్తున్నట్టు నిజంగానే మళ్ళీ ఫోన్ రింగయ్యింది.

వెంటనే ఫోన్ తీసిన ఎండమ్మకు "చూశావా! మేం చెప్పింది చెప్పినట్టు చెయ్యకపోతే పిల్లల్ని ఎత్తుకుపోతామని ముందే చెప్పామా? లేదా? చెప్పినట్టే ఇప్పుడు మీ అమ్మాయిని ఎత్తుకుపోయాం.

ఇప్పటికైనా నువ్వా బాంబుడబ్బా తీసుక పోయి మాష్టారి ఇంట్లో పెట్టకపోతే సాయంత్రం కల్లా నీ కొడుకునూ ఎత్తుకు పోతాం. మాంచి వయస్సు మీదున్న నీ బిడ్డను గ్యాంగ్ రేప్ చేసి, చంపేస్తాం" అంటూ అవతలి వైపు నుండి మాటలు విన్పించాయి.

ఆ మాటలు వినడంతోనే కళ్ళు బైర్లు కమ్మి, భయంతో వళ్ళు చెమటలు కమ్ము తుంటే చెట్టు కింది నుండి మెల్లగా లేచి వెనుదిరిగి మళ్ళీ ఇంటిదారి పట్టింది ఎండమ్మ.

ఎలా చేరిందో ఏమో తనకు తెలియకుం డానే ఇల్లు చేరిన ఎండమ్మ అటకమీది బాంబుడబ్బాను ఓ సంచిలో పెట్టుకొని తిరిగి స్వామిపేట బయలుదేరింది.

ఈసారి కాలిబాటను వదిలేసి ఆటోను పట్టుకుని గంటసేపట్లో స్వామిపేట చర్చి సెంటర్లో దిగిన ఎండమ్మ ఎదురుగా ఉన్న చర్చి కాంపౌండ్ గోడ నీడకు నిలబడి 'నా ఒక్కదాని పిల్లలకోసరం వందల మందికి సాయం చేస్తున్న మేష్టుబావు ఇల్లు కూల గొట్టే పనిజేస్తే ఆ సూర్నారాయనసామి నన్ను క్షమిస్తాడా? ఏటన్నా కానియ్యి. ఈ బాంబు, ఈ సెల్లూ తీసుకొని నేరుగా స్టేష న్‌కి పోయి ఇన్‌స్పెట్రుబావుకి విషయ మంతా సెప్పి అప్పగించేత్తా. అనక ఆల్లే అన్ని సంగతులు సూసుకుంతారు' అను కుని కృష్ణారావు మాష్టారు ఇంటికి కాదని పోలీస్‌స్టేషన్ వైపు బయలు దేరింది.

పదడుగులు వేసిందో లేదో ఆమెనెవ్వరో గమనిస్తున్నట్టే మళ్ళీ ఫోన్ మోగింది. ఫోన్‌మోత వినడంతోనే గుండెలు జారిపో యిన ఎండమ్మ వణుకుతున్న చేతులతో ఫోనెత్తి చెవిదగ్గర పెట్టుకుంది.

"అమ్మా! ఇందాక లంచి బ్రేకులోన అన్నంతిని నోట్ బుక్కు కొనుక్కుందామని బజారుకొస్తే ఈల్లెవ్వలో నన్ను బలవం తంగా కార్లో ఎక్కించుకొని ఎటో తీసుకుపో న్నారే" అంటూ ఎండమ్మ కొడుకు ఫోన్లో ఒకటే ఏడవసాగాడు.

కొడుకు కూడా వాళ్ళ కబ్జాలోకి వెళ్ళి పోవడంతో ఎండమ్మ తల్లి మనసు సంక్షో భాన్ని వర్ణించడానికి వేయినోళ్ళున్న ఆ ఆది శేషునికి కూడా సాధ్యంకాని పనిగా ఉంది.

అటుచూస్తే ఎంతో మందికి ఆశ్రయ మిచ్చే మాష్టారు, ఇటుచూస్తే కన్నకడుపు. ఏది ముఖ్యమో తేల్చుకునే సంఘర్షణలో ఆఖరికి తల్లి మనసు మమకారాన్ని కూడా జయించిన ఎండమ్మ 'ఏటైతే అదే అవు తుంది. నేను మాత్రం మాష్టుబావు ఇంట్లో బాంబు పెట్టనే పెట్టను' అన్న తిరుగులేని నిర్ణయంతో తిరిగి ఇంటికే బయలుదే

> **కొత్తగాలి...**
>
> **స్త్రీని**
> **ప్రకృతితో పోలుస్తారు**
> **ఎప్పుడు తుపానుగా**
> **మారుతుందో తెలియక**
>
> – డి. చంద్రావంశీ,
> కర్నూలు

రింది.

ఎందుకో తలెత్తి చూసేసరికి దూరంగా చాలాసేపటి నుండి తననే గమనిస్తున్న ట్టుగా ఉన్న బొర్రయ్య కంగారు కంగారుగా పక్కకు తప్పుకోవడంతో ఎండమ్మ ఎదలో ఏదో అనుమానం రేకెత్తింది.

మరో రెండురోజులు గడిచిపోయాయి.

ఆ రెండు రోజులుగా పిల్లల దగ్గర్నుండి ఎలాంటి ఫోనూ రాకపోవడంతో వాళ్ళేమ య్యారోనన్న ఆందోళనతో ఒకవైపు కుంగి పోతున్న ఎండమ్మను 'పిల్లలేమయ్యారు?' అంటూ ఇరుగుపొరుగువాళ్ళు వేస్తున్న

ప్రశ్నలు మరింత బాధించసాగాయి.

'తన విషయం అందరికీ తెలిస్తే తమ పిల్లల్ని గూడా ఇలాగే ఎత్తుకుపోతారేమో నన్న భయంతో జనమందరూ ఉద్యమా నికి దూరమైతే ఇంతదూరం వచ్చిన ఉద్యమం ఏటైపోద్దో? ఏటో? అందుకే మొత్తం విషయమంతా మేస్త్రిబావుకి సెప్పి, ఆయన్నే ఏదో ఓటి సీయమంటే సరిపోతుంది' అనుకున్న ఎండమ్మ ఇంటికి తాళంవేసి స్వామిపేట కృష్ణారావు మాష్టారు ఇంటికి బయలుదేరింది.

హాల్లో కూర్చుని హైదరాబాద్ నుండి వచ్చిన ఎవరో విదేశీ విలేఖరులతో మాట్లా డుతున్న కృష్ణారావు మాష్టారు కిటికీ గుండా వాకిట్లో సందిగ్ధంగా నిలబడిపో యిన ఎండమ్మను చూసారు. ఎందుకు అగిపోయిందో ఏమో అనుకుని బయటి కొచ్చి "అక్కడే నిల్చున్నావేం లోపలికి రా!" అంటూ ఆమెను పిలిచారు.

మాష్టారు పిలుపుతో లోపలికొచ్చిన ఎండమ్మను చూస్తూనే "ఏంటి అలా ఉన్నావ్? వంట్లో బాగోలేదా? పిల్చినా వారం రోజుల నుండి ఇటువేపు రాలే దేంటి? " అంటూ హృదయం నిండుగా పలకరించారు.

"అబ్బే, అదేం లేదు బావూ! ఎండనబడి వచ్చాను గందా! అందుకే అలాక్కన్పి స్తున్నాను" ఆయన వెనుకే లోపలికొస్తూ అంది ఎండమ్మ.

లోపలికి రాగానే ఆమెను విదేశీ జర్నలి స్టులకు పరిచయం చేసిన మాష్టారు కొంత సేపటి తరువాత ఆమె వంక తిరిగి "నువ్ లోపలికెళ్ళి కూర్చో. నేను వీళ్ళతో మాట్లాడి పంపించిన తరువాత మనం మాట్లాడుకుం దాం" అంటూ ఆమెను లోపలికి పంపిం చారు.

తల వంచుకొని లోపలికెళ్ళిన ఎండ మ్మకు ఇల్లంతా రెండు మూడు రోజులుగా ఊడ్చినట్టు అన్పించకపోవడంతో 'ఆ పంతులమ్మక్కడ అమిరికాలోన ఇంకెన్నా ళ్ళుంటాదో ఏటో? ఇక్కడ మేస్త్రి బావు ఇల్లు, వాకిలి వదిలేసి ఉద్దెమంలోన రేయింబగల్లు ఈ వయసున తిండీతిప్పలు పట్టించుకోకుండా తిరుగుతున్నారు' అను కుంది. కాసేపు తన సమస్యను పక్కనబెట్టి ఇల్లంతా సర్ది ఊడుద్దామని చీపురుకోసం చూస్తే ఎక్కడా కన్పించకపోవడంతో మేడ మీద గదిలోనన్నా ఉందోమోనని పైకి ఎక్కసాగింది.

ఆమె అలికిడి విన్నాడో ఏమోగాని అప్ప టికే పైన ఉన్న బొర్రయ్య కంగారు కంగా రుగా కిందికి వస్తూ ముఖానికి పట్టిన చెమటను పంచ చెంగుతో తుడుచు కుంటూ కన్పించాడు.

అతని వాలకాన్ని చూడగానే మొన్నటి అనుమానం మారాకు తొడుగుతూ తన మనసులో కదలాడడంతో "ఏటి బావూ! పైనేటి సేస్తన్నావ్? అలాగున్నావేటి? " అంటూ గుచ్చిగుచ్చి అడిగింది ఎండమ్మ, బొర్రయ్యను.

"ఏట్లేదు, ఏట్లేదు మేస్త్రిబావు కింద కూసున్న తెల్లోల్లకోసం పాతపేపర్లు మేడ మీదున్నాయి సూడమంటే సూసొస్త న్నాను" అంటూ కంగారు కంగారుగా సమాధానం చెబుతూనే గబ గబా కిందికి వెళ్ళిపోయాడు.

అలా కిందకు వెళ్ళినవాడు కాస్తా మాష్టా రుతో "బావు! ఇంట్లోన ఆడమనిషికి వంట్లో బాలేదని ఫోనొచ్చింది. నేనెళ్ళొ స్తాను" అంటూ ఆయన సమాధాన కోసం కూడా ఎదురు చూడకుండా కంగారుగా బయటికి వెళ్ళిపోయాడు బొర్రయ్య.

"పాపం! వాళ్ళావిడకెలాగుందో? ఏంటో? ఆందోళనగా వెళ్ళిపోయాడు" బొర్రయ్య గురించి అనుకున్నారు మాష్టారు.

'మేస్త్రి బావు పేపర్లు తెమ్మంటే బొర్ర య్యి ఎందుకు నన్ను చూసి అంత కంగారు పడిపోనాడు' అనుకుంటూ ఎంత ఆలోచించినా ఎండమ్మకు విషయమేంటో అర్థంగాక అన్యమనస్కంగానే తన పనులు ఒక్కొక్కటీ పూర్తిచేసింది.

మరోగంట తరువాత విదేశీ విలేఖర్లను పంపించి లోపలికొచ్చిన కృష్ణారావు మాష్టారు "నిన్నీ పనులన్నీ ఎవరు చేయ మన్నారు? " ఆత్మీయతతో కూడిన చిరు కోపంతో ఎండమ్మను ప్రశ్నించారు.

"ఏటి బావూ! అలాగంతారేటి? ఆడమ నిషి లేని ఇల్లు ఎలాగుంతాదో నేనెరుగ నేటి? ఊరికే కూసునే బదులు ఇల్లంతా సిమ్మేసినానంతే గదేటి? " అంటూ చాలా తేలిగ్గా విషయాన్ని కొట్టిపడేసింది ఎండమ్మ.

ఇంతలో బురదపాలెం నుండి ఆ ఊరి సర్పంచ్ జగ్గారావు గ్రామస్తులతో కలిసి మాష్టారుకోసం వచ్చాడు.

వాళ్ళతో మాట్టాడుతూ కూర్చున్న మాష్టారికి చీకటిపడి లైట్లు వెలిగింది కూడా తెలియలేదు.

ముందుగా అనుకున్న ప్రకారం ఆ రాత్రి ఎనిమిది గంటలకు ఇరవైఎనిమిది గ్రామాల కమిటీల సభ్యుల సమావేశం ఉండడంతో అప్పటికే ఒక్కొక్కళ్ళూ మాష్టా రింటికి చేరుకోసాగారు.

ఎండమ్మే మాష్టారుకోసం ఆ పూటకు స్టౌ మీద ఇన్ని బియ్యాం పడేసి, బ్యాంక్ సెంటర్లో సన్నాసినాయుడు క్రీపాయింట్ నుండి పప్పు, సాంబార్ తెప్పించింది.

రాత్రి అవుతున్న కొద్దీ 'అక్కడా ఎద వలు పిల్లల్నేమి సేస్తున్నారో ఏటో? ' అన్న భయం ఆమెకు తెలియకుండానే ఆమె వంట్లోని అణువణువులోనూ స్పష్టంగా కన్పిస్తుంటే దుఃఖాన్నీ, భయాన్ని గుండె ల్లోనే తొక్కిపెడుతూ తనూ సమావేశంలో పరధ్యానంగా కూర్చుండిపోయింది.

'ఎండమ్మ ఎందుకోగాని తన్లో తనే ఏదో విషయంలో మథన పడుతోంది. ఏదైనా తనంతట తాను చెప్పాల్సిందే తప్ప దేవుడే దిగివచ్చి అడిగినా అసలు విషయం బయ టకు చెప్పదు. అంత ఆత్మాభిమానం ఉన్న మనుషులు చాలా అరుదుగానే ఉంటారు' ఓ పక్క సమావేశానికి వచ్చిన వాళ్ళంద రితో మాట్లాడుతూనే మరోపక్క ఎండ మ్మను గురించి ఆలోచించసాగారు కృష్ణా రావు మాష్టారు.

ఆ రాత్రి పదకొండు గంటలకు సమా వేశం ముగియడంతో 'ఈ రాత్రి టైమ్‌లోన ఏటి చెబుదును? ' అనుకున్న ఎండమ్మ తన పరిస్థితి విన్పించకుండానే తన ఊరి వాళ్ళందరితోపాటు కలిసి ఇంటికి బయలు దేరుతుండగానే మాష్టారు ఇంట్లో ఊహిం చని విధంగా బాంబు పేలింది.

బాంబు పేలగానే కకావికలైపోయిన కార్యకర్తలంతా దిశారహితంగా పరుగులు తీస్తుంటే అవేవీ పట్టించుకోకుండా అప్పటి దాకా ఎక్కడున్నాడో తెలియని ఓ వ్యక్తి కోసం అక్కడెక్కడా ఆగకుండా ఎటో వెళ్ళి పోయిన ఒకే ఒక వ్యక్తి ఎండమ్మ.

ఆ గందరగోళంలో ఎవరున్నారో, ఎవరు వెళ్ళారో, ఎవరి నెవరూ పట్టించుకో లేని పరిస్థితి.

ఎండమ్మ వడి వడిగా జీవభద్ర రోడ్డుకు పరుగెడుతూనే.. ఎందుకోగాని ఆ చీకట్లో గుడ్లగూబలా రోడ్డుకు రెండువైపులా చూడ సాగింది.

ఆ సమయంలో పైడితల్లి గుడిముందు వేపచెట్టు వెనుక నిలబడి ఉన్న ఆ వ్యక్తి ఎండమ్మ కంట పడనే పడ్డాడు. అతను ఎ వరో కాదు.. బొర్రయ్య.

అంతే! మూడే మూడు అంగల్లో బొర్రయ్యను చేరుకుంది ఎండమ్మ.

ఆ సమయంలో అక్కడ ఆదిపరాశక్తిలా

ప్రత్యక్షమైన ఎండమ్మను చూడ్డంతోనే మృత్యువును చూసినంత భయంతో వణికి పోతూ కాళ్ళల్లో సత్తువే లేనట్టు కొయ్యబొమ్మలా నిలబడిపోయాడు బొర్రయ్య.

"ఎర్రా నా బట్ట! ఏట్నువ్ చేసిన పని" అంటూ ఆడపులిలా గర్జించిన ఎండమ్మ గుడిముందు వేసిన పందిరికున్న ఓ బడితెను గుంజి చేతబట్టుకుని కోపంతో శివమెత్తినట్టు ఊగిపోతూ ఒక్కోదెబ్బ కొడుతుంటే దిక్కులు పిక్కటిల్లేలా మొత్తుకోసాగాడు బొర్రయ్య.

ఐదునిముషాల పాటు అక్కడ జరుగుతున్నదేమిటో ఎవరికీ అర్థంగాక అలా నిశ్చేష్టులై చూస్తుండిపోయారు.

ఆ రోజు ఎండమ్మ చేతిలో తన చావు తప్పదని గ్రహించిన బొర్రయ్య 'ఈమె చేతిలో చచ్చేదాని కంటే ఆ బావిలో దూకి చావడం మంచిది' అనుకొని, తను వెంటనే లేచి పక్కనే ఉన్న గుడి బావిలో గుభిల్లున దూకేశాడు.




"అదీ బావూ! జరిగింది" అంటూ అప్పటిదాకా జరిగిన సంఘటనలన్నింటినీ పూసగుచ్చినట్టు చెప్పుకొచ్చాడు బొర్రయ్య.

బొర్రయ్య చెప్పిందంతా విన్న మల్లీశ్వర్ కోపంతో ఊగిపోతూ "ఆ రోజున వీడు తిరిగి మన దగ్గరికి వచ్చినప్పుడే ఏదో దుర్బుద్ధితో వచ్చాడనే నేను వద్దన్నా. అయినా మీరే చేరనిచ్చారు. నిజంగానే పాముకు పాలు పోసినట్టు అనుకున్నంతా చేశాడు వీడు. ఇల్లు సంగతి తరువాత.. ఈ ఇల్లుపోతే అంతా కల్సి మరో ఇల్లు మాష్టారికి కట్టివ్వచ్చు. ఆ పిల్లలేట్లైనారో? ఎండమ్మ ఎటెళ్లిందో? వాళ్ళ సంగతేటో తెల్సుకోవాలి. వీణ్ణే నాలుగు పీకితే అన్నీ చెబుతాడు" అంటూ లాగిపెట్టి డొక్కలోకి అతను తన్నిన తన్నుడికి బొర్రయ్య అంతెత్తునలేచి కిందపడ్డాడు.

కిందపడ్డ బొర్రయ్య జుట్టు పట్టి "చెప్పు పిల్లల్నెక్కడ దాచారో? ఏంచేశారో? చెప్పు" అంటూ పిడుగులా గర్జించాడు.

మల్లీశ్వర్ ఎలాంటివాడో పూర్తిగా తెలిసున్న బొర్రయ్య "ఆ పిల్లల సంగతేటో నాకు తెల్దు బావూ. అదంతా కన్నదాసు వాళ్ళు సూసుకుంటున్నారు" గడ గడ వణుక్కుంటూ చెప్పుకొచ్చాడు.

"ఓహో! వాడు పిల్లల సంగతి సూసుకుంటూ ఉంటే... నువ్వు మాష్టారింట్లో బాంబులు పెట్టే పని చూసుకున్నావన్న మాట" అప్పటిదాకా అందరితోపాటు నిలబడి జరుగుతున్నదంతా చూస్తున్న సుందరావు మాష్టారు ఒక్కసారిగా ముందుకొచ్చి బొర్రయ్య ముఖం మీద ఈడ్చి కొట్టాడు.

ఆ దెబ్బకు పెదవులు రెండూ పగిలి రక్తం కారుతుంటే "నేనేటీ సేయాల బావూ! మీరంతా అనుకుంటున్నట్టు మొదట్లోన నేను డబ్బులకాశపడి వాళ్ళ జట్టులోన కలిసింది నిజవే. కానీ మీరంతా చేస్తున్న ఉద్యమం సూశాక బుద్ధి తెచ్చుకొని మీ దగ్గరకొచ్చేసినాను. మీరంతా కాదన్నా మాస్టు బావు దేవుని మాదిరిగా నన్ను ఆదరించాడు. అల్లాంటి బావు ఇంట్లో బాంబులెట్టినానంటే నేనెంత కాని పని సేశానో నాకు తెల్దేటి బావూ!" అంటూ గొల్లుమన్నాడు బొర్రయ్య.

"తెలిసీ అలగెందుకు సేసీవు మరి!"

అడిగారు సుందరరావు.

"ఏటి సెయ్యమంతావు బావూ! నా పని పులి మీద సవారీ సేసినట్టయ్యింది. వాళ్ళతో ఉండలేక, మీకు ద్రోహం సెయ్య లేక నాలో నేను సచ్చిపోనానంటే నమ్మండి.

ఎండమ్మ మనిషి కాదు బావూ.. దేవత! తన బిడ్డల్నీ దుండగులు ఎత్తుకుపోయినా మేష్ట్రుబావు ఇంట్లో బాంబు పెట్టనేదు. బాధనంతా తన గుండెల్లోన దాసుకుంది తప్ప ఎవ్వరికీ నోరిప్పి సెప్పనేదు.

దాంతో వాళ్ళు మొన్న నా బిడ్డను కూడా ఎత్తుకుపోనారు. మేస్టుబావు ఇంట్లో బాంబు పెట్టకపోతే నా బిడ్డను సంపేత్తా మన్నారు. ఎండమ్మకున్న గుండె ధైర్యం నాకు లేక, బిడ్డ మీద మమకారంతోటి నేనే మేష్ట్రుబావు ఇంట్లోన బాంబెట్టేసినాను. నన్ను మన్నించండి బావూ!" అంటూ మళ్ళీ కృష్ణారావు మాష్టారు కాళ్ళమీద పడి పోయాడు బొర్రయ్య.

బొర్రయ్య చెప్పిన మాటలతో మాష్టా రుతో సహా అక్కడున్న వాళ్ళందరూ ఆశ్చ ర్యంతో గడ్డకట్టుకుపోయారు.

"ఈ సంగతి తరువాత, ముందు మన ఎండమ్మ, ఆమె పిల్లలేటయ్యారో చూడాలి" ఆందోళనగా అన్నారు కృష్ణారావు మాష్టారు.

"కన్నదాసును పట్టుకుంటే అన్ని ఇష యాలూ ఇట్టే తెల్సిపోతాయి బావూ!" లబ లబ లాడుతూ చెప్పుకొచ్చాడు బొర్రయ్య.

అంతే! జనం మొత్తం గుంపులు గుంపు లుగా చర్చించుకోసాగారు.

"ఇంతకూ పిల్లలేమయ్యారో? ఎక్కడ దాచారో? ఆ సంగతెలా తెల్సుకోవాలి? ఎందుకైనా మంచిది వెంటనే పోలీసులకు విషయం చెప్పు" ఆందోళనగా అన్నాడు మాష్టారు, లాయర్ రాజశేఖర్‌తో.

ఇక ఆ రాత్రి అక్కడెవ్వరికీ కంటి మీద కునుకే లేదు.

ఆలయ ఆవరణలోనే సమావేశమైన ఉద్యమకారులంతా 'ఎండమ్మ ఎక్కడికె ళ్ళింది? పిల్లలు ఏమయ్యారు?' అని అను కోసాగారు.

చూస్తుండగానే తూర్పున చీకట్లను పార దోలుతూ వేకువరేకలు పొడచూపాయి.

ప్రాణికోటికి మరోరోజు మొదలయ్యింద నట్టుగా ప్రకృతిలో కదలిక మొదలయింది.

బొర్రయ్య హాస్పిటల్‌లో చేరిపోయాడు.

అంతలో... స్వామిపేట తహసీల్దార్ కార్యాలయం వెనుక సర్కారు తుమ్మచె ట్లల్లో ఇద్దరు పిల్లల శవాలు పడి ఉన్నా యన్న ఓ వార్త వినవచ్చింది.

అంతే! మరు నిమిషంలో జనం తహసీ ల్దార్ కార్యాలయం దగ్గరికి పరుగులు తీశారు.

అందరూ భయపడట్టుగానే ఆ శవాలు రెండూ ఎండమ్మ పిల్లలవే.

ఆడపిల్ల వంటి మీద నూలుపోగులేదు.

దారుణంగా రేప్ చేయబడిన దాఖలాలు స్పష్టంగా కన్పిస్తున్నాయి.

ఇద్దరి వంటి నిండా ఎక్కడ చూసినా గాయాలే కన్పిస్తున్నాయి.

రక్తపు మడుగులో పడివున్న ఆ పిల్లల శవాల పక్కనే స్పృహలేని స్థితిలో ఎండమ్మ కుప్పకూలిపోయి కన్పించింది.

ఈ వార్త సమీప గ్రామాలన్నింటిలోనూ సుడిగాలిలా నిమిషాల్లో పాకిపోయింది.

జనం చీమలదండు వచ్చినట్టు ఎక్క డెక్కడి నుండో రాసాగారు.

కొంతమంది యువకులు మంత్రి, ఎం.పి.ల ఇళ్లవైపు పరుగులు తీశారు.

వాళ్ళ ఇళ్ళు ఫర్లాంగు దూరంలో ఉన్నా యనగానే కోటగోడలా అడ్డుకున్న పోలీ సులు ఒక్క పురుగును కూడా వాళ్ళ ఇళ్ళ వైపు కన్నెత్తి చూడకుండా కనీ వినీ ఎరు గని బందోబస్తు ఏర్పాటు చేశారు.

పది గంటలకల్లా పోలీసులొచ్చి ఎఫ్.ఐ. ఆర్. రాసుకున్నారు. శవాలను పంచనా మాకు ఏర్పాట్లు మొదలుపెట్టారు.

ఆ ప్రయత్నాన్ని అడ్డుకున్న జనం శవాలను తహసీల్దార్ కార్యాలయం ముందు ఉంచి 'ఈ హత్యలకు బాధ్యులైన దుండగుల విషయంలో ప్రభుత్వం వెంటనే స్పందించి, హంతకులను పట్టుకుంటామనే హామీ ఇచ్చేదాకా శవాలను ఇక్కడి నుండి కదిలించేది లేదు' అని తేల్చి చెప్పారు.

జరిగిన దారుణం తెలియడంతో స్వామిపేటతో పాటు జిల్లా మొత్తం స్వచ్ఛందంగా బంద్ పాటించింది.

బీల గ్రామాల్లో జన జీవితం పూర్తిగా స్తంభించిపోయింది.

విషయం తెలియడంతో జిల్లా కలెక్టర్ స్వయంగా తానే వచ్చి "మీరంతా అడిగినట్టు వీలైనంత త్వరలో హంతకులను పట్టుకుని శిక్షిస్తాం. ఎండమ్మకు పదిహేను లక్షల ఎక్స్‌గ్రేషియా చెల్లిస్తాంగాని, ముందు మీరా శవాలను పోస్ట్‌మార్టం చేయించి మిగతా కార్యక్రమాలు జరుగనివ్వండి. ఆ ఖర్చుల కోసం కూడా నేనే డబ్బులిస్తాను" అంటూ ఓ పదివేలు తీసి మాష్టారి చేతిలో పెట్టబోయాడు.

అప్పుడే స్పృహలోకొచ్చిన ఎండమ్మతో విషయాన్ని వివరించిన మాష్టారు "ఏంచేద్దాం? " అంటూ ప్రశ్నించారు.

చాలాసేపు తర్జన భర్జన పడ్డాక కలెక్టర్ హామీతో శవాల పంచనామాకు అంగీకారం తెలిపిన నాయకులు పక్కకు తప్పుకొని పోలీసులకు శవాలను అప్పగించారు.

ఆ రోజు సాయంత్రానికి గాని పిల్లల శవాలకు అంత్యక్రియలు జరగలేదు.

ఎండమ్మ కడుపుకోతను తీర్చడం ఎవ్వరికీ సాధ్యం కానిది.

అది ఎలా తీర్చబడుతుందో కాలమే తగిన సమాధానం ఇవ్వాలి.

బొర్రయ్య కూతురేమైందో తెలియక ఆ కుటుంబం మొత్తుకుంటుంటే 'ఉద్యమ ద్రోహికి శాస్తి జరగాల్సిందే' అంటూ ఎవ్వరూ దాని గురించి పట్టించుకోలేదు.

తమకు సాయం చేయడానికి ఎవ్వరూ ముందుకు రాకపోవడంతో కూతురుకోసం ఏడ్చి ఏడ్చి చివరకు పోలీస్ స్టేషన్‌లో రిపోర్ట్ ఇద్దామని వెళ్ళిన బొర్రయ్యను కృష్ణారావు మాష్టారింట్లో బాంబు పెట్టినందుకు అదే అదనుగా భావించి అరెస్టు చేసి లోపల పెట్టేసారు పోలీసులు.

ఊళ్ళో ఇంత దారుణం జరిగినా మంత్రి నిశ్చింతరావుగాని, ఎంపీ గంగాజల్రావు గానీ అక్కడికి రాలేదు. రాకపోతే మానే,

> **కొత్తగాలి...** 
>
> **ఆకులు చలిస్తూ**
> **కవితలు చెబుతున్నట్టుంది**
> **కొమ్మలు, రెమ్మలు**
> **కవులన్నట్లున్నాయ్!**
>
> – జి. శ్రీశైలం,
> పెద్దచెల్మెడ, మెదక్ జిల్లా

చివరాఖరికి మీడియాలో వారు జరిగినదాన్ని ఖండిస్తూ ఒక్క ప్రకటన కూడా ఇవ్వకపోవడం జనాలను తీవ్రంగా కలచివేసి, ఆలోచించేలా చేసింది.

మూడురోజుల తరువాత ఎండమ్మ ఇంటి దగ్గర అన్ని గ్రామాల జనం సమావేశమై "ముందు ముందు ఉద్యమాన్ని ఏం చేయాలి? ఎలా నడపాలి? పడిపోయిన మాష్టారి ఇల్లునేం చేయాలి? ఎండమ్మనెలా ఆదుకోవాలి? " అని చర్చించుకోసాగారు.

ఎంతమంది చెప్పినా తన ఇంటి విషయంలో ఏ ఒక్కరి సహాయాన్నీ తీసుకోడా

నికీ మాష్టారు ఒప్పుకోలేదు. సరికదా, ఆ విషయంలో ఎవరైనా తనను బలవంతం చేస్తే 'అసలు ఉద్యమాన్నీ, ఈ ఊరినీ వది లిపెట్టి వెంటనే అమెరికాకు వెళ్ళిపోతా' అంటూ గట్టిగా హెచ్చరించడంతో ఇక ఎవ్వరూ ఇంటి విషయాన్ని ఎత్తలేదు.

'ఎండమ్మ, మేష్టుబావు లాంటి వ్యక్తులు ఉండడం వల్లే ఈ వ్యవస్థ ఈ మాత్రమైనా నడుస్తోంది' అనుకున్నారు ప్రజలంతా.

ఈ మూడు రోజులూ స్వామిపేట బంద్ కొనసాగుతూనే ఉంది.

వ్యాపారస్తులంతా "ఉద్యమనాయకులు చెప్పేంత వరకూ మేం దుకాణాలు తెరవనే తెరవం" అంటూ అపూర్వమైన సంఘీభావాన్ని ప్రదర్శించారు.

ఉపాధ్యాయులు, విద్యార్థులూ "ఎండమ్మకు న్యాయం జరిగి కంపెనీ సమస్య తేలే వరకూ పాఠశాలల్ని, కళాశాలల్ని బహిష్కరిస్తున్నాం" అంటూ సీరియస్‌గా ప్రకటించారు.

ఎండమ్మను పరీక్షించిన డాక్టర్లు "ఆమె ఆరోగ్య పరిస్థితి ఆందోళనకరంగానే ఉంది. కారణం ఈ మూడు రోజులుగా ఆమె పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టకపోవడంతో షుగర్ లెవల్స్ పడిపోయి బి.పి. పెరిగిపోయింది" అంటూ వివరించారు.

అంతే! ఎండమ్మకు ఏమవుతుందోనని అక్కడి ప్రజలంతా ఆందోళనతో అగ్ని పర్వతంలా ఉడికిపోసాగారు.

దాన్ని అవకాశంగా తీసుకున్న సంఘవిద్రోహ శక్తులు ఉద్యమకారుల రూపంలో ఆస్తుల లూటీకి పూనుకున్నాయి.

థర్మల్ ప్లాంట్ విషయం చిలికి చిలికి గాలివాన మాదిరిగా జటిలమైపోయిందన్న అంశం ముఖ్యమంత్రికి స్పష్టంగా అర్థమైపోవడంతో ఆయనే స్వయంగా ఆ రోజు ప్రెస్‌మీట్ పెట్టి "పవర్‌ప్లాంట్ నిర్మాణాన్ని పూర్తిగా విరమించేటందుకు నా వంతు ప్రయత్నం నేను చేస్తాను. అంతే కాదు, ఎండమ్మకు ప్రకటించిన నగదుకు మరో అయిదు లక్షలు కలిపి ఆమెకు పంపిస్తాను" అంటూ ప్రకటించాడు.

ముఖ్యమంత్రి అన్నట్టే ఆ మరునాటి మధ్యాహ్నానికల్లా చెక్కు తీసుకుని నేరుగా హాస్పిటల్ దగ్గరకొచ్చాడు హోంమంత్రి.

హోంమంత్రి వస్తున్నాడన్న సమాచారం ముందుగానే తెలిసి ఉండడంతో ఇరవై ఎనిమిది గ్రామాల ప్రజలంతా హాస్పిటల్‌కి దగ్గరకు చేరుకుని ఎం.పి. గంగాజగ్రావుకి, మంత్రి నిశ్చింతరావుకి, కుచేలా కంపెనీకి, ప్రభుత్వానికి వ్యతిరేకంగా పెద్దపెట్టున నినాదాలు ఇవ్వసాగారు.

ఆ నినాదాలను ఏమాత్రం పట్టించుకోని హోంమంత్రి ఎండమ్మను పరామర్శించి, తెచ్చిన చెక్కును అందించాడు.

బొటబొటా కళ్ళవెంట నీళ్ళు దుముకుతుంటే మౌనంగా చెక్కును అందుకున్న ఎండమ్మ వెంటనే "నా బిడ్డలను బలిదీసుకున్న దుర్మార్గులు ఇచ్చిన ఈ డబ్బులు నాకొద్దు మేష్టుబావూ! ఈ డబ్బుల్ని మన ఉద్దెమానికి ఇచ్చేస్తున్నా" అంటూ ఒక స్థిరమైన నిర్ణయంతో చెక్కును కృష్ణారావు మాష్టారు చేతిలో పెట్టింది.

ఎండమ్మ నిర్ణయాన్ని విన్న జనం ఒక్క నిముషం నిశ్శబ్దమైపోయింది.

ఆశ్చర్యంతో కాస్సేపు మూగబోయిన మాష్టారు తేరుకుని "ఫెళ ఫెళ ఎండకాస్తేనే ఈ వనగిరి ఆకుపచ్చగా కళకళ్ళాడుతుంది. వనగిరిలోని ప్రతి ఊరికో ఎండమ్మ పుట్టుకొస్తేనే ఈ 'ఆకుపచ్చ విధ్వంసం' అరికట్టబడుతుంది" అన్నారు ఎంతో ఉద్వేగంగా.

"జిందాబాద్! జిందాబాద్.. ఎండమ్మ జిందాబాద్" కట్టలు తెగిన ఉద్వేగంతో అక్కడి జనం చేస్తున్న నినాదాల నిప్పుకణం కార్చిచ్చులా రగులుకుంది ©

# పెట్టుబడి

- కోటమర్తి రాధాహిమబిందు



కెవ్వుమంది పంకజాక్షి..

మరోసారి కెవ్వుకెవ్వుమంది. "ఏంటి పంకజం అన్నిసార్లు కెవ్వుకెవ్వుమంటున్నావు" అంటూ వచ్చాడు సుబ్బారావు. బెడ్‌మీద ఉన్న కవరు వైపు వేలుపెట్టి చూపించింది పంకజాక్షి.

"ఏంటి కొత్త బట్టలే గదా- మా బాబాయి కొడుకు జనార్ధన్‌వాళ్లు పెట్టినవి.

"ఊ " అంటూ కోపంగా కవర్ బోర్లించింది.

అందులోంచి చీరె జర్రున జారిపడింది.

"ఏంటి... బాగా లేదా? ఏదోలే.. ఎన్నాళ్లు కట్టుకుంటాం? అయినా మంచి బట్టలు అంటూ వేరే ఉంటాయా అని నువ్వే అన్నావుగా? మన గృహప్రవేశానికి ధర మరీ ఎక్కువగాకుండా ఏవో కొనుక్కొచ్చావుగా. వాళ్లూ అలాగే అనుకుని కొనుక్కొని వచ్చివుంటారు. వదిలెయ్"

పంకజాక్షి మనసు రౌద్రంతో ఊగిపోయింది.

సుబ్బారావు ఆఫీసుకు వెళ్లగానే జనార్ధన్ భార్యకు ఫోను చేసింది. ఆ మాట ఈ మాటా

## చతుర కత

మాట్లాడి అసలు విషయానికి వచ్చింది.

"ఇలా అడుగుతున్నానని ఏమీ అనుకోకు సుందరీ. మాకు పెట్టిన బట్టలు మీకు ఎవరు పెట్టారు? ఫర్వాలేదు చెప్పు. మనకు నచ్చనివి, కాస్త పేలవంగా ఉన్నవి.. ఇలా ఎవరికైనా అంటగట్టడం మామూలేగదా" నవ్వుతూ విషయాన్ని రాబట్టింది.

"మాకు మా చెల్లెలు అడపడుచు ప్రమీలవాళ్లు పెట్టారు"

ప్రమీలకు ఫోన్ చేసింది పంకజాక్షి.

"మాకు మా పిన్ని కోడలు కోమలి పెట్టింది"

కోమలి పంకజాక్షికి స్నేహితురాలు. అలా కోమలికీ ఫోన్ చేసింది.

"మా చిన్నత్తగారి కోడలు పెట్టింది"

వివరాలు తెల్సుకుంటే.. ఆవిడ పంకజాక్షి మేనమామకు కోడలు శ్రీవల్లి.

ఇక అక్కడితో ఫోన్ల ప్రహసనం ముగించింది పంకజాక్షి.

★ ★ ★

ఆఫీసు నుండి వచ్చిన సుబ్బారావుకు కాఫీ అందించి ఆరాటంగా ఏదో చెప్పాలని ప్రయత్నిస్తోంది పంకజాక్షి.

"మళ్లీ ఆ చీర గోలేనా? "

"అదిగాదండీ.." అంటూ విషయం అంతా పూసగుచ్చింది.

"వాళ్ల ఫోన్ నెంబర్లు? "

"మొబైల్‌లో ఫీడ్ చేసుకున్నాలెండి. ఏ అవసరం ఎప్పుడొస్తుందోనని ఫోన్ నెంబర్లు తీసుకోవటం నాకు అలవాటే గదా? "

"ఏంటో.. ఏదో చెబుతున్నావ్.. నాకేం అర్థం గావటంలేదు"

"అసలు విషయం చెబుతానుండండీ.." గుసగుసగా అంది పంకజాక్షి.

వెర్రిముఖం పెట్టి చూశాడు సుబ్బారావు.

"ఆ బట్టలు మన గృహప్రవేశానికి మా మామయ్య కోడలు శ్రీవల్లికి మనం పెట్టాం. అవి అటు తిరిగి, యిటు తిరిగి మన చేతికే వచ్చాయి"

"ఆ!"

# మాతృభాషాభిమానానికి నిలువెత్తు రూపం



రవీంద్ర కేల్కర్

**దేశం, ప్రాంతం, భాష-పట్ల అసాధారణ ప్రేమాభిమానాలు పెంచుకుని, అకుంఠిత దీక్షతో స్వాతంత్ర్య సమరయోధుడిగా, గోవా విమోచనోద్యమ నాయకుడిగా, కొంకణి భాషోద్యమ సారథిగా విఖ్యాతి గాంచిన చరితార్థుడు రవీంద్ర కేల్కర్. బహుముఖాలుగా సాగిన ఉద్యమాలే శ్వాసగా జీవించిన ఆయన శతాధిక గ్రంథకర్తగా కొంకణి భాషా సాహిత్యాలను సుసంపన్నం చేశారు. ఆ భాషా సాహిత్యంలో ఆయన చేసిన కృషికిగాను 2006లో జ్ఞానపీఠ పురస్కారం అందుకున్నారు.**

రవీంద్ర కేల్కర్ 1925 మార్చి 25న దక్షిణ గోవాలోని కుంకోలిం నగరంలో జన్మించారు. తండ్రి రాజారాం కేల్కర్ సుప్రసిద్ధ వైద్యుడు, గొప్ప పండితుడు కూడా. ఆయన పోర్చుగీసు భాషలోకి అనువదించిన భగవద్గీత ఎంతో ఖ్యాతి గాంచింది. తండ్రి సాహిత్యాభిరుచిని రవీంద్ర చిన్ననాటనే పుణికిపుచ్చుకున్నారు. కుటుంబీకులు మధ్య గోవాలో ప్రియోక్ గ్రామానికి చెందిన వారు. రవీంద్ర పనాజీలోని లైసితుం హైస్కూలులో చదువుకున్నారు.

విద్యార్థి దశలోనే రవీంద్రలో జాతీయభావాలు పొంగులువారాయి. ఆ స్ఫూర్తితో గోవా విమోచనోద్యమంలోకి. క్రియాశీలంగా దూకారు. అప్పుడే స్థానిక నాయకులతోనూ, జాతీయనాయకులతోనూ సన్నిహిత సంబంధాలు పెంచుకున్నారు. రామ మనోహర్ లోహియా ప్రభావం వల్ల రవీంద్రలో విశేష భాషాభిమానం ఉరకలెత్తింది. ప్రజానీకంతో మమేకమయ్యేందుకు మాతృభాష శక్తిమంతమైన సాధనంగా ఎలా ఉపకరించేది గ్రహించారు. అదే కొంకణి పట్ల రవీంద్రునికి లక్ష్య నిర్దేశం చేసింది. అప్పటికే గాంధీజీ ఆదర్శాలు ఆయనను ఆకర్షించాయి. వార్ధా చేరుకున్న రవీంద్ర కేల్కర్ అక్కడ గాంధీజీకి అత్యంతాప్తుడు అయిన కాకాసాహెబ్ కాలేల్కర్ వద్ద భక్తిశ్రద్ధలతో శిష్యరికం చేశారు. తర్వాత ఢిల్లీలోని గాంధీ మెమోరియల్ మ్యూజియంలో గ్రంథపాలకుడిగా పనిచేశారు. ఆ దశలో గోవా పరిస్థితులు పిలుపునిచ్చాయి. తిరిగి గోవా విమోచనోద్యమంలో నేతృత్వ పాత్ర వహించారు. ప్రపంచం నలుమూలలల్లో ఉన్న కొంకణి ప్రజలను ఏకం చేసే సంకల్పంతో 'గోమంత్ భారత్' అనే వారపత్రికను ప్రారంభించారు. ఇది ముంబయి నుంచి అయిదు సంవత్సరాల పాటు లాటిన్ లిపితో వెలువడింది. విమోచనోద్యమంలో పాల్గొన్నందుకు ఆయనను పోర్చుగీసు ప్రభుత్వం జైలులో పెట్టింది. 1961లో భారతసైన్యం దండెత్తి గోవాను మనదేశంలోకి విలీనం చేసుకున్నప్పుడు రవీంద్ర కేల్కర్ విడుదల అయ్యారు. గోవా విముక్తి కలిగించిన ఆనందహేల మిన్ను ముట్టిన అనతి కాలంలోనే రవీంద్ర కేల్కర్‌ను తీవ్రంగా కలవరపరచే పరిస్థితులు ఎదురయ్యాయి. గోవాను పొరుగున వున్న మహారాష్ట్రలో కలిపేందుకు యత్నాలు ముమ్మరంగా

సాగడం, తన ప్రాంత అస్తిత్వ పరిరక్షణనే ఆయన తక్షణ కర్తవ్యంగా భావించారు. గోవాను కలిపి వేసే సంకల్పాన్ని ప్రతిఘటిస్తూ ప్రారంభమైన ఉద్యమంలో రవీంద్ర కేల్కర్ పాత్ర బలీయమైనది. 1967లో జరిగిన ప్రజాభిప్రాయ సేకరణతో గోవాకు ప్రత్యేక అస్తిత్వం నిలబడింది. అది కేంద్రపాలిత ప్రాంతంగా స్వతంత్ర ప్రతిపత్తితో కొనసాగింది. తదనంతరం గోవా ప్రత్యేక రాష్ట్రంగా అవతరించింది. ఉద్యమైక జీవిగా ప్రస్థానం సాగిస్తున్న రవీంద్ర కేల్కర్‌కు తనకు అత్యంత ప్రీతిపాత్రమైన కొంకణి భాషపై కృషి చేయడానికి తగినంత సమయం లభించింది. మరాఠీ భాష మాండలికంగా ప్రచలితమవుతున్న కొంకణి సముజ్జ్వల భాషగా గుర్తింపు పొందేందుకు బృహత్తరంగా ప్రయత్నాలు సాగించారాయన. ఇందుకోసం 'కొంకణి భాషా మండల్' అనే పేరుతో ఒక సంస్థ రూపుదిద్దుకుంది. తన మాతృభాషకు తగిన స్థానం చేకూర్చడం కోసం రవీంద్ర కేల్కర్ సాహిత్య సృజనను ఒక సాధనంగా చేసుకున్నారు. ద్విముఖంగా సాగించిన భాషా ఉద్యమం ఫలితంగా కొంకణి సంపూర్ణ భాషగా గుర్తింపు పొందింది. విద్యాబోధనలో, పరిపాలనలో మాధ్యమంగా ఉండాలని ఆయన జరిపిన పోరాటం ఫలితంగా గోవా శాసనసభ కొంకణిని అధికారభాషగా ఆమోదిస్తూ అందుకు తగిన చట్టాన్ని కూడా రూపొందించింది. రవీంద్ర కేల్కర్ కొంకణికి చేయవలసిన మరొక ముఖ్య సేవ దానికి రాజ్యాంగ స్థాయి కల్పించడం. అది అంత సులభ సాధ్యం కాదు. బి.జె. ఖేర్ అధ్యక్షులుగా ఏర్పడిన కేంద్ర అధికార భాషా సంఘం భారతదేశంలో 179 భాషలు, 549 మాండలికాలు వున్నట్లు పేర్కొంది. ప్రతి ప్రాంతంవారూ తమ భాషకు అలాంటిస్థాయి సమకూరాలని యత్నాలు సాగిస్తున్న తరుణమది. రవీంద్ర కేల్కర్ తనకు ఎదురైన చిక్కులన్నింటినీ తొలగించుకోగలిగారు. చివరకు భారతరాజ్యాంగం ఎనిమిదో షెడ్యూల్‌లో కొంకణిని చేర్చడంతో ఆయన ప్రయత్నాలు సఫలమయ్యాయి.

అత్యధికభాగం తన రచనావ్యాసంగాన్ని మాతృభాష కొంకణి వైభవ ప్రకటనకు, వికాసాభ్యుదయాలకు దోహదకారిగా వినియోగించిన విలక్షణ సాహితామూర్తి రవీంద్ర కేల్కర్. ప్రజలలో అవగాహన పెంచి, కొంకణి పట్ల మమతాభిమానాలు వర్ధిల్ల జేసేందుకు దీక్షతో రచనను ఒక యజ్ఞంగా ఆయన చేపట్టి శతాధికంగా గ్రంథాలు వెలువరించారు. 'ఆమ్చి భాష కొంకణిచ్' గ్రంథం తలమానికంగా నిలుస్తుంది. సాధారణ ప్రజలకు కొంకణి ఔన్నత్యాన్ని సుబోధకంగా చేసే ఈ గ్రంథం అత్యంత జనాదరణ పొందింది. సరళసుందరమైన శైలి, స్పష్టమైన అభివ్యక్తి నింపుకున్న ఈ కృతి పాఠకులలో మాతృభాష పట్ల గౌరవాదరాలు పెంచింది. ఇందులో రచయిత సంభాషణా ప్రక్రియను ఆకర్షణీయంగా వాడుకున్నారు.

'భాషెచెమ్ సమాజ శాస్త్ర' కొంకణి భాషపై ప్రామాణిక గ్రంథం. 'ఫాల్లెంట్ కొంకణి కిత్యాక్' గ్రంథం పూర్తిగా విద్యారంగానికి అంకితమైనట్టిది. గోవాలో విద్యార్థులకు తమ మాతృభాష కొంకణిలో బోధన జరిపితేనే వారి చదువులు అర్థవంతమవుతాయని ఆయన ఈ గ్రంథంలో సప్రమాణంగా విశదీకరించారు. ప్రభుత్వం ఈ వాదనను సమర్థించింది. ఆయన రూపొందించిన కన్నడ సాహిత్య గ్రంథ సూచి ఎంతో విలువైన సమాచారం అందించింది. సత్యాగ్రహ్, నవీశాల, మహాత్మా, తులసి, బహుభాషిక్ భారతంత్ భా




షెన్చె సమాజశాస్త్ర, మంగళ్ ప్రభాత్, సర్జాక్‌చి అంతర్‌కథ, సమధ, ముక్తి, వెలెవాలియె ఘులా, వొతంబె, పాంథశాల, మహాభారత అనువాదం వంటి గ్రంథాలు రవీంద్ర కేల్కర్‌కు కొంకణి సాహిత్యంలో సుస్థిర స్థానం చేకూర్చాయి.

రవీంద్ర కేల్కర్ కేంద్ర సాహిత్య అవార్డు, అనువాద పురస్కారం, సౌహార్ద సమ్మాన్, గోవా కళా అకాడమి పురస్కారం, అకాడమి ఫెలోషిప్ మొదలైనవి అందుకున్నారు. భారత ప్రభుత్వం 'పద్మభూషణ్'తో సత్కరించింది.

ఆయన 2010 ఆగస్టు 27న మార్మ గోవాలో పరమపదించారు. ప్రభుత్వం అధికార లాంఛనాలతో ఆయన స్వగ్రామమైన ప్రియోల్‌లో అంత్యక్రియలు నిర్వహించింది.

మాతృభాషాభిమానానికి నిలువెత్తు ప్రతిరూపమైన రవీంద్రకేల్కర్ కీర్తి సాహితీ లోకంలో చిరస్థాయిగా భాసిస్తుంది.

**– గోవిందరాజు రామకృష్ణారావు**

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**కె. పద్మావతి**

ఉప్పుటూరు,
పరుచూరు మండలం,
ప్రకాశం జిల్లా పిన్: 523169

## చతురంగం - 18 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ప్ర | కా | 2 శం | | 3 లే | త | | 4 కా | 5 వే | 6 రి |
| మ | | 7 క | 8 లి | మి | | 9 ఆ | లం | న | బ |
| 10 ద | 11 డ | | స | | 12 వం | ట | | రా | |
| | 13 క | 14 మ | లం | | గ | | 15 అ | జు | 16 డు |
| 17 ఆ | | క | | 18 జ | డ | 19 కు | చ్చు | | లు |
| 20 వి | 21 హా | రం | | 22 యు | ము | డు | | 23 ప్పు | బా |
| 24 రి | స | | 25 మో | ము | | 26 ము | గ్గు | లు | |
| | 27 ము | 28 మ | స | | 29 పా | లు | | 30 గు | 31 జా |
| 32 జా | | 33 న | గా | రా | | | 34 పా | | త |
| 35 కీ | చ | కు | డు | | 36 శౌ | ర్య | ప | త | కం |

### సరైన సమాధానాలు రాసిన వారు

1. భారతుల అరుణ, సికింద్రాబాద్, 2. కె. సరోజమ్మ, అనంతపురం, 3. డా. శివ భూషణం, కర్నూలు, 4. బి. ప్రభాకర్, విజయవాడ, 5. ఎ. విఘ్నేశ్వరరావు, పర్లాకిమిడి, 6. హెచ్. పద్మావతి, మియాపూర్, 7. వెల్మల నిరంజన్ రెడ్డి, కరీంనగర్, 8. కె. శశీదేవి, గుంటూరు, 9. బోడపాటి కృష్ణవేణి, టి. నగర్, చెన్నై, 10. పులికంటి రాజేశ్వరరావు, దిల్‌సుఖ్‌నగర్, 11. బిక్కునూరి రాజేశ్వర్, ఈద్‌గాం, ఆదిలాబాద్ జిల్లా, 12. డి. ఇందుమతి, ఎ.ఎస్. రావునగర్, 13. కన్నేపల్లి నారాయణమూర్తి, శ్రీకాకుళం, 14. టి. ఉషశ్రీ, దగదర్తి, నెల్లూరు జిల్లా, 15. బి. శాంతి, విజయవాడ, 16. సి.వి. రమణ, గట్టు, చిత్తూరు జిల్లా, 17. గేదెల రామారావు, ఏలూరు, 18. యల్లాప్రగడ కృష్ణమూర్తి, హైదరాబాద్,19. పి. దేవసేనమ్మ, సిద్ధార్థనగర్, హైదరాబాద్, 20. కె. లలిత, సైదాబాద్, 21. ఎన్. సాయికృష్ణప్రసాద్, ఎల్.బి. నగర్, 22. వి.వి.కె.యస్. లక్ష్మి, చోడవరం, విశాఖ జిల్లా, 23. వానపల్లి వెంకట సత్య గంగరాజు, విశాఖ, 24. పి.ఆర్. నాయుడు, తిరుపతి, 25. ఇందన మల్లికార్జున్‌రావు, ఏలూరు, 26. పి. ప్రభావతి, మియాపూర్, 27. డా. తూములూరి పార్థసారథి, చైతన్యపురి, హైదరాబాద్, 28. తల్లాప్రగడ మధుసూదనరావు, బెంగళూరు, 29. సి. సుధాకరరావు, తిరుపతి, 30. వి.వి. సత్యనారాయణ శెట్టి, తిరుపతి, 31. మొహమ్మద్ ఖాసిం, కల్లూరు గూడెం, ఖమ్మం జిల్లా, 32. కె. భానుమతీదేవి, వనస్థలిపురం, 33. కె. పి. శాస్త్రి, సికింద్రాబాద్, 34. చుండూరు శకుంతల, బాచుపల్లి, హైదరాబాద్, 35. వి.ఎస్.ఎన్. మూర్తి, విశాఖ, 36. నోముల సురేందర్‌రావు, హబ్సిగూడ, 37. ఉపద్రష్ట నరసింహమూర్తి, లాలాపేట, 38. యు. విజయశేఖర్‌రెడ్డి, కూకట్‌పల్లి, 39. జె. ఇందిర, ట్రూప్‌బజార్, హైదరాబాద్, 40. ఆర్. రమాదేవి, అనంతపురం, 41. సూరి నాగరాజు, రామవరప్పాడు, విజయవాడ, 42. పప్పు కామేశ్వరరావు, అమలాపురం, 43. బి. రాధా బుద్ధకవి, కర్నూలు, 44. కె. కృష్ణయ్య, కల్వకుర్తి, 45. దుప్పల రవికుమార్, టెక్కలి, 46. బమ్మిడి సుబ్బారావు, రిట్టపాడు, శ్రీకాకుళం జిల్లా, 47. కణుగుల గ్రీష్మ, శ్రీకాకుళం, 48. పి.వి. రంగాచార్యులు, వనస్థలిపురం, 49. యు.యు.యు. ఎమ్మిగనూరు, 50. మహమ్మద్ తహసీన్ అలి, వడ్డెపల్లి, వరంగల్ జిల్లా, 51. దేవులపల్లి లలిత, ఉయ్యూరు, 52. గరికపాటి శ్రీచైతన్య కృష్ణ, కాకినాడ, 53. అనంతుల సుబ్బారావు, గుంటూరు, 54. కె. చంద్రశేఖరశర్మ, నంద్యాల, 55. ఎం. అరుణకుమారి, ఒంగోలు, 56. మల్యాల రాజేశ్వరీదేవి, హైదరాబాద్, 57. మద్దూరి లక్ష్మీరాజ్యం, ఎర్రగడ్డ, 58. కె. వీణామాధురి, మీర్జాలగూడ, 59. ఆర్.వి.సి.హెచ్. నాగేశ్వరరావు, శ్రీకాకుళం, 60. జి. అమరేశ్వరి, ప్రొద్దుటూరు, 61. బైరపనేని స్వరాజ్యలక్ష్మి, గుంటూరు, 62. పి.బి. సీతాదేవి, నరసాపురం, ప.గో. జిల్లా, 63. కె. వెంకట బ్రహ్మమ్మ, బాపట్ల, 64. ఎం.వి.ఎస్. ధనలక్ష్మి, నరసాపురం, ప.గో. జిల్లా, 65. వి.ఆర్.కె. అల్లమరాజు, కాట్రేనికోన, 66. ఆరాద్ధి నరసింహమూర్తి, విజ్జేశ్వరం, ప.గో. జిల్లా, 67. టి. ఆర్. బాలకృష్ణారావు, రాజమండ్రి, 68. ఎ.వి. శివారెడ్డి, యర్రగుంట్ల, కడప జిల్లా, 69. ఆర్. సుశీల, విజయవాడ, 70. కొల్లూరి అంజనీదేవి, ఇంకొల్లు, ప్రకాశం జిల్లా, 71. కాకర్లమూడి రామలింగమూర్తి, తణుకు, ప.గో. జిల్లా, 72. కోనే నాగ వెంకట ఆంజనేయులు, విశాఖపట్టణం, 73. ఇ.ఎల్. నరసింహారావు, మధిర, ఖమ్మం జిల్లా, 74. కొక్కెరగడ్డ వెంకట లక్ష్మణరావు, మానేపల్లి, తూ.గో. జిల్లా, 75. కె.వి.జె. దాస్, మైలార్‌గడ్డ, సికింద్రాబాద్, 76. చాట్ల రంగమణి, కామారెడ్డి, నిజామాబాద్ జిల్లా, 77. కరణం శివ నాగమణి, చెట్టుపల్లి, విశాఖ జిల్లా, 78. నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్టణం, 79. వాసిరెడ్డి సుభాషిణి, శేకూరు, గుంటూరు జిల్లా, 80. కె.ఇ. నిలమంగై, ఈస్ట్ ఆనంద్‌బాగ్, 81. టి.వి.ఎం.కె. ప్రసాద్, నెల్లూరు, 82. కోట లలిత, లక్ష్మీనగర్, సికింద్రాబాద్, 83. ఎన్.వి. రమణి, బంజారాహిల్స్, 84. సి. అల్వాల్ రెడ్డి, సరూర్‌నగర్, 85. ఆంధ్ర రామలక్ష్మి, తణుకు, ప.గో. జిల్లా, 86. పి. లక్ష్మీప్రసన్న, కూకట్‌పల్లి, 87. అబ్బయ్యవారి దుర్గాప్రసాదరావు, కర్నూలు, 88. వి. శ్రీలక్ష్మి, నల్లకుంట, 89. శ్రీపెరంబుదూరు నారాయణరావు, హైదరాబాద్, 90. షేక్ అహ్మద్, సూర్యాపేట

# చతురంగం - 19 ఆధారాలు

**అడ్డం**

1. ఆశ్వయుజం తర్వాత వచ్చేది (3)
3. పురోభివృద్ధి (3)
5. బంధుత్వం అటునుంచి (2)
7. గొంతు, స్వరం (3)
8. యమలోకం (4)
9. శివుడు (3)
11. ముస్లిముల పవిత్ర గ్రంథం (3)
13. పన్నెండు అంగుళాలు ఒక... (3)
14. అడ్డం 8 కి వ్యతిరేకం (3)
17. - -ఈ భావం అందరికీ అవసరం (2)
18. ప్రవాహం.. అటునుంచి (2)
20. సూర్యుడు.. అటునుంచి (2)
21. రాసే కలం కాదు, సంచలనం (5)
24. తల్లి (2)
25. యాదవకుల నాశనానికి పుట్టింది (3)
26. వినోదం లాంటిదే అటునుంచి (3)
28. శిల (2)
29. గోవా ముఖ్యపట్టణం.. అటునుంచి (3)
32. 'మల్లీశ్వరి'లో ఎన్టీఆర్ పేరు, ఆదిశేషుడు (4)
34. అసత్యం - అశాశ్వతం (2)
35. పండుగ, సంతోషం (4)
36. తెల్లతామర, పులి (5)

**నిలువు**

1. పురుషార్థాల్లో మూడోది (3)
2. ఉత్తర రామాయణ కర్త పాపరాజు ఇంటిపేరు (3)
3. గొప్పవాడు, ముఖ్యుడు (4)
4. 'తింటాను' కు వ్యతిరేకం (3)
5. తెనాలి రామలింగ కవి ఇల్లా ప్రసిద్ధుడు (5)
6. నమిలితే కారం, కడుపు నొప్పికి ఇదే వైద్యం (2)
10. నగదే కింద నుంచి (2)
12. జొన్నల్లాగే ఇవీ ఒక రకమైన ధాన్యం (3)
13. నాగార్జున సతీమణి (3)
15. తలకిందులైన గాడిద (3)
16. దుఃఖం (3)
17. అన్నీ (3)
19. అల్లుడు (3)
22. ఉపాధి కోసం మరో చోటికి పోవటం.. గజిబిజి (3)
23. 'విపుల'లో కవితల ఫీచరు శీర్షిక (4)
27. పేరు లేనిది (4)
28. ప్రేమ, సంగీతానికి తప్పనిసరి (3)
30. జబ్బుచేసినప్పుడు తీసుకోవల్సిన నియమిత ఆహారం (3)
31. పల్లెల్లో వారానికోసారి జరిగే మార్కెట్.. కింద నుంచి (2)
32. గోగు, జనుము మొక్కల నుంచి తీసేది (2)
33. పెట్ట కాదు కానీ తిరగబడింది (2)

**నిబంధనలు**

✦ చతురంగాన్ని అదేపేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలింపబడవు. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

చతురంగం పంపాల్సిన చిరునామా :

**చతురంగం** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ -082

★ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు. ★ చతురంగం, చతురప్రవేశిక, కాప్షన్ మీదే, విపుల వినోదిని ఒకే కవరులో పంపినా పరిశీలిస్తాం

# చతురంగం - 19

రూ.150/- బహుమతి

గడువు తేది : అక్టోబరు 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | | 4 | | 5 | 6 వా |
| | | | | | | 8 | | | |
| 9 | 10 | | | 11 | 12 | | | | |
| | | | 13 | | | | 14 | | 15 |
| 16 | | 17 స | | | 18 | 19 | | 20 | |
| 21 | 22 | | | 23 | | 24 | | | |
| 25 | | | | 26 | | | | 27 | |
| | | | 28 | | | | 29 | నా | 30 |
| 31 | | 32 | గ | | 33 | | | 34 | |
| 35 | | | | | 36 | | | | |

పంపినవారి పేరు: ------------------------------------

వయసు ( ) చిరునామా: ------------------------------------

------------------------------------------------------------

------------------------ పిన్: ------------ ఫోన్ : ----------------

ఆధారాలు, నిబంధనలు 129 పేజీలో...

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, Plot No. 95 & 96, Gandhinagar, Quthubullapur Village & Mandal, R. R. District., Hyderabad-500 037. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net.

# కాప్షన్ మీదే - 46

ఈనాడు కార్టూనిస్ట్,
ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్
వేసిన పక్క కార్టూన్‌కు
నవ్వొచ్చే కాప్షన్ రాయండి.
చక్కని బహుమతి అందుకోండి!
బాగున్న మరో నాలుగు
ఎంపిక చేసి, పంపినవారి
పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన
చివరి తేదీ ఈ నెల 17



చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082
e-mail : vipula.chatura@eenadu.net

## ఉత్తమ వ్యాఖ్య :

**ఇతడు ఖచ్చితంగా మారు వేషంలోనున్న కర్ణుడే అయ్యుంటాడు**

– కె.వి. లక్ష్మణరావు, మానేపల్లి, తూ.గో.జిల్లా



## కాప్షన్ మీదే -45

బాగున్న మరికొన్ని కాప్షన్లు :

**విషాదంలో విలుకాడు**
**జాలీగా జాలరి**

– ముండూరు అప్పల నరసింహం
బాచుపల్లి, హైదరాబాద్

**గురిచూసి కొట్టబోతే**
**ఎరవేసి పట్టుకెళ్లాడు!!**

– యమ్మీ అప్పారావు, శ్రీరాంనగర్, రాజమండ్రి

**ఏంది సామీ**
**నా చేపే దొరికిందా**
**నీకు ఏటాడ్డానికి?**

– కేశవ రామయ్య గుండిమెడ, విజయవాడ

**విలన్ దెబ్బకు**
**హీరో ఔట్!**

– మహమ్మద్ తహసీన్ అలీ,
వడ్డేపల్లి, వరంగల్ జిల్లా

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. HD/965/2012-2014 RNI/32186/78